# సహకారోద్యమ మార్గదర్శకులు-
# రాఖ్‌డేల్ పయనీర్స్

**(Rochdale Pioneers of Co - operative Movement)**

ప్రపంచానికి సహకార జీవనవిధానములో త్రోవ చూపినవారు. ఇంగ్లండు దేశములోని రఖ్‌డేల్ పట్టణమునందలి 28 మంది చేనేత కార్మికులు, వారు 19వ శతాబ్దములో తమ తమ ఆర్థిక సమస్యలను పరిష్కరించుకొనుటకు ఈ విధానము నవలంబించిరి. వారు ఊలు మిల్లులో నేత నేసేవారు. వారి ఆదాయములు చాలా తక్కువ. వస్త్రముల ధరలు ఎక్కువ. పైగా అమ్మకం దారులు ఎన్నోతప్పుడు పద్ధతులవలంబించే వారు, రోజులు గడపడం ఎలాఅని వారు ఆలోచించేవారు. ఉన్న పరిస్థితులలో వేతనాలు ఎక్కువపొందే అవకాశంలేదు. కాని ఉమ్మడిగా కొనుగోలు చేయుటవలన ఖర్చులలో కొంత ఆదా చేయవచ్చునని భావించడంజరిగింది అందులో ఒకరు (Mr. Howrath Charles) తమంతట తామే ఒకస్టోర్సు నిర్వహించుట మంచిదని సలహా యిచ్చిరి. మరి యొకరు దానిని వ్యతిరేకించిరి, ఎందుచేత అంటే అది క్రొత్త ఆలోచన కాదు కనుక, 1830 లోనే కొంతమంది అలాంటి స్టోర్సును స్థాపించి సరిఅయిన పద్ధతులతో నడపడం సాధ్యపడక వాటిని మూసివేశారు. కాని చార్లెసు, స్టోర్సులు మూతపడుటకు ప్రధాన కారణం అరువుకు అమ్మకములు చేయుటవలన బకాయిలు పెరిగి వసూలు కాకపోవుట అని తెలిపినాడు. అందుచేత స్టోర్సును స్థాపించి జయప్రదంగా నిర్వహించుటకు కొన్ని విధానములను ప్రతిపాదించిరి.

1. అమ్మకములు నగదుకు మాత్రమే, మార్కెటు ధరలకు చేయవలయునని

2 సభ్యులందరూ స్టోర్సు వారికి కొద్దిదూరములోనున్నను వారికి కావలసిన వస్తువులన్నియు స్టోర్సులోనే కొని స్టోర్సుపట విశ్వాసము కలిగివుండవలయునని

3. మిగులును (Surplus Funds or Profits) సభ్యులకు వారు స్టోర్సు నుండి కొనగోలు చేసిన మొత్తముల నాధారముగా పంపిణీ చేయవలయునని.

కాని స్టోర్సుమ నడుపుటకు పెట్టుబడి ఏది ? వారంతా పేద వారు కావటంవలన పెట్టుబడి సమకూర్చటం ఒక సమస్యగా తయారయ్యింది. వారు పేదవారు కనుక వారికి అప్పుయిచ్చేవాళ్ళు లేరు. అందుచేత వారు తమ స్వంత వనరులమీదనే ఆధారపడుటకు నిర్ణయించుకొన్నారు, ప్రతివారూ వారానికి కొద్దిమొత్తమును పొదుపుచేసి పెట్టుబడి పెట్టాలని నిర్ణయించుకొన్నారు. ఆవిధముగా ఒక సంవత్సరానికి 28 పౌండ్లు వారు పొదుపుచేసి ఆ ధనముతో 1844 సం॥ లో రాఛ్ డేల్ న్యాయమైన మార్గదర్శక సంఘము (The Rochdale Equitable Pioneer's Society) ను స్థాపించిరి. కాని ఆ డబ్బు స్టోర్సుమ నడుపుటకు సరిపోదు, అందుచేత వారు ముఖ్యముగా దైనందిన అవసరములకు కావలసిన 6 వస్తువులతో మాత్రమే స్టోర్సును నడుపుటకు నిర్ణయించారు. Toad Lane అనే వీధిలో ఒక కొట్టును అద్దెకు తీసుకున్నారు. స్టోర్సును నడుపుటకు ఉద్యోగస్తులను నియమించుట కష్టసాధ్యం కనుక వారిలో ఒకరు వంతులవారిగా సాయంత్రము మాత్రమే స్టోర్సును, తెరిచేవారు స్టోర్సును నడుపుటకు వారు ఈ క్రింది 8 సూత్రములను రూపొందించి వాటికి అనుగుణంగానే స్టోర్సును నడిపేవారు.

1, సభ్యుల స్వపరిపాలనా పద్ధతి, ప్రతిసభ్యునకు ఒక ఓటు మాత్రమే.
2, సభ్యత్వమును అందరికీ అందుబాటులో వుంచుట.
3, పెట్టుబడిమీద పరిమిత లాభమును నిర్ణయించుట.
4. సభ్యుల కొనుబడుల నాధారంగా లాభాలను పంపిణీ చేయుట.
5. నగదుకు మాత్రమే అమ్మకములను చేయుట.
6. కల్తీలేని మంచి వస్తువులను మాత్రమే అమ్ముట.
7. సహకార సూత్రములలోను సహకార వ్యాపార పద్ధతులలోనూ వ్యాపారాభివృద్ధికి సభ్యులకు శిక్షణ యిచ్చుట.
8 రాజకీయ, మత విషయములలో తాటస్థ్యము వహించుట.

పై 8 సూత్రములు ప్రపంచమంతటా సహకార సూత్రములుగా వ్యాప్తినొందినవి.

సభ్యుల కృషివలన, వారు సంస్థపట్ల నిజాయితీగా ఉండుటవలన ఆ సంస్థ ఎంతో అభివృద్ధి సాధించింది. మొదటి సంవత్సరములోనే సభ్యుల సంఖ్య 28 నుండి 74కు పెరిగినది. 1851లో వేతనోద్యోగులను నియమించుకొన గలిగినది. 1851లో సభ్యుల అవసరములను తీర్చుటకు చెప్పుల తయారీ, దుస్తుల తయారీ, కుట్టువిభాగము మొదలగునవి స్వంతముగా ఏర్పరచుకొని నిర్వహించినది. 1838లో 1128 సభ్యులతో 8.4 లక్షల పెట్టుబడితో ఆ సంస్థ పనిచేసినది. 1858 నాటికి ఆ సంస్థ 88 బ్రాంచి స్టోర్సులను కలిగి 40,000 సభ్యులకు సేవచేయుచున్నది. గంటకు 12,000 రొట్టెలను తయారుచేయు బేకరి కలిగియున్నది. సం॥ నకు 2 1/2 లక్షల పౌండ్లను డివిడెండుగా పంచుతున్నది.

వీరినిచూచి ఇదేరకపు స్టోర్సులను అనేకం ఇతరులు ప్రారంభించి నిర్వహించిరి.

# జర్మనీ దేశములో సహకారోద్యమము

## (Co - operative credit movement in Germany)

సహకార పరపతి ఉద్యమానికి జర్మనీ పుట్టుకస్థలము, హిందూ దేశములోని సహకార ఉద్యమానికి ప్రేరణ, ఉత్తేజము ఇక్కడనుండి లభించినది, సర్ ఫ్రెడ్రిక్ నికల్సన్ (Sir Fredrick Nicholson) 1895 లో యూరపును దర్శించి, హిందూదేశములోని సహకార సంఘముల స్థాపనకు జర్మనీలోని పరపతి సంస్థల పద్ధతినే సిఫారను చేసినాడు. భారతదేశములోని గ్రామీణ ఋణభారాన్ని పరిష్కరించుటకు ఆయన ( Find Raiffeisen) 'రైఫీజను కనుగొనండి" అని సలహా యిచ్చినాడు.

19వ శతాబ్దిమధ్యమునాటికి జర్మనీలోని పరిస్థితులుకూడా మన దేశపు పరిస్థితులతో పోలివుండేవి. కరువులు, దారిద్ర్యము, దోపిడీ విధానము, ఋణభారముతో ప్రజలు సతమతమవుతూ వుండేవారు. పేద రైతులు, కూలీలు వడ్డీ వ్యాపారస్థులచే దోపిడీ చేయబడి అధిక ఋణభారముచే క్రుంగిపోయి వున్నారు. వర్తకమంతా జ్యూల (Jews) చేతులలో ఉండుటవలన రైతులు వారికి కావసిన వస్తువులను వారినుండికొని, తిరిగి తమ పంటను వారికి అమ్మేవారు. వస్తువులను అధికు కొనడం తిరిగి తమ పంటలను తక్కువధరకు వారికే యివ్వవలసివచ్చుటచే, రైతులు కూలీలు అధిక దారిద్ర్యముతో బాధపడవలసి వచ్చేది. ప్రతీపొలము, యిల్లు అప్పుకు కుదువ పెట్టబడి ఉండేది. గోరుచుట్టుకు రోకలిపోటు లాగా ఈ పరిస్థితులకు తోడుగా ఎక్కువగా క్షామములేర్పడి రైతులను క్రుంగతీసేవి. ఈ పరిస్థితులు ప్రజలలో క్రొత్త ఆలోచనలను రేకెత్తించినవి.

ఈ పరిస్థితులలో ఇద్దరు ప్రముఖ సహకారులు ప్రజల దీనపరిస్థితు

లకు జాలిపడి వారిని యీ స్థితినుండి తప్పించుటకు రకరకాల ప్రయత్నా లు చేయుట మొదలిడిరి. వారు రైఫీజను (Herr F. H. Raiffeisen] 1818-1888) (ఫ్రాన్జ్‌షుల్జ్ డెలిట్జ్ (Herr Franz Schulze-Delitzch' 1808-1883) వారు మొదట స్నేహితులతో కలసి దాన ధర్మాలకు ఏర్పాటు చేసినారు, కాని దానధర్మాలకంటె స్వయం సహాయము స్వయంకృషి మెరుగైనది, శాశ్వతమైనదని గుర్తించి పరస్పర సహాయానికి, స్వయం సహాయానికి కొన్ని సూత్రములను, పద్ధతులను రూపొందించిరి.

ఫ్రాన్జ్ షుల్జ్, జడ్జి. డెలిట్జ్ అనే పట్టణానికి అధ్యక్షుడు. ఈయన పేదల నుద్ధరించడానికి ఎంతో ఉత్సాహపడేవాడు. తన ఆదర్శాలకోసం ఉద్యోగమునుకూడా త్యజించిన వ్యక్తి, రైఫీజను తన పనితనమునకు ప్రసిద్ధిచెందిన మిలటరీ ఆఫీసరు, సివిలు ఇంజనీరు. వీరు ఉద్యోగులుగా వుండగానే సహకార రంగమున ప్రయోగములు చేయుట మొదలిడి ఇతరులకు మార్గదర్శకులైరి.

## షుల్జ్ ప్రజాబ్యాంకులు

షుల్జ్ కరువుసంఘపు (Famine Commission) అధ్యక్ష్యుడుగా ఆయా పరిస్థితులకు లోనైన ప్రజల దయనీయగాథను పరిశీలించినాడు. రొట్టె, తినువారికి ఉచితముగా పంచిపెట్టుటకు తన స్నేహితుల సహాయతో ఒక రొట్టెలషాపు (Bakery) తెరచినాడు. దాన పద్ధతికంటె వ్యక్తులు సహకార పద్ధతిలో పరస్పర సహాయంతోనూ, స్వయం సహాయంతోనూ తమ పరిస్థితులను చక్కపరచుకొనుట మెరుగైనది. అని గుర్తించి 1849లో చెప్పులు తయారుచేయు వ్యక్తులతో "స్నేహితుల సంఘము" ( Friendly Society ) ను ఏర్పరచినాడు. దీని ఉద్దేశం

సభ్యులకు కావలసిన పనిముట్లు, ముడిసరుకులు ఉమ్మడిగా పెద మొత్తము లో కొని వారికి అందచేయుట. 1850 సం॥ లో తన జన్మస్థలములో మొదటి సహకార పరపతి సంఘమును స్థాపించినాడు. ఈ సంస్థ లక్ష్యము నిధులను సమీకరించి సభ్యులకు అప్పుయిచ్చుట. ఈ సంస్థను నడిపిన అనుభవముతో 1856 సం॥లో కొన్ని సూత్రములను రూపొందించి ఒక పుస్తక రూపములో ప్రచురించినాడు. దీనివలన ఈరకపు సంస్థలు ఎక్కువగా అభివృద్ధి చెందినవి. 1859 సం॥లో ఈ రకపు సంస్థలను సమావేశ పరచగా అవి "The General Union of German Industrial Co-operatives " అను సమాఖ్యను స్థాపించినవి. అయన చనిపోవు నాటికి 1926 ప్రజాబ్యాంకులు స్థాపింపబడినవి.

## రైఫీజన్ బ్యాంకులు

రైఫీజను కూడా మొదట 1848 లో తన సంస్థద్వారా పేదలకు దానముచేయుట మొదలిడినాడు. తరువాత సంవత్సరములో ధనికుల తోడ్పాటుతో ఒక సంస్థను స్థాపించిపేదలకు (సభ్యులు కానివారికి. అప్పుగా యిచ్చుటకు ఏర్పాటు చేసినాడు. 1862 సం॥లో డబ్బు పెట్టుబడి పెట్టేవారిని, అప్పుపొందేవారిని రెండుతరగతుల వ్యక్తుల్ని సభ్యులుగా చేర్చినాడు. ఋణగ్రహీతలలో చాలామంది హామీ ఇవ్వలేరు గనుక ఉమ్మడి బాధ్యతమీదవారికి అప్పుగా యిచ్చుటకు నిర్ణయించినాడు. తీసుకున్న అప్పు సక్రమముగా వినియోగించుటలోనూ తిరిగి చెల్లించుటలోనూ వారిమధ్య పరస్పర పర్యవేక్షణ, అజమాయిషీ ఉండి బాధ్యతతో వ్యవహరింతురని భావించినాడు. 1877 సం॥లో Raiffeisen Union లేక The Grand Union of Rural Co-operative Societies అను సమాఖ్యను ఏర్పరచినాడు.

రైఫీజన్ బ్యాంకులు షుల్జ్ డెలిట్జ్ బ్యాంకుల స్థాపనలోను, నిర్వహణలోనూ ఈ క్రింది వివరింపబడినట్లు పోలికలు, భేదాలు ఉన్నవి

| రైఫీజన్ సంఘములు | షుల్జ్ బ్యాంకులు |
|---|---|
| 1. రైఫీజన్ వ్యవసాయదారులమధ్య తన కార్యక్రమములను ప్రారంభించుట వలన సంఘములలోని సభ్యులు ఎక్కువగా వ్యవసాయదారులై ఉన్నారు. | షుల్జ్ తన కార్యక్రమములను చేతిపనివారి తోనూ, కార్మికులతోనూ ప్రారంభించుట వలన, ఎక్కువగా వారే ఈ సంస్థలలో సభ్యులై ఉన్నారు. |
| 2. సంస్థల సభ్యులు చాలామంది పేదవారు. తాము తీసుకున్న అప్పులకు హామీ ఇవ్వలేరు కనుక ఉమ్మడి బాధ్యతమీద అప్పులు యిచ్చుటమంచిదని భావించిరి. సంస్థలను పరిమితిలేని పూచీతో స్థాపించడమైనది. | సభ్యులు, యితరుల కోసం తమ ఆస్తులను నష్టపడుటకు యిష్టపడరు అందుచేత పరిమిత బాధ్యతతో సంస్థలను స్థాపించిరి. |
| 3. అపరిమిత బాధ్యతకు రక్షణగా సభ్యులు అప్పులను వినియోగించుటలో పరస్పరపర్యవేక్షణ అవసరమని, ఇందుకు వీలుగాసంస్థ వ్యవహారిక విస్తీర్ణమును చిన్నదిగా ఉంచిరి. | బాధ్యత పరిమితము కనుక సభ్యుల మధ్య పరస్పర పర్యవేక్షణకు ప్రాధాన్యమివ్వక, సంస్థ వ్యవహారిక విస్తీర్ణమును పెద్దదిగా ఉంచిరి. |
| 4. సభ్యులు పేదవారు కనుక అప్పులు చిన్న మొత్తములలో ఎక్కువ కాలమునకు యిచ్చెడివారు. చిన్న చిన్న మొత్తములతో తీర్చుకొనుటకు అవకాశమిచ్చెడివారు. | అప్పులు పెట్టుబడి అవసరమును బట్టి పెద్ద మొత్తములలో తక్కువ కాలమునకు యిచ్చెడివారు. |

| | |
|---|---|
| 5. సభ్యులకున్న ఆస్తి కంటె సభ్యుల నడవడికి, నిజాయితీకి ఎక్కువ ప్రాధాన్యత యిచ్చేవారు. అందుచేత అప్పులను వ్యక్తి హామీ మీద, ఉత్పత్తి కార్యక్రమాలకు యిచ్చెడివారు. తీసుకొన్న అప్పుల వినియోగంపై పర్యవేక్షణ ఉండెడిది. | అప్పులను ఆస్తి హామీమీద ఉత్పత్తి అవసరములకు యిచ్చెడివారు. ఆస్తి హామీ వుంది కనక అప్పు వినియోగముపై పర్యవేక్షణకు ప్రాధాన్యత యిచ్చెడివారు కాదు. |
| 6. యీ సంఘములలో వాటాధనము నామ మాత్రము. మొదట్లో సభ్యుల నుండి వాటాధనము వసూలు చేసెడివారు కాదు. చట్టరీత్యా వసూలు చేయవలసివచ్చినపుడు నామమాత్రపు వాటాధనము వసూలు చేసెడివారు | బయటనుండి ఎక్కువ ద్రవ్యసహాయము పొందవలెనన్న సంస్థ ఎక్కువ మూలధనము కలిగి పటిష్ఠముగా ఉండవలెనని షుల్జ్ భావించాడు. అందుచేత వాటావిలువ ఎక్కువ మొత్తము ఉంచినాడు, |
| 7. సంస్థలను నిర్వహించుటలో లాభదృష్టి లేదు. లాభములను సభ్యులకు పంచకుండా మొత్తము లాభాలను సంస్థ ఆస్తిగా భావించి సంస్థలను పటిష్ఠపరచెడివారు. చట్టరీత్యా డివిడెండ్లను పంచవలసి వచ్చినపుడు లాభములలో చాలా తక్కువ మొత్తమును మాత్రము డివిడెండ్లనుగా పంచెడివారు. | సంస్థలను లాభదృష్టితో వాణిజ్య పద్ధతులతో నడిపెడివారు. అందుచేత డివిడెండ్లను పంచిపెట్టెడివారు. ఎక్కువ డివిడెండ్లను యిచ్చుటవలన సంస్థలకు మరింత మంచిపేరు వచ్చునని ప్రజాభిమానము కలుగునని భావించెడివారు. |
| 8. ఎక్కువ మొత్తము లాభములు (2/3 వంతు లాభములు) క్షేమనిధికి తీసుకొని పోయెడివారు | క్షేమనిధికి తక్కువ ప్రాధాన్యత యిచ్చెడివారు. చట్టరీత్యా ఏర్పరచవలసి వచ్చినప్పుడు 20 శాతము లాభములు, ప్రవేశ రుసుమును క్షేమనిధికి తీసుకెళ్ళెడివారు. |

9. సంస్థల నిర్వహణను కార్యవర్గ సభ్యులు గౌరవపద్ధతిలో జీతము లేకుండా చేసెడివారు, ఒక్క అకౌంటు పుస్తకములు వ్రాయు వ్యక్తికి మాత్రమే జీతము చెల్లించెడివారు, అందు చేత సంఘనిర్వహణ ఖర్చులు తక్కువగా వుండెడివి.

సంస్థలను శిక్షణపొందిన ప్రతిభ కలిగిన పూర్తి కాలపు వేతనోద్యోగులచే నిర్వహించేవారు. కార్యవర్గ సభ్యులు సంస్థలయొక్క విధాన సంబంధమైన విషయములను మాత్రమే నిర్ణయించెడివారు.

10 సభ్యుల ఆర్థిక ప్రగతితో పాటు శీలప్రగతికికూడా ప్రాధాన్యత యిచ్చెడివారు. వారిలో పొదుపు, కష్టించి పనిచేయడం, పరస్పర సహాయం స్వయం సహాయం అప్పును సకాలములో తిరిగి చెల్లించుట, మొదలగు మంచి అలవాట్లను ప్రోత్సహించెడివారు.

సభ్యుల నడత విషయములో పట్టించుకొనెడివారుకాదు. కాని సంస్థలు సభ్యుల ఆర్థికాభివృద్ధికి కృషి చేయవలయునని భావించెడివారు.

రైఫీజను, సంఘ సభ్యులు తమ నీతి నిజాయితీలే పెట్టుబడిగా [పర]స్పర సహాయంతోను స్వయం సహాయంతోను తమ ఆర్థిక [ప్ర]గతులను మెరుగు పరచుకొనవలెనని భావించినాడు, సంస్థలు లాభ [దృ]ష్టితో కాక సభ్యుల ఆర్థిక పురోభివృద్ధికి తోడ్పడుట ఆశయముగా [ప]చేయవలెనని భావించేనాడు.

షుల్జ్, ఈ సంస్థలు మంచి వ్యాపార పద్ధతులలో, పటిష్టంగా [పో]టీకి, యితర కష్టనష్టములకు తట్టుకొని పనిచేయుట అవసరమని [భా]వించినాడు.

# 4 భారతదేశంలో సహకార పరపతి ఉద్యమము

## History of Co-operative Movement in India

### పుట్టుపూర్వోత్తరాలు

భారతదేశం అనాదినుండి వ్యవసాయకదేశము. 70 శాతము ప్రజలు వ్యవసాయమే జీవనాధారముగా జీవిస్తూ ఉండేవారు. కాని వ్యవసాయము ప్రకృతిమీద ఆధారపడి వుండుటవలన అనావృష్టి, అతి వృష్టివలన రైతులకు ఫలసాయముమీద వచ్చే ఆదాయము చాలా అస్థిరంగానూ తక్కువగాను వుండేది. రైతాంగంలో ఎక్కువభాగం సన్నకారు రైతులు పేదరైతులే. వారికొచ్చే ఆదాయము కుటుంబ ఖర్చులకుకూడా సరిపోని స్థితిలో ఉండుటవలన వ్యవసాయ పెట్టుబడికి తప్పనిసరిగా అప్పులు చేయవలసి వచ్చేది. వడ్డీవ్యాపారస్థులవద్ద అధికవడ్డీకి ఋణాలు చేయవలసి వచ్చేది. చిన్నరైతుల విషయంతో వ్యవసాయం మీద వచ్చిన ఆదాయము అప్పులమీద చెల్లించవలసినవడ్డీకి సరిపోయేది కాదు. రైతులు ఋణాలను తీర్చలేని స్థితిలో వుండేవారు. అందువలన ఈ అప్పు మొత్తాలు ఏటేటా పెరుగుతూ వచ్చేవి. "భారతదేశం రైతు అప్పులలో పుట్టి, అప్పులలో పెరిగి, అప్పులలోనే మరణిస్తా"డనే నానుడి నిజమవుతూ వుండేది. ఋణబాధరైతులను జీవితాంతం వేధించేది. 19వ శతాబ్దాంతానికి బ్రిటిష్ ప్రభుత్వము న్యాయస్థానాలను నెలకొల్పింది. దీనితో వడ్డీవ్యాపారస్థులకు కోర్టులద్వారా తమఋణాలను పరిష్కరించుకోవడం తేలికయ్యింది. రైతులలో చదువుకొన్నవారు తక్కువ. వారు లాభనష్టముల గురించి ఆలోచించరు. గౌరవంగ బ్రతకటం ఎలాగా అన్నదే వారి సమస్య. భూమితో వారికున్న అనుబంధం విడివడినిది ప్రతిష్ఠాకరమైనది. అయితే ఋణాలను తీర్చలేని కారణంగా చాలామంది రైతులు తమ భూములను కోల్పోవలసివచ్చింది. ఈ పరిస్థితి రైతులలో

తీవ్రి అశాంతిని రేకెత్తించింది. 1875 వసం॥ లో కొన్ని ప్రాంతాల లోని రైతులు తిరుగుబాటు జరపగా, ప్రభుత్వం దీనికి కారణములను కనుగొనేందుకు The Deccan Riots Commission ను నియమించింది. దాని పర్యవసానంగా 1879లో The Daccan Agriculturists Relief Act ను ప్రవేశపెట్టింది. రైతులను అధిక వడ్డీలనుండి రక్షణ కల్పించటం దాని ఉద్దేశం. న్యాయమైన వడ్డీరేట్లను నిర్ణయించడం, వడ్డీ వ్యాపారస్థులను సక్రిమముగా పుస్తకములను వ్రాయాలని నిర్దేశించడం. భూములను తనఖా పెట్టడంలోనూ, బదలీ చేయడంలోనూ, నిర్బంధాలు విధించడం జరిగింది.

రైతుల ప్రాథమిక సమస్య సకాలంలో సరిపడు అప్పు తక్కువ వడ్డీకి అందుబాటులో ఉండడం. ఈ సమస్య పరిష్కారం కాలేదు. Sir william wedderburn అను ఒక మేజిస్ట్రేటు 1883లో మొట్టమొదటిగా పూనాలో ఒక వ్యవసాయ బ్యాంకును స్థాపించెను. ధనికులనుండి డిపాజిట్లు సేకరించుటకు, రైతులకు, పేదలకు అప్పులిచ్చుటకు వ్యవసాయ బ్యాంకుల స్థాపనను ఆయన ప్రభుత్వమునకు సలహాయిచ్చెను. ప్రభుత్వం 1883 లో భూమి అభివృద్ధి ఋణాల చట్టం (Land Improvements Act) 1884 లో వ్యవసాయ దారుల చట్టం (Agriculturist's Loans Act) ప్రవేశపెట్టింది. వీటినే 'తక్కావి' చట్టాలందురు. ఇవిదీర్ఘ కాలిక ఋణాలు, స్వల్పకాలిక ఋణాలు రైతుల కిచ్చుటకు ఉద్దేశింపబడినవి, ఈ చట్టాలక్రింద ఋణసౌకర్యం ప్రధానంగా కరువు కాటకాలు వచ్చిన ప్రాంతాలలో అందజేసేవారు. అందుచేత ఈ చట్టాలవలన రైతుల సమస్య పరిష్కారం కాలేదు, ఈ సమయంలో ఐరోపా దేశాలలో సహకార సంఘాలు రైతులకు చాలా ఉపయోగంగా వున్నట్లు నివేదికలు వెలువడినాయి. 1892లో మద్రాసు ప్రభుత్వం సర్ ఫ్రెడిరిక్ నికోల్సన్ Sir Frederich - Nicholson: I. C. S.) అనే ఉన్నతోద్యోగిని

యూరపులో పనిచేయుచున్న సహకార సంఘములను పరిశీలించుటకు గాను పంపించెను ఆయన 1895-1897 సం॥లలో రిపోర్టులను సమర్పిస్తూ జర్మనీలో స్థాపించబడిన "రైఫీజన్" పద్ధతిలో గ్రామీణ పరపతి సంఘాలను స్థాపించవలెనని సిఫార్సు చేసినాడు. ఉత్తరప్రదేశ్ ప్రభుత్వము శ్రీ డ్యూపర్ నెక్స్ (Mr. Dupernex, I. C. S.) అనే ఉన్నతోద్యోగిని వ్యవసాయ బ్యాంకుల స్థాపన గురించి పరిశీలించవలసినదిగా కోరింది. శ్రీ డ్యూపర్నెక్స్ తన సిఫార్సులను 1900 సం॥లో ప్రచురితమైన "ఉత్తర భారతంలో ప్రజల బ్యాంకులు" అనే పుస్తకంలో వివరించాడు. వారి నివేదికలను కేంద్ర ప్రభుత్వ దృష్టికి తీసుకురాగా, కేంద్ర ప్రభుత్వం (Lord curzon's Govt) సర్ ఎడ్వర్డు లా (Sir Edward Law) అధ్యక్షతన 1901 లో ఒక కమిటీని ఏర్పరచి భారతదేశంలో సహకార సంఘముల స్థాపనకు అవకాశములను పరిశీలించవలసినదిగా ఆదేశించింది. ఈ కమిటీలో సర్ ఫ్రెడరిక్ నికోల్సన్, శ్రీ డ్యూపర్ నెక్స్ సభ్యులు. ఈ కమిటీ సహకార సంఘముల స్థాపనకు వీలుగా ప్రత్యేకమైన చట్టమును ప్రవేశపెట్టవలసినదిగా సిఫార్సు చేసింది. కరువు కాటకాల కమీషను (Indian Famine Commission - 1901) కూడా పరస్పర సహకార పద్ధతిపై పరపతి సంఘముల (Mutual Credit associations) స్థాపనకు సిఫారసు చేసింది.

## సహకార పరపతి సంఘముల చట్టము - 1904

కేంద్ర ప్రభుత్వము సహకార సంఘముల స్థాపనకు వీలుగా 1904 లో సహకార పరపతి సంఘముల చట్టమును ప్రవేశపెట్టింది. దీనివలన గ్రామాలలో గ్రామీణ పరపతి సంఘములను, పట్టణములలో పట్టణ సహకార పరపతి సంఘములను స్థాపించుటకు అవకాశం ఏర్పడినది.

ఈ చట్టములోని ముఖ్యాంశములు.

1. సహకార పరపతి సంస్థల ఉద్దేశ్యము డిపాజిట్లరూపములో కాని యితర పద్ధతులలో కాని, నిధులను సేకరించి సభ్యులపరపతి అవసరములను తీర్చుట. రిజిష్ట్రారు యొక్క ప్రత్యేక అనుమతితో యితర సహకార పరపతి సంఘములకు కూడా అప్పులు యివ్వవచ్చును.

2. 18 సం॥లకు పై బడిన వ్యక్తులు సంఘములలో సభ్యత్వానికి అర్హులు. ఒక సంఘాన్ని స్థాపించుటకు 10 లేక అంతకు మించిగాని సభ్యులుండవలెను.

3. 4/5వ వంతు సభ్యులు వ్యవసాయదారులుగా వుంటే దానిని గ్రామీణ పరపతి సంఘమనియు, 4/5వ వంతు సభ్యులు వ్యవసాయేతరులుగా ఉంటే దానిని పట్టణ సహకార పరపతి సంఘముగా నిర్ణయించవచ్చును.

4. ఈ సంఘములు సహకార సంఘముల రిజిష్ట్రారు పర్యవేక్షణతో పని చేయును. ప్రభుత్వ అధికారులు ఆడిట్ చేయుదురు.

5. గ్రామీణ పరపతి సంఘముల ఋణబాధ్యత పరిమితి లేని పూచీగాను, పట్టణ పరపతి సంఘముల బాధ్యత పరిమితమైన పూచీగా కాని పరిమితి లేని పూచీగా కాని అయివుండవలెను.

6. గ్రామీణ పరపతి సంఘములలో లాభములు (డివిడెండ్లుగా పంపకము చేయక) క్షేమనిధికి పోనివ్వవలెను.

7. పట్టణ పరపతి సంఘములలో, లాభములలో 25 శాతం లాభము అను క్షేమనిధికి పోనివ్వకుండా డివిడెండ్లను పంచరాదు.

## సహకార సంఘముల చట్టము - 1912

1904 చట్టములో పరపతేతర సంఘములనుకాని, కేంద్రసహకార సమాఖ్యలను కాని స్థాపించుటకు వీలు కల్పించలేదు. ఈ లోపములను సవరిస్తూ 1912లో సహకార సంఘముల చట్టమును ప్రవేశపెట్టినారు ఈ చట్టములోని ముఖ్యాంశములు.

1. పరపతేతర సహకార సంఘములను స్థాపించవచ్చును.

2. ప్రాథమిక సహకార సంఘముల పర్యవేక్షణకు, వాటికి ఆర్థిక వనరులను చేకూర్చుటకు కేంద్ర సహకార బ్యాంకులు స్థాపించవచ్చును.

3. 1904 సహకార పరపతి సంఘముల చట్టములో చెప్పబడిన గ్రామీణ, పట్టణ సహకార పరపతి సంఘముల విభజనను తొలగించి సంఘములను పూచీ పరిమిత సంఘములుగానూ, పరిమితి లేని పూచీ సంఘములు గాను విభజించినారు.

4. కేంద్రసహకార సంస్థలబాధ్యత పరిమితమైనదిగానూ, గ్రామీణ పరపతి సంఘముల బాధ్యత అపరిమితమైనదిగానూ వుండవలయును.

5. 25 శాతము లాభములు క్షేమనిధికి కొనిపోయిన తరువాత 10 శాతము లాభములు ధర్మాదాయ కార్యములకు ఖర్చుపెట్టవచ్చును

6 పరిమితి లేని పూచీ సంఘములలో కూడా 50% లాభములు క్షేమనిధికి కొనిపోయిన తర్వాత సభ్యులు వాటా ధనముపై డివిడెండ్లను పంచుకొనుటకు వీలు కల్పింపబడెను.

7. "సహకారము" అనుపదమును సహకార సంఘముల చట్టము క్రింద రిజిష్టరుకాని ఏ యితర సంస్థా తనపేరులో కల్గివుండరాదు.

పై చట్టము రూపొందింపబడిన తర్వాత సహకార సంఘములు అన్ని రంగములలో స్థాపింపబడి వ్యాప్తి చెందినవి.

## సహకారము పై మాక్లగన్ కమిటీ
## Maclagan Committee on Co-operation

సహకార సంఘములు సాధించిన అభివృద్ధిని, పరిస్థితిని సమీక్షించుటకుగాను 1914లో సర్ ఎడ్వర్డ్ మేక్లగన్ (Sir Edward Maclagan) అధ్యక్షతన ఈ కమిటీ నియమింపబడిన 1915 లో ఈ కమిటీ రిపోర్టును సమర్పిస్తూ సహకారోద్యమాభివృద్ధికి మంచిసూచనలు చేసింది. ఈ కమిటీ ముఖ్య సూచనలు.

1 ప్రాథమిక సహకార పరపతి సంఘముల విస్తీర్ణము ఒక గ్రామమునకు మించిఉండరాదు.

2. ఈ సంఘములను పరిమితిలేని పూచీ సంఘములుగా ఏర్పరచవలెను.

3. అప్పులను సకాలములో వసూలు చేయవలెను.

4. అప్పులను సాధారణముగా ఉత్పాదక అవసరములకే యివ్వవలెను.

5 సభ్యులలో పొదుపును ప్రోత్సహించి, సంస్థలవాటా మూలధనాన్ని, పెంచుటకు కృషి చేయవలెను

6. ప్రాథమిక సహకార పరపతి సంఘముల పర్యవేక్షణకు సహకార సమాఖ్యలు ఏర్పరచవలెను. జిల్లాస్థాయిలో Apex బ్యాంకులను తాలూకాస్థాయిలో యూనియనులను స్థాపించవలెను.

7. సభ్యులకు సహకార సూత్రముల గురించి తెలియపరచవలెను. వారికి సహకార విద్యావకాశములను కల్పించవలెను.

8 వరపతేతర సహకార సంఘములను స్థాపించుటకు ప్రోత్సాహమివ్వ వలెను. కేంద్రి సహకార బ్యాంకులు వాటికి ఆర్థిక సహాయము చేయవలెను.

9. సంస్థల ఆడిట్, తనిఖీలను పటిష్ఠపరచవలెను. ఆడిట్ సకాలంలో అగునట్లు చూడవలెను.

## మాంటేగ్ - ఛెమ్స్‌ఫర్డు రాజ్యాంగ సంస్కరణలు

మొదటి ప్రపంచ యుద్ధం పూర్తయిన తరువాత 1919లో మాంటేగ్ - ఛెమ్స్‌ఫర్డు రాజ్యాంగ సంస్కరణలు (Montague-Chelmsford Reforms) అమలు జరపడంతో 'సహకారం' కేంద్రి ప్రభుత్వంనుండి రాష్ట్రి ప్రభుత్వములకు బదిలీ చేయబడింది. దీనితో రాష్ట్రి ప్రభుత్వములు తమ రాష్ట్రిములలోని సహకార ఉద్యమవ్యాప్తికి సూచన లిచ్చుటకు కమిటీలను నియమించినవి.

## మద్రాసు కేంద్ర సహకారభూమి తనఖా బ్యాంకు స్థాపన 1929
## మద్రాసు సహకార సంఘముల చట్టము- 1932
## మద్రాసు సహకార భూమి తనఖా బ్యాంకుల చట్టము - 1934

మద్రాసు రాష్ట్రిప్రభుత్వము 1927లో టవున్‌సెండ్ కమిటీని (Town send commitee) నియమించినది. ఈ కమిటీ 1928లో రిపోర్టును సమర్పిస్తూ ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులకు ద్రవ్యవనరులను సమకూర్చుటకు రాష్ట్రిస్థాయిలో కేంద్ర సహకార భూమి తనఖా బ్యాంకును స్థాపించుట అవసరమని తెలియజేసెను. ఈ సలహాను అంగీకరించి దేశములో మొట్టమొదటగా 1929 సం॥లో మద్రాసులో కేంద్రి సహకార భూమి తనఖా బ్యాంకు స్థాపింపబడెను మద్రాసు ప్రభుత్వము

రాష్ట్రమునందలి సహకార సంఘముల అభివృద్ధికై మద్రాసు సహకార సంఘముల చట్టము 1932, మరియు మద్రాసు సహకార భూమి తనఖా బ్యాంకుల చట్టము - 1934లను చేసెను.

"సహకారము" ను రాష్ట్ర ప్రభుత్వములకు బదిలీ చేసినప్పటికి కేంద్ర ప్రభుత్వము సహకారోద్యమ అభివృద్ధికి వివిధ కమిటీల సలహాలను పొందుచున్నది.

## వ్యవసాయము పై రాయల్ కమీషన్ - 1926

1926 లో కేంద్రప్రభుత్వముచే నియమింపబడిన (Royal commission on Agriculture) వ్యవసాయముపై రాయల్ కమీషన్ వారు 1927లో తమ రిపోర్టును సమర్పిస్తూ దేశములో వ్యవసాయాభివృద్ధికి సహకార సంఘములను అభివృద్ధిపరచవలెనని సలహా యిచ్చిరి. వారు ' If co-operation fails there will fail the last hope of Rural India' అని నుడివిరి.

The central and provincial Banking Enquiry committes-1929 కూడా సహకార పరపతి వ్యవస్థ రైతుల పరపతి అవసరములను తీర్చుటకు సరయిన వ్యవస్థ అనీ, సహకార సంఘముల అభివృద్ధిని బలపర్చుటకు సలహాల నిచ్చిరి.

1919 నుండి 1929 వరకూ దేశములో సహకార ఉద్యమ వ్యాప్తి తృప్తికరముగా సాగెను.

## ప్రపంచ ఆర్థిక మాంద్యము - 1929

1929లో ప్రపంచములో అన్ని దేశములలోను ఆర్థిక మాంద్యము

(Great economic Depression of thirties) ఏర్పడినది. వస్తువులధరలు ముఖ్యముగా ఆహారధాన్యములు, భూముల ధరలు విపరీతముగా పడిపోవుటవలన రైతుల ఆదాయములు తగ్గి సహకారసంఘములందు వాయిదా మీరిన బకాయిలు ఎక్కువయ్యెను. ఈ కారణమువలన చాలా పరిమితిలేని పూచీ సంఘములను రద్దుచేయవలసి వచ్చెను. సహకార ఉద్యమమునందు ప్రతిష్టంభన ఏర్పడినది.

## భారతీయ రిజర్వుబ్యాంకు - (వ్యవసాయ పరపతిశాఖ) స్థాపన

Central Banking enquiry committee సలహాల ననుసరించి 1935లో Reserve Bank of India స్థాపించబడెను. ఈ బ్యాంకు వ్యవసాయపరపతి సమస్యలను పరిశీలించుటకు, సహకార పరపతి సంస్థలకు ఆర్థికసహాయము చేయుటకు వీలుగా ప్రత్యేకశాఖను వ్యవసాయ పరపతి శాఖ (The Agricultural Credit Department) ను బ్యాంకులో ఏర్పాటు చేసెను. రిజర్వుబ్యాంకు స్థాపించబడి నప్పటినుండి ఈ బ్యాంకు సహకార పరపతి వ్యవస్థ అభివృద్ధి చెందుటకు అనేక విధాలుగా సహాయపడింది.

## శ్రీ విజయ రాఘవాచారి కమిటీ - 1939
## ( Sri Vijayaraghavachari Committee -1939)

ఆర్థిక మాంద్యము వలన దెబ్బతినిన సహకారోద్యమ పరిస్థితులను పరిశీలించి సంస్థల పునర్నిర్మాణమునకు తగు సూచనలిచ్చుటకు మద్రాసు స్థానిక ప్రభుత్వము శ్రీ టి. విజయ రాఘవాచారి అధ్యక్షతన ఒక కమిటీని 1939 లో నియమించింది. ఈ కమిటీ 1940లో నివేదిక సమర్పిస్తూ ఈ క్రింది ముఖ్యసూచనలను చేసింది.

1. గ్రామీణ పరపతి సంఘములను పరిమితిగల పూచీపైన స్థాపించవలెను,

2 లేక 3 గ్రామములకొక సంఘమును ఏర్పాటు చేయవలెను.

2. కేంద్ర సహకార బ్యాంకులందు వ్యక్తి సభ్యులను తొలగించవలెను.

3. కేంద్ర బ్యాంకులు ఒక్క బ్యాంకింగు వ్యాపారమునే చేయవలయును

పై సలహాలు ఆచరణయందున్న పద్ధతులకు భిన్నముగా వున్నందున ప్రభుత్వము అంగీకరించలేదు.

## రెండవ ప్రపంచ యుద్ధకాలంలో సహకార సంఘములు
## (Co-operatives during second world war- 1939-45)

రెండవ ప్రపంచయుద్ధ కారణంగా వ్యవసాయ పంటల ధరలు బాగుగా పెరిగెను. వ్యవసాయదారులు తమ ఆదాయములు పెరుగుట వలన సంఘముల బకాయిలను చెల్లించగల్గిరి. వస్తువుల ఉత్పత్తి, సరఫరాలు ప్రజల అవసరాలకు సరిపోయినంతగా లేనందున వస్తువుల సరఫరాకు పరపతేతర సహకార సంఘములు విరివిగా స్థాపింపబడినవి.

## శ్రీ గోపాలస్వామి అయ్యంగార్ కమిటీ - 1945
## (Rayalaseema Co-operative enquiry Committee or Gopalswamy Ayyangar Committee)

కడప, కర్నూలు, చిత్తూరు అనంతపురం జిల్లాలలో కరువు కాటకాలేర్పడి మితిమీరిన బకాయిలు పెరిగెను. సహకార ఉద్యమమును పరిశీలించి తగు సూచనలు చేయుటకు మద్రాసు ప్రభుత్వము 1945లో శ్రీ గోపాలస్వామి అయ్యంగార్ అధ్యక్షతన ఒక కమిటీని నియమించెను. వారు ఈ క్రింది ముఖ్య సిఫారసులను చేసిరి.

1. గ్రామీణ సహకార సంఘములను ఏకార్థ సహకార సంఘములుగ మార్చవలెను.

2) రాయలసీమయందు పనిచేయుచున్న కేంద్ర సహకార బ్యాంకులను రద్దుచేసి, వాటి స్థానే రాష్ట్ర సహకారబ్యాంకు బ్రాంచీలను ఏర్పాటు చేయవలయును.

3) సెంట్రలు బ్యాంకులు పాత బాకీలను రద్దుచేసి. ఆ నష్టము భరించుకొనుటకు బ్యాంకులకు ప్రభుత్వము సబ్సిడీ యివ్వవలెను.

4) రైతులకిచ్చిన అప్పులపై వడ్డీరేటును తగ్గించి, ఆ నష్టము ప్రభుత్వము భరించేయవలెను.

5) ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులను రద్దుచేసి, కేంద్రభూమి తనఖా బ్యాంకులు రైతులకు నేరుగా దీర్ఘకాలిక ఋణాలు యివ్వవలెను.

పై సూచనలలో ప్రభుత్వము 1, 3, 4 సిఫారసులను అంగీకరించి అమలు జరిపెను.

## Agricultural Finance subcommittee-1945

కేంద్ర ప్రభుత్వముచే 1945లో Dr. డి. ఆర్. గాడ్గిల్ అధ్యక్షతన యీ కమిటీ నియమింపబడెను, వీరు వరపతి యావత్తు సహకార సంస్థలద్వారా అందచేయవలయునని, ఇందుకు వీలుగా ప్రభుత్వము Agricultural Credit Corporations ను స్థాపించి వాటిద్వారా సహకార సంస్థలకు తోడ్పడవలెనని సలహా యిచ్చింది. కాని ఈ సూచన అంగీకరింపబడలేదు

## సహకార ప్రణాళికా సంఘము 1946
## (The Cooperative Planing Committee or Saraiah Committee - 1946)

కేంద్రప్రభుత్వము 1945 సం॥లో సహకార ఉద్యము వ్యాప్తికి ప్రణాళికను రూపొందించుటకు Sri G. Saraiah అధ్యక్షతన సహకార ప్రణాళికా సంఘమును ఏర్పరచెను. ఈ కమిటీ తమ నివేదికను 1946లో అందజేసినది, ఈ కమిటీ ముఖ్యసిఫారసులు.

1) గ్రామీణ పరపతి సంఘములు పరపతితోపాటు పరపతేతర సౌకర్యము లను కూడా కల్పించవలెను. సంఘములను పరిమిత పూచీతోకాని పరిమితిలేని పూచీతోకాని స్థాపించుకొనుటకు సభ్యుల యిష్టానికి వదిలివేయవలెను. అయితే పేదవారి అవసరములను నిర్లక్ష్యము చేయరాదు.

2) 10 సం॥లలో 50% గ్రామములను, 30% జనాభాను సహకారఉద్యమ ములోనికి తీసుకొని రావలెను.

3) Marketing, Processing, Insurance గృహనిర్మాణము, పశుగణాభివృద్ధి విషయములందుకూడా సహకార ఉద్యమము లక్ష్య ములను (Targets) నిర్ణయించుకొని అభివృద్ధిని సాధించవలెను.

పై కమిటీ సూచనలు 1947 సం॥లో జరిగిన రాష్ట్ర సహకార సంఘముల రిజిష్ట్రారుల మొదటి సమావేశములో చర్చించబడి సలహాలను అమలు పర్చుటకు నిర్ణయించిరి.

## భారతదేశ స్వాతంత్ర్యము - 1947

1947 లో భారత దేశమునకు స్వాతంత్ర్యము వచ్చినది. ప్రజా స్వామ్య సోషలిజమును దేశఆర్థిక లక్ష్యముగా నిర్ణయించిరి. ఈ లక్ష్య సాధనలో సహకార సంఘముల ప్రాముఖ్యతను గుర్తించి వాటిఅభివృద్ధి ని ప్రోత్సహించుటకు నిర్ణయించిరి. ప్రతిరాష్ట్రము సహకార అభివృద్ధికి

సహకార ప్రణాళికను రూపొందించుట మొదలిడినవి

## గ్రామీణ బ్యాంకింగు ఎంక్వైరీ కమిటీ - 1949

శ్రీ పురుషోత్తమదాస్ ఠాకూర్ అధ్యక్షతన. గ్రామీణ ప్రాంతము లలో బ్యాంకింగ్ సదుపాయాలను విస్తరింపచేయుటకుగల అవకాశము లను పరిశీలించుటకు గ్రామీణ బ్యాంకింగ్ ఎంక్వైరీ కమిటీని కేంద్ర ప్రభుత్వము 1949లో నియమించెను. ఈ కమిటీ గాడ్గిల్ కమిటీ సిఫారసులను బలపర్చినది. సిఫారసులు ;

1) గ్రామీణ సహకార బ్యాంకులను స్థాపించవలెను. పట్టణ సహకార బ్యాంకులను, కేంద్ర సహకార బ్యాంకులను రాష్ట్ర సహకారబ్యాంకు లను అభివృద్ధి పరచవలెను.

2) ఇంపీరియల్ బ్యాంకు బ్రాంచీలు ఎక్కువగా పెట్టవలెను.

3) తక్కువ ఖర్చులో సొమ్ము రవాణాకు ప్రాంతమునుండి ప్రాంతమునకు చేర్చ వలెను.

4) కేంద్ర సహకార బ్యాంకులను పెద్యూల్డు బ్యాంకులతో సమాన ప్రతిపత్తితో చూచుటకు రిజర్వుబ్యాంకు చట్టమును సవరించవలెను.

5) వ్యవసాయోత్పత్తికి, మార్కెటింగుకు R B I యిచ్చు పరపతి సౌకర్యములు 9 నెలలనుండి 15 నెలలకు పెంచవలెను.

1951 నుండి దేశ ఆర్థికాభివృద్ధికి పంచవర్ష ప్రణాళికలను అమలు పర్చటం జరిగింది. పంచవర్ష ప్రణాళికలలో సహకార ఉద్యమాభివృద్ధికి మంచి ప్రాముఖ్య మివ్వటంజరిగింది.

## ఆంధ్ర రాష్ట్ర అవతరణ - 1953

## అఖిల భారత గ్రామీణ పరపతి పరిశీలనా సంఘము యొక్క ముఖ్య సిఫారసులు

## Recommendations of All India Rural Credit Survey Committee (1951-54)

1951 లో గ్రామీణ ఋణ వసతులను పరిశీలించడానికి "అఖిల భారత గ్రామీణ పరపతి పరిశీలనా సంఘము"ను రిజర్వు బ్యాంకు ఏర్పాటు చేసినది. ఈ కమిటీ అధ్యక్షులు శ్రీ ఎ. డి. గోర్వాలా (Sri A. D. Gorwala) . Dr. D. R. గాడ్గిల్, శ్రీ బి. వెంకటప్పయ్య, మరియు Dr. N S R శాస్త్రి సభ్యులు. ఈ కమిటీ 1954లో తన మొదటి నివేదికను సమర్పించినది. ఈ సంఘ నివేదికలో రైతులు తీసుకుంటున్న మొత్తం ఋణాలలో వడ్డీ వ్యాపారస్తులు, వర్తకులు 75 శాతము కంటే ఎక్కువ సమకూర్చుతున్నారని, ప్రభుత్వము 3. 3. శాతము, సహకార సంస్థలు 3.1 శాతము, వాణిజ్య బ్యాంకులు 0.9 శాతము మాత్రమే సమకూర్చగల్గుతున్నవని తెలుపడమైనది. సహకార సంస్థలిచ్చే ఈ స్వల్ప మొత్తాలుకూడా రైతులకు సకాలములో అందుటలేదనియు, రైతులకుగల భూస్థోమత ఆధారముగా ఋణము లిచ్చుటవలన ఈ పరపతిలో ఎక్కువభాగము భూవసతిగల పెద్దరైతులకు మాత్రమే అందజేయబడుతున్నదనియూ, అవసరమున్న రైతుల కందరకును ఋణములు లభించుట లేదనియూ, ఈ పరపతి అధికాహారోత్పత్తిని సాధించుటకు అనుకూలముగా లేదని కమిటీ అభిప్రాయపడినది. సహకారోద్యమము విఫలమైనది. అయితే గ్రామీణ అర్థికాభివృద్ధికి "సహకారోద్యమము జయప్రదమవక తప్పదు" (Co-operation has failed, but Co-operation must succeed) అని తెలిపిరి.

సహకారోద్యమం జయప్రదమగుటకు ఒక సుసంఘటితమైన

వ్యవస్థను నిర్మించవలెనని, పరపతి ఉద్యమాభివృద్ధికి, పటిష్టతకు "సమగ్ర గ్రామీణ పరపతి పథకాన్ని (Integrated scheme of Rural Credit) సిఫార్సు చేసిరి. ఈ పథకంలో ముఖ్యాంశములు.

1) వివిధ స్థాయిలలోవున్న సహకార సంస్థలందు ప్రభుత్వభాగస్వామ్యము

2) పరపతిని పంటల విక్రియముతో సమన్వయ పరచుట.

3) పంస్థల నిర్వహణకు శిక్షణ పొందిన ఉద్యోగుల నియమించుట.

సహకార అభివృద్ధి కార్యక్రమముల అమలుకు. రాష్ట్ర ప్రభుత్వాలు బాధ్యత వహించి కృషిచేయవలెనని, రాష్ట్రప్రభుత్వములకు కేంద్ర ప్రభుత్వము, రిజర్వుబ్యాంక్, జాతీయ సహకార అభివృద్ధి మరియు గిడ్డంగుల బోర్డు, మొదలగునవి తమ తోడ్పాటునందించవలెనని సూచించిరి.

ఈ సంఘము యొక్క ముఖ్య సిఫార్సులు ;

1) సహకార సంస్థలందు ప్రభుత్వ భాగస్వామ్యము

సహకార ఉద్యమాభివృద్ధికి రాష్ట్ర ప్రభుత్వములు పరోక్షముగా సహాయపడుటయేగాక ప్రాథమిక, జిల్లా, రాష్ట్ర స్థాయిలందుగల పరపతి, మార్కెటింగు, ప్రాసెసింగ్ సంస్థలందు ప్రభుత్వము భాగస్వామిగాచేరి పెద్దమొత్తములలో వాటాలు తీసుకోవలెను.

2) సహకార వ్యవస్థను పునర్వ్యవస్థీకరించవలెను.

ఎ) గ్రామీణస్థాయిలో 'పరిమిత పూచీపై ప్రభుత్వ భాగస్వామ్యముతో విశాల సహకార పరపతి సంఘములను స్థాపించుట.

బి) పరపతిని యితర ఆర్థిక కార్యక్రమములయిన పంటల విక్రయము (Marketing); పంటవస్తువుల ప్రక్రియ (Processing)తోను సమన్వయ పరచవలెను.

సి) రాష్ట్ర ప్రభుత్వముల సహాయముతో గ్రామీణ-ఆర్థిక కార్యక్రమములయిన వ్యవసాయ సేద్యమును, నీటి సౌకర్యములను, రవాణా పాలసరఫరా, కుటీర పరిశ్రమలను సహకార పద్ధతిలో ఏర్పాటు చేయవలెను.

డి) ప్రతి రాష్ట్రమందు రాష్ట్రస్థాయిలో ఒక మార్కెటింగు సంఘము, ఒక కేంద్రసహకార భూమి తనఖాబ్యాంకు స్థాపింపబడవలెను

ఇ) దేశమందలి సహకార మార్కెటింగు, ప్రోసెసింగు సంస్థలను పటిష్టపరచుటలోను, గిడ్డంగుల నిర్మాణములోను సహాయ పడుటకు National Co-Operative Development & Warehousing Board ను స్థాపించవలెను.

3) సామర్థ్యమైన నిర్వహణకు, విశాల పరపతి సంఘములందును మార్కెటింగు సంఘము లందును, శిక్షణపొందిన పూర్తికాలపు ఉద్యోగులను నియమించవలెను.

4) సహకార శిక్షణకు తగు ఏర్పాట్లు చేయవలెను.

అన్ని స్థాయిలందుగల సహకార సంస్థలలో పనిచేయు ఉద్యోగులు ప్రభుత్వ సహకార శాఖలలో పనిచేయు ఉద్యోగులు, సహకార శిక్షణ పొందుటకు Central Committee for Co-Operative Training తగు ఏర్పాట్లు చేయవలెను.

5) గ్రామీణ బ్యాంకింగు సౌకర్యములను అభివృద్ధిపరచుటకు, వ్యవసాయ పరపతి విషయంలో రిజర్వు బ్యాంకుకు చేతోడుగా వుండుటకు

ఇంపీరియల్ బ్యాంకును జాతీయము చేయవలెను.

ఈ కమిటీ సలహాల ననుసరించి 1-7-1955 న Imperial Bank of India జాతీయ చేయబడి State Bank of India స్థాపింపబడెను.

8) సహకార సంస్థల పునర్నిర్మాణమునకు, అభివృద్ధి కార్యక్రమముల నిర్వహణకు ఈ క్రింద వివరించిన విధముగా ప్రత్యేక నిధులను యేర్పరచవలెను.

I రిజర్వుబ్యాంకు ఏర్పరచవలసిన నిధులు

**A.** The National Agricultural Credit ( Long term operations Fund)

జాతీయ వ్యవసాయ పరపతి (దీర్ఘకాలిక కార్యకాలాపముల) నిధి

ఈ నిధిని రిజర్వుబ్యాంకు (a) సహకార సంస్థలలో వాటాలు తీసుకొనుటకు రాష్ట్రప్రభుత్వములకు దీర్ఘకాలిక అప్పులను మంజూరు చేయుటకు (b)భూమి తనఖా బ్యాంకులకు అప్పులిచ్చుటకు, డిబెంచర్లను కొనుటకు (c) రాష్ట్ర సహకార బ్యాంకులకు మధ్య కాలిక ఋణము లిచ్చుటకు (d) కేంద్ర సహకార బ్యాంకుల పారు బాకీలనిధిని అభివృద్ధి చేయుటకు out right grants యిచ్చుటకు వినియోగించును. 30-6-1974 నాటికి ఈ నిధి 284 కోట్ల రూపాయలకు చేరుకొనెను.

**B** The National Agricultural Credit (Stabilisation) Fund,-

జాతీయ వ్యవసాయ పరపతి స్థిరీకరణ నిధి

ప్రకృతి వైపరీత్యముల వలన రాష్ట్రసహకార బ్యాంకులు R B I వారు యిచ్చిన స్వల్పకాలిక ఋణాలు (S A O loans) తీర్చలేనప్పుడు

ఈనిధి నుండి రాష్ట్రసహకార బ్యాంకులకు ఋణతీర్మానము నిమిత్తము మధ్యవాయిదా అప్పు నిచ్చెదరు, 30-6-1974 నాటికి ఈ నిధి 95 కోట్ల రూపాయలకు చేరుకొనెను.

ఈ సిపార్సులను అంగీకరించి 1955లో R B I చట్టము సవరించబడి 1956 నుండి పై రెండు నిధులను R B I ఏర్పాటు చేయుచున్నది.

II. కేంద్రప్రభుత్వము ఏర్పాటు చేయవలసిన నిధి :-

The National Agricultural Credit (Relief and Guarantee) Fund

జాతీయ వ్యవసాయ పరపతి (ఉపశమన, హామీ) నిధి

విపరీతమైన పరిస్థితులతో ప్రకృతి వైపరీత్యముల వలన సహకార సంస్థలకు వచ్చు నష్టములను పూరించుటకు కేంద్రప్రభుత్వము ఈ నిధి నుండి విరాళము లిచ్చును.

III. జాతీయ సహకారాభివృద్ధి గిడ్డంగుల బోర్డు ఏర్పాటు చేయవలసిన నిధులు

(A) The National Co-Operative development fund.

జాతీయ సహకార అభివృద్ధి నిధి

(B) The National warehousing Development Fund.

జాతీయ గిడ్డంగుల అభివృద్ధి నిధి

పై నిధులు సహకార అభివృద్ధి కార్యక్రమములకు, గిడ్డంగుల పథకములను అమలుపరచు నిమిత్తము వినియోగింతురు.

1956 లో The National Agricultural Produce Corporation Act అమలు చేయుటద్వారా The National Co-operative Development and ware housing Board, The

Central warehousing Corporation అను సంస్థలు ఏర్పాటు చేయబడెను. దేశమంతటా గిడ్డంగుల నిర్మాణానికి, కేంద్ర గిడ్డంగుల కార్పొరేషన్‌కు జాతీయ గిడ్డంగుల అభివృద్ధినిధి నుండి ఋణాలు ఇవ్వడమవుతుంది. మార్కెటింగు ప్రోసెసింగు సంఘములలో పెట్టుబడి పెట్టడానికి రాష్ట్రప్రభుత్వాలకు జాతీయ సహకార అభివృద్ధి నిధినుండి దీర్ఘకాలిక ఋణాలు లభిస్తాయి. అయితే ఈ సంస్థను 1963లో రెండు సంస్థలుగా విభజించడమైనది. జాతీయ సహకార అభివృద్ధి నిధిని నిర్వహించుటకు ప్రత్యేకముగా జాతీయ సహకార అభివృద్ధి సంస్థను (NCDC) స్థాపించడమైనది.

### IV స్టేట్ బ్యాంకు ఆఫ్ ఇండియా ఏర్పాటు చేయవలసిన నిధి
### The Integration and Development Fund
### సంఘటిత మరియు అభివృద్ధి నిధి

RBI వాటాలమీద, కేంద్ర ప్రభుత్వపు వాటాలమీద SBI పంచిపెట్టవలసిన Dividend ను ఈ నిధికి జమకట్టెదరు. S. B. I. కొత్తగా ఏర్పరచు గ్రామీణ బ్రాంచీలను నిర్వహించుటలో వచ్చు నష్టములను ఖర్చు చేయుటకు ఈ నిధిని ఖర్చుపెట్టవచ్చును. లాభసాటి గాని ప్రాంతాల్లో బ్యాంకు బ్రాంచీల విస్తరణకు ఈనిధి దోహదపడును.

### V రాష్ట్రప్రభుత్వములు ఏర్పాటు చేయవలసిన నిధులు
### A, The State Co-operative Development Fund
### రాష్ట్ర సహకార అభివృద్ధి నిధి

రాష్ట్ర ప్రభుత్వములు వరపతేతర సంఘములలో తీసుకొన్న వాటాలపై వచ్చిన డివిడెండ్లను ఈ నిధికి చేర్చెదరు. రాష్ట్ర ప్రభుత్వములు ఈ నిధి నిర్మించుటకు గ్రాంట్లు కూడా ఇచ్చును. ఈ నిధినుండి

రాష్ట్ర ప్రభుత్వములు మార్కెటింగు, ప్రాసెసింగు సంఘములలో వాటాలు తీసుకొనుటకు ఖర్చు చేయవచ్చును.

## B. The State Agricultural Credit (Relief & Guarantee) Fund

### రాష్ట్ర వ్యవసాయ పరపతి, ఉపశమన హామీనిధి

ప్రభుత్వము హామీవుండి వసూలుకాని అప్పులు తీర్చుటకు, ప్రకృతి వైపరీత్యములవలన సహకార సంఘములకు వచ్చు నష్టములను భర్తీ చేయు నిమిత్తము ఈ నిధి ఖర్చుచేయబడును.

## VI ప్రతిరాష్ట్ర సహకార బ్యాంకు, కేంద్ర సహకారబ్యాంకు ఏర్పాటు చేయవలసిన నిధి

### The Agricultural Credit Stabilisation Fund

### వ్యవసాయ పరపతి స్థిరీకరణ నిధి

ఈ బ్యాంకుల లాభములలో 15 శాతము, బ్యాంకులు ప్రభుత్వ వాటాధనము మీద 8 శాతమునకు మించి యిచ్చు డివిడెండ్లు ఈ నిధికి చేర్చెదరు. ప్రకృతి వైపరీత్యము వలన రైతులు తాము తీసుకున్న స్వల్ప కాలిక అప్పులు S A O loans తీర్చలేనప్పుడు, ఆ అప్పుల తీర్మానము నిమిత్తము, మధ్యకాలిక ఋణములను మంజూరు చేయుటకు ఈ నిధిని వినియోగింతురు.

ఈ కమిటీవారు చేసిన ముఖ్య సిఫారసులన్నియు కేంద్ర ప్రభుత్వముచే అంగీకరింపబడి, రెండవ పంచవర్ష ప్రణాళికా కాలములో అమలు చేయుటకు నిశ్చయింపబడెను. ఈ కమిటీ సిఫార్సులను అమలు చేయుటవలన, సహకారోద్యమము బాగుగా అభివృద్ధి చెందుటకు అవకాశము కల్గెను. సహకారోద్యమ చరిత్రలో ఈ కమిటీ సిఫార్సులను ఈ ముఖ్యఘట్టముగా అభివృద్ధికి ఒక మంచి మలుపుగా పేర్కొన వచ్చును.

ఇంకనూ మనదేశములో ప్రత్యేకించి ఆంధ్రప్రదేశ్ లో సహకార పరపతి ఉద్యమాభివృద్ధికి ఈక్రింది సంఘటనలు, కమిటీలనివేదికలు, సంస్థల నిర్మాణం ప్రభావితం చేసినవి, తోడ్పడినవి.

**1956** - ఆంధ్రప్రదేశ్ అవతరణ

(సం।లో) - సహకార విద్యా కార్యక్రమము అమలు

1960 - సహకార పరపతిపై శ్రీ V. L. మెహతా కమిటీ రిపోర్టు.

- జాతీయ సహకార భూమి అభివృద్ధి బ్యాంకుల సమాఖ్య ఏర్పాటు.

1962 - ఆంధ్రప్రదేశ్ సహకార కేంద్రవ్యవసాయాభివృద్ధి బ్యాంకు (A P C A D B) ఏర్పాటు.

1963 - ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సహకార బ్యాంకు (A P C O B) ఏర్పాటు.

- జాతీయ సహకార అభివృద్ధి కార్పొరేషన్ (N.C D.C) ఏర్పాటు.
- వ్యవసాయ అభివృద్ధి రిఫైనాన్సు కార్పొరేషన్ (ARDC) ఏర్పాటు.

1964 - ఆంధ్రప్రదేశ్ సహకార సంఘముల చట్టము (ఆగష్టు 1 నుండి అమలు లోనికి తేబడినది.)

- రాష్ట్ర సహకార బ్యాంకుల జాతీయ సమాఖ్య ఏర్పాటు.

1965 - Banking Laws (Applicable to co-operative societies) Act 1965. ఈ చట్టము 1966 మార్చి నుండి అమలు పరచుటచే సహకార బ్యాంకులు కూడా

బ్యాంకింగు రెగ్యులేషన్ చట్టం ప్రకారము రిజర్వు బ్యాంకు అధిపత్యము క్రిందకు తీసుకురాబడినవి.

- సహకారముపై శ్రీ R.N. మీర్ధా అధ్యక్షతన ఏర్పాటైన కమిటీ నివేదిక.

1969 - శ్రీ వి. వెంకటప్పయ్య అధ్యక్షతలో ఏర్పడిన అఖిలభారత గ్రామీణ పరపతి సమీక్షా సంఘపు నివేదిక.

1971 - సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థలు లేదా జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థల (D R D A) స్థాపన.

- అనావృష్టి పీడిత ప్రాంతాల అభివృద్ధి సంస్థల స్థాపన
- జాతీయ వ్యవసాయ కమీషన్ నివేదిక

1972 - బ్యాంకింగు కమీషన్ సిఫార్సులు.

- గ్రామస్థాయిలో వ్యవసాయపరపతిని అందించుటకు సంస్థాపరమైన ఏర్పాటు పరిశీలించుటకు శ్రీ T. A. Pai అధ్యక్షతతో ఏర్పాటైన నిపుణుల బృందపు సిఫార్సులు.

1974 - ఆంధ్రప్రదేశ్‌లో, షెడ్యూల్డు కులముల, షెడ్యూల్డు తెగల, వెనుకబడిన తరగతుల, మహిళల ఆర్థిక శ్రేయస్సుకు ప్రత్యేక ద్రవ్య సహాయ సహకార కార్పొరేషనుల స్థాపన.

- ఆయకట్టు ప్రాంతాల అభివృద్ధి సంస్థల స్థాపన.
- శ్రీ C. D. దాతే అధ్యక్షతన సహకార సంస్థల బకాయిల అధ్యయన బృందపు సిఫార్సులు.

1976 - సహకార పరపతి వ్యవస్థ ఏకీకరణకున్న అవకాశములను

పర్యవేక్షించుటకు శ్రీ R. K. హజారి అధ్యక్షతన ఏర్పాటైన కమిటీ నివేదిక.

- వినిమయ పరపతిపై శ్రీ బి. శివరామన్ కమీషన్ నివేదిక

1977 - ఆంధ్రప్రదేశ్‌లో స్వయంపోషకమైన ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘముల (Viable Co-operative credit societies) పునర్నిర్మాణము.

- పట్టణ సహకార బ్యాంకుల (పరపతి సంఘముల) జాతీయ సమాఖ్య ఏర్పాటు.

1978 - పట్టణ సహకార బ్యాంకులపై మాధవదాస్ అధ్యక్షతన రిజర్వుబాంకుచే నియమింపబడిన కమిటీ నివేదిక

## జాతీయ వ్యవసాయ గ్రామీణాభివృద్ధి బ్యాంకు

## N A B A R D - 1982

రిజర్వు బ్యాంకులోని వ్యవసాయ పరపతి శాఖ (Agricultural credit department); వ్యవసాయ అభివృద్ధి రిఫైనాన్సు కార్పొరేషన్ (A R D C) సంలీనము చేయబడి పార్లమెంటు చట్టం క్రింద 1982 జూలైలో జాతీయ స్థాయిలో National Bank for Agriculture and Rural Development స్థాపింపబడినది. ఈ బ్యాంకు సమగ్ర గ్రామీణాభివృద్ధికి – వ్యవసాయము, గ్రామీణ పరిశ్రమల అభివృద్ధికి, బలహీనవర్గాల సంక్షేమం కోసం – స్వల్పకాలిక, మధ్యకాలిక, దీర్ఘకాలిక పరపతి విధానములను రూపొందించుటకు, ఋణ సౌకర్యములను అందజేయు వివిధ బ్యాంకుల మధ్య సమన్వయము, క్రమశిక్షణను సాధించుటకు ఆర్థిక సహాయము అందజేయుటకు కృషి చేయును.

# 5 ఆంధ్రప్రదేశ్ లో సహకార పరపతి వ్యవస్థ

## (Co-operative Credit Structure)

- వ్యవసాయ పరపతి సంస్థలు
  - స్వల్పకాలిక, మధ్యకాలిక పరపతి సంస్థలు
    - రాష్ట్ర సహకార బ్యాంకు (రాష్ట్రస్థాయి - 1)
    - కేంద్ర సహకార బ్యాంకులు (జిల్లాస్థాయి - 27)
    - ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘములు (గ్రామస్థాయి - 7037)
  - దీర్ఘకాలిక పరపతి సంస్థలు
- వ్యవసాయేతర పరపతి సంస్థలు

**దీర్ఘకాలిక పరపతి సంస్థలు**

- సహకార కేంద్ర వ్యవసాయాభివృద్ధి బ్యాంకు (రాష్ట్రస్థాయి - 1)
- ప్రాథమిక వ్యవసాయాభివృద్ధి బ్యాంకులు (తాలూకా స్థాయి - 219)

**వ్యవసాయేతర పరపతి సంస్థలు (పట్టణ ప్రాంతములలో)**

- ఉద్యోగుల సహకార పరపతి సంఘములు
- పట్టణ సహకార బ్యాంకులు
- సహకార గృహ తనఖా బ్యాంకులు

మన రాష్ట్రములో స్వల్పకాలిక మధ్యకాలిక పరపతిని అందించుటకు సంస్థలు మూడంతస్థుల నిర్మాణము కల్గివున్నవి.

గ్రామస్థాయిలో ప్రాథమిక సహకార పరపతి సంఘములు,

జిల్లా స్థాయిలో కేంద్ర సహకార బ్యాంకులు,

రాష్ట్రస్థాయిలో రాష్ట్రసహకార బ్యాంకు పనిచేయుచున్నది.

దీర్ఘకాలిక పరపతిని అందించు సంస్థలు రెండంతస్థుల నిర్మాణము కలిగి వున్నవి.

తాలూకా స్థాయిలో ప్రాథమిక సహకార వ్యవసాయాభివృద్ధి బ్యాంకులు,

రాష్ట్రస్థాయిలో సహకార కేంద్ర వ్యవసాయాభివృద్ధి బ్యాంకు పనిచేయుచున్నది

పట్టణ ప్రాంతములలోని ప్రజల అవసరములను తీర్చుటకు పట్టణ సహకార బ్యాంకులు, ఉద్యోగుల సహకార సంఘములు పనిచేయుచున్నవి.

సభ్యులైన వ్యక్తులకు నేరుగా సేవచేసే సంఘములను ప్రాథమిక సంఘము లనియు; సభ్యత్వ సంఘములకు సేవచేసే వాటిని సమాఖ్యలని (Federations) వ్యవహరించవచ్చును.

## పరపతి - వర్గీకరణ
## CLASSIFICATION OF CREDIT.

వ్యవసాయ అవసరములకు యిచ్చు పరపతిని వ్యవసాయ పరపతి (Agricultural Credit) అనియు; ఇతర అవసరములకు యిచ్చు పరపతిని వ్యవసాయేతర పరపతి (Non - Agricultural Credit)

అనియు అందురు.

ఋణకాల పరపతిని బట్టి, ప్రయోజనమును బట్టి స్వల్పకాలిక (Short - term) ఋణములనియు, మధ్యకాలిక (Medium - term) ఋణములనియు ; దీర్ఘ కాలిక (Long - term) ఋణములనియు విభజింపవచ్చును.

## స్వల్పకాలిక ఋణములు :-

సాధారణముగా 12 మాసముల లోపు కాలపరిమితిగల ఋణములను స్వల్ప కాలిక ఋణములు అందురు. వ్యవసాయమునకు సంబంధించి ఈ ఋణములను విత్తనములు, క్రిమినాశక మందులను కొనుటకు, కూలీలకు వేతనములు ఇచ్చుటకు తదితర వ్యవసాయ కార్యకలాపములకు కుటుంబ అవసరములకు ఇచ్చెదరు, వ్యవసాయోత్పత్తికి ఇచ్చు పరపతిని ఉత్పాదక పరపతి (Production Credit) అనియు, కుటుంబావసరముల వినియోగమునకు ఇచ్చుపరపతిని వినిమయ పరపతి (Consumption Credit)అనియు అందురు, ఈ అప్పులను వివిధ పంటలను పండించుటకు యిచ్చెదరు. కనుక ఈ అప్పులను 'కాలమానపు అప్పులు, (Laons for seasonal Agircultural operations) అని కూడా అందురు, పండించిన పంటను అమ్మగా వచ్చిన ఆదాయమునుండి ఈ అప్పులు తిరిగి చెల్లింపబడును. గ్రామీణ స్థాయి సహకార పరపతి సంస్థలు ఈ అప్పులను రైతులకు అందించుచున్నవి.

## మధ్యకాలిక ఋణములు :-

సాధారణముగా 12 మాసముల పైబడి 5 సం॥ ల కాలపరిమితికి లోబడి సంవత్సరపు వాయిదాలలో తీర్చుటకు యిచ్చు అప్పులను మధ్య కాలిక అప్పులందురు. భూమి మరమ్మత్తులు చేసికొనుటకు, బావులు

తిప్పుకొనుటకు, బాగుచేయించు కొనుటకు, గొర్రెలు, కోళ్ళు, చేపలు పందుల పెంపకములకు, యితర వ్యవసాయ అనుబంధ వృత్తులు చేపట్టి దానికి ఈ అప్పులు ఇవ్వబడును. ఈ కార్యక్రమములను చేపట్టడమువలన రైతుకు లభించే అదనపు ఆదాయమునుండి ఈ అప్పులు తీర్చబడును. గ్రామీణ పరపతి సంస్థలు ఈ అప్పులనుకూడా ఇచ్చుచున్నవి.

దీర్ఘకాలిక ఋణములు :—

సాధారణముగా 5 సం॥ల నుంచి 20 సం॥ల లోపు కాలపరిమితికి సం వత్సరపు వాయిదాలలో తీర్చుటకు యిచ్చు అప్పులను దీర్ఘకాలిక ఋణ ములు అందురు. వ్యవసాయము మీదవచ్చు ప్రస్తుత ఆదాయము తగ్గకుండా చూచుకొనుటకు, ఆదాయము పెంచుకొనుటకు వ్యవసాయోత్పత్తి సంబంధించి ఆస్తుల పోషణకు, మార్పులకు పెట్టుబడి పెట్టవలసిన అవసరం ఉన్నది. భూమిపై శాశ్వతమగు అభివృద్ధి పనులు నిర్వహించుటకు, వ్యవ సాయపు ఆస్తులను పెంచుకొనుటకు, వ్యవసాయమును ఆధునికము చేయ డానికి, ఆయిల్లు ఇంజన్లు, ఎలక్ట్రికల్ మోటార్లు, పంపుసెట్లు, ట్రాక్టర్లు కొనుటకు, నీటి పారుదల సౌకర్యములను ఏర్పరచు కొనుటకు, పండ్ల తోటలను పెంచుటకు, వ్యవసాయ అనుబంధ వృత్తులను చేపట్టుటకు, గోబర్ గ్యాస్ ప్లాంటుల స్థాపనకు యీ అప్పులు యివ్వబడుచున్నవి.

పై కార్యక్రమముల వలన రైతులకు లభించే అదనపు ఆదాయ ముల నుండి ఈ అప్పులు తీర్చబడును.

ప్రాథమిక సహకార వ్యవసాయాభివృద్ధి బ్యాంకులు, రైతులకు యీ అప్పులను అందించుచున్నవి. ఇటీవల స్థాపింపబడుచున్న రైతుల సేవాసహకార సంఘములు కూడా స్వల్పకాలిక, మధ్యకాలిక పరపతితో పాటు దీర్ఘకాలిక పరపతిని కూడా రైతులకు అందించు చున్నవి.

# 6 ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘములు-క్రమ పరిణామము

## (Evolution of Primary Agricultural Co-Operative Credit Societies)

### గ్రామీణ సహకార పరపతి సంఘములు

### (Rural Credit Co-Operative Societies)

భారతదేశములో 1904 సం॥లో సహకార పరపతి సంఘముల చట్టము ప్రవేశపెట్టడంతో గ్రామాలలో గ్రామీణ పరపతి సంఘములు, పట్టణ ప్రాంతములలో పట్టణ సహకార పరపతి సంఘములు, స్థాపించుటకు వీలుపడినది

అప్పట్లో గ్రామాలలో ఏర్పరచు గ్రామీణ పరపతి సంఘములు రైఫీజను' (జర్మన్ సహకారవేత్త) సిద్ధాంతము ననుసరించి పరిమితిలేని పూచీతో స్థాపించ బడినవి. ఈ సంస్థల ముఖ్యోద్దేశ్యము సభ్యుల పరపతి అవసరములను తీర్చుటకు నిధులను నేకరించుట, సభ్యులలో పొదుపును, స్వయం సహాయమును పరస్పరసహాయమును ప్రోత్సహించుట, సంఘము యొక్క విస్తీర్ణము ఒక గ్రామమునకు పరిమితమై వుండెడిది

భారతదేశములోని అప్పటి పరిస్థితులకు చిన్నచిన్న సహకార పరపతి సంఘములే సరియైనవని భావించడం జరిగింది. సంఘవ్యవహారిక విస్తీర్ణము ఒక గ్రామమునకే పరిమితమై వుండుటవలన సభ్యుల మధ్య పరస్పర అవగాహన, సహకార భావము, సంఘీభావము పెంపొందునని భావించిరి. చిన్న సంఘముల నిర్వహణ సులభ సాధ్యము. వీటి విధానములను, కార్యక్రమములను, సహకార సిద్ధాంతములను ప్రజలు అర్థము

చేసుకొనుట తేలిక. పరిమితిలేని పూచీవలన, సంఘ సక్రమ నిర్వహణలో సభ్యులు శ్రద్ధవహింతురని, అప్పులను వినియోగించుటలోను, తిరిగి చెల్లించుటలోను పరస్పర పర్యవేక్షణ, ఉమ్మడి అజమాయిషీ వుండునని భావించిరి, సంఘ నిర్వహణ పాలకవర్గ సభ్యులు గౌరవ పద్ధతిలో నిర్వహించుట వలన సంఘ నిర్వహణ ఖర్చులు తగ్గునని భావించిరి.

కాని సంఘములు నిర్వహించు వ్యాపారం మరీ తక్కువగావుండటంవలన సంఘములు లాభముతో నడుపుట కష్టమయ్యెను, సంఘ ఆదాయం తక్కువగా వుండుటవలన కేంద్ర సంస్థలనుండి అవి పొందగలిగిన ఋణపరిమితి తక్కువై సభ్యులందరి అవసరములను తీర్చలేక పోయెడివి. సంఘవిస్తీర్ణము ఒక గ్రామమునకు పరిమితమై ఉన్నను సభ్యుల మధ్య అప్పులను సక్రమముగా వినియోగించుటలో వుండుననుకొన్న ఉమ్మడి పర్యవేక్షణ, అజమాయిషీ వాస్తవికముగా లేదు, అందుచేత ఈ సంఘములు గ్రామస్థుల ఆర్థిక పరిస్థితిని మెరుగు పరచుటలో ఆశించినంతగా విజయం సాధించలేక పోయెనని భావించవలసి వచ్చెను.

## బహుళార్థ సాధక సహకార సంఘములు
## Multi-Purpose Co-operative Societies

హిందూదేశమున పరపతితో సహకారోద్యమము ప్రారంభింపబడినను, కాలక్రమమున ఈ ఉద్యమము మిగతా ఆర్థిక రంగాలకు అన్ని జీవనరంగాలకు వ్యాప్తి చెందినది, పరపతి సంఘముల ముఖ్య ఉద్దేశ్యములలో మార్పువచ్చి ఈ సంఘములు గ్రామీణులకు కావలసిన పరపతేతర అవసరములనుకూడా తీర్చుటకు ప్రయత్నించుచున్నవి. కనుక గ్రామీణ పరపతి సంఘముల పేరు బహుళార్థ సాధక సహకార సంఘములుగా మార్పు చెందినవి, నిత్యజీవితావసర వస్తువుల పంపిణీ నిర్వహించుట, ఈ

సంఘముల ముఖ్య ఉద్దేశ్యములలో ఒకటి. వివిధ అవసరములున్న గ్రామస్థులందరు ఈ సంఘములలో సభ్యులుగా చేరవచ్చును.

మొదట అప్పటి బరోడా రాష్ట్రములోని కోడినార్ తాలూకాలో సర్ మణిలాల్ బి. నానావతి అను సహకార సంఘముల రిజిస్ట్రారు ఈ పద్ధతిని ప్రయోగాత్మకముగా అమలు పరచినారు. ఈ పద్ధతి జయప్రదమగుటచే 1937 లో రిజర్వుబ్యాంకు ఆఫ్ ఇండియా వ్యవసాయ పరపతి డిపార్టుమెంటువారు విడుదలచేసిన పత్రములో దేశములోని పేదరికమును రూపుమాపుటకు బహుళార్థ సాధక సంఘముల స్థాపన సరియైన పరిష్కార మార్గమని తెలిపిరి. అందుచేత అన్ని రాష్ట్రములలోని సహకార సంఘములను ఈ విధముగా పునర్నిర్మించుటకు సిఫార్సుచేసిరి. సంఘముల వ్యాపారము పెరుగుట వలన నిర్వహణ ఖర్చులు తగ్గునని భావింపబడెను.

ఈ సంఘములు వ్యవసాయోత్పత్తిని దోహదపరచుటకు, పరపతిని ధనరూపములోను వస్తురూపములోను ఇచ్చి వారి పంటలను లాభదాయకముగా విక్రయించుకొనుటకు ఏర్పాట్లు గావించును. ఇందుకు వీలుగా తాలూకా మార్కెటింగు సంఘములతో ఈ సంఘములు అనుబంధింపబడెను. ఈ సంఘములు మంచి వ్యవసాయము, మంచి వ్యాపారము చేయుటకు, మంచి జీవనము గడుపుటకు తోడ్పడునని భావించిరి.

కాని, నిజానికి ఆశించినంతగా ఈ సంస్థల నిర్వహణ మెరుగుపడలేదు. పరపతేతర కార్యక్రమములు జయప్రదముగా నిర్వహించుటకు వ్యాపారానుభవము ఓర్పు, నేర్పు, తెలివితేటలు, దూరదృష్టి, సామర్థ్యము కావలయును, ఈ సంఘముల నిర్వహణకు శిక్షణపొందిన పూర్తి కాలపు ఉద్యోగుల సేవలవసరము. సిబ్బందిని నియమించుకొనే శక్తి చాలా సంఘములకు లేదు, కనుక చాలా సంఘములలో పరపతేతర వ్యాపారము పెద్దగా అభివృద్ధి చెందలేదు.

## గ్రామీణ సహకార బ్యాంకులు
## Co-Operative Rural Banks

పల్లెసీమలందు పొదుపు అలవాట్లను పెంపొందించుటలోను, మిగులు ధనమును డిపాజిట్ల రూపములో సేకరించుటలోనూ, బ్యాంకింగు సౌకర్యములను కలిగించుటలోనూ బహుళార్ధ సాధక సంఘములు జయప్రదమవలేదు, కనుక ఈ లక్ష్యములను సాధించుటకు గ్రామీణ సహకార బ్యాంకులను స్థాపించుట మంచిదని భావించి అప్పటి మద్రాసు రాష్ట్రపు సహకార సంఘముల రిజిష్ట్రారు గ్రామీణ బ్యాంకులు లేక వ్యవసాయ బ్యాంకుల స్థాపనకు ఒక పథకమును రూపొందించి, అమలు పరచెను. 1988 లో ఆంధ్రప్రదేశ్ లోని తూర్పుగోదావరి జిల్లా ఆలమూరులో, దేశములో మొట్ట మొదటగా గ్రామీణ బ్యాంకు స్థాపింపబడెను.

రిజర్వు బ్యాంకు మరియు గ్రామీణ బ్యాకింగు ఎంక్వయిరీ కమిటీ కూడా దేశములో గ్రామీణ సహకారబ్యాంకుల స్థాపనకు సలహాయిచ్చిరి.

గ్రామీణ బ్యాంకులు పరిమితపూచీతో కొన్నిగ్రామాలకు విస్తరించి పనిచేయును. ఈ బ్యాంకులో స్వల్పకాలిక, మధ్యకాలిక ఋణములను యిచ్చుటయేగాక వ్యవసాయోత్పత్తికి కావలసినఎరువులు, విత్తనములు, క్రిమిනాశక మందులు, ఆధునిక వ్యవసాయ పనిముట్లు, పశుగ్రాసము పంపిణీ చేయును. సభ్యులకు గిడ్డంగి. విక్రియము, ప్రోసెసింగు సౌకర్యములను కూడ కల్గించును. కుటుంబావసర వస్తువులను సరఫరా చేయును. బ్యాంకింగు సౌకర్యములు కల్గించును. అన్నిరకముల డిపాజిట్లను అంగీకరించును. చెక్కులను, డ్రాఫ్టులను యిచ్చుట. వసూలు చేయుట మొదలగు కార్యక్రమములను, నిర్వర్తించును. పంటహామీ అప్పు, బంగారము మొదలగు విలువయిన వస్తువులమీద తాకట్టు అప్పు, గవర్నమెంటు అప్పు పత్రములమీద, డిబెంచర్లమీద, ఇన్సూరెన్సు పాలసీల మీద అప్పులు

యిచ్చును. పాడిపశువులను కొనుటకు కోళ్ళ పెంపకమునకు యితర వ్యవసాయ అనుబంధ వృత్తులను చేపట్టుటకు అప్పులిచ్చును. ఆధునిక వ్యవసాయ యంత్రములను, పనిముట్లను సేకరించి సభ్యులకు అద్దెకు యిచ్చును. సభ్యుల కోసం సహకార విద్యాకార్యక్రమమును నిర్వర్తించును.

ఈ బ్యాంకులు శిక్షణ పొందిన ఉద్యోగులతో నిర్వహించబడును. కార్యాలయ భవనము, గిడ్డంగి సౌకర్యములు కల్గియుండును.

గ్రామీణ సహకార బ్యాంకులు చాలా ప్రదేశములలో మంచి వ్యాపారము చేసి జయప్రదముగా నిర్వహింపబడినవి,

కాని గ్రామీణ బ్యాంకులు నెలకొల్పు విధానము అఖిలభారత గ్రామీణ పరపతి పరిశీలనా సంఘము సిఫార్సుపై విశాల సహకార సంఘముల స్థాపనకు 1956 లో నిర్ణయింపబడి నప్పటినుండి విరమించిరి,

## విశాల సహకార సంఘములు
## (Large-Sized Co-operatives Societies)

1951 లో రిజర్వు బ్యాంకుచే నియమింపబడిన అఖిలభారత గ్రామీణ పరపతి పరిశీలనా సంఘము తమ నివేదికలో (1954) సహకార పరపతి ఉద్యమాభివృద్ధికి ప్రాథమిక స్థాయిలో తక్కువ వ్యవహారిక విస్తీర్ణము కలిగినటువంటి పరిమితిలేని పూచీ సంఘములు సరిఅయినవికావని. పరిమిత పూచీతో వ్యవహారిక విస్తీర్ణము పెద్దగాగల విశాల సహకార సంఘముల స్థాపనకు సిఫార్సుచేసిరి; సంఘములు ఆర్థిక పటిష్టత కలిగి ఉండవలెనని భావించిరి. ఇందుకు ఈ సహకార సంఘములలో రాష్ట్ర ప్రభుత్వము వాటాలు తీసుకొనవలయునని. సాధారణముగా సంఘము 300 నుండి 500 వరకు సభ్యులను కలిగియుండి, ఒకటిన్నర లక్షల పరపతి

వ్యాపారము చేయగలిగినవై ఉండవలయునని తలచిరి. స్వల్పకాలిక అప్పులను పంట అప్పు పద్ధతిపై యివ్వవలయును. ఈ సంఘములు తాలూకా మార్కెటింగు సంఘములతో అనుబంధింపబడి. సభ్యుల పంట విక్రయము నుండి అప్పులను వసూలు చేయవలెను.

చిట్ ఫండ్ పద్ధతి ద్వారా ధనమును సేకరించి వినియోగ అవసరములకు కూడా అప్పులివ్వవలెను. గ్రామీణ చేతివృత్తుల వారికి కూడా పరపతి నివ్వవలెను. ఉత్పత్తి అవసరములకు మధ్యకాలిక అప్పులు కూడా యివ్వవలయును. పంటహామీ అప్పు. బంగారము తాకట్టు అప్పులు కూడా ఈ సంఘములు యిచ్చును. సభ్యుల నుండి డిపాజిట్లను సేకరించుటకు తగుపరిస్థితులను కల్పించవలయును తగు ఏర్పాట్లు గావించవలయును. ఈ సంఘములను నిర్వహించుటకు శిక్షణ పొందిన పూర్తి కాలపు వేతన ఉద్యోగులు ఉండవలయును, సంఘములకు కార్యాలయము, గిడ్డంగి సదుపాయము లుండవలయును.

ఈ సంఘములను 1953 నుండి స్థాపించుట మొదలిడిరి.

## సేవా సహకార సంఘములు

## (Service Co-operative Societies)

విశాల సహకార సంఘముల స్థాపనా కార్యక్రమము మొదలిడి మూడు సంవత్సరములు కాకపూర్వమే గ్రామమునకొక సేవా సహకార సంఘము స్థాపించవలెనని జాతీయ అభివృద్ధి మండలి (National Development council) 1958 నవంబరులో నిర్ణయించుటచే విశాల సహకార సంఘములను స్థాపించుట విరమించబడెను. విశాల సహకార సంఘముల స్థాపన గురించి పూర్తిగా అవగాహన లేకపోవుటచే కొన్ని రాష్ట్రములలో 20 నుండి 30 గ్రామములకొక విశాల సహకార సంఘమును స్థాపించిరి. దానివలన సభ్యులు పరపతి మరియు ఇతర సేవా సౌక

ర్యములకు ఎక్కువదూరము వెళ్ళవలసి వచ్చేడిది. వ్యవసాయోత్పత్తిని పెంచడానికి తగిన సేవాసౌకర్యములను అందించుటకు ప్రతీ గ్రామాని కొక సహకార సంఘమును స్థాపించుట అవసరమని భావించిరి. బహు కార్యసాధక సంఘములను సేవా సహకార సంఘములుగా రూపొందించిరి

ఈ సంఘముల ముఖ్య ఉద్దేశ్యములు :-

(1) రైతుల ఉత్పత్తి ప్రణాళికను అనుసరించి వ్యవసాయ మదుపులకు అప్పుల నిచ్చుట.

(2) సభ్యులు తమ పంటను మార్కెటింగు సంఘముద్వారా అమ్మవలెనని నిర్దేశించుట; వారి అప్పులను పంట అమ్మకాల నుండి వసూలు చేయుట

(3) పశువులను కొనటానికి యితర వ్యవసాయాభివృద్ధి కార్య క్రిమాలకు, మధ్యకాలిక అప్పులను మంజూరు చేయటం.

(4) అధిక వ్యవసాయోత్పత్తికి వీలుగా మంచి విత్తనాలు, ఎరువులు. క్రిమి సంహారక మందులు, ఆధునిక వ్యవసాయ పనిముట్లు పంపిణీ చేయటము.

(5) నిత్యజీవితావసర వస్తువులను సరఫరా చేయుట.

(6) సభ్యుల పంటను లాభసాటిగా అమ్ముటకు ఏర్పాట్లు చేయుట.

(7) సభ్యులలో పొదుపును, స్వయం సహాయాన్ని పరస్పర సహాయాన్ని పెంపొందించుట.

ఈ సంఘము పూచీ, పరిమితముకాని, అపరిమితముకాని సభ్యుల ఇష్టముపై ఆధారపడి ఉండును.

## సహకార పరపతిపై నిపుణుల సంఘము

## Expert Committee on Co-operative Credit – 1960

శ్రీ V. L. మెహతా అధ్యక్షతతో కేంద్రప్రభుత్వముచే నియమింపబడిన సహకార పరపతిపై నిపుణుల సంఘము (1960) ప్రతి సహకార పరపతి సంఘము ఆర్థిక పటిష్టతతో నిర్వహణ సామర్థ్యము (Economic Viability) కలిగి యుండవలయునని సూచించిరి. ఇందుకు వీలుగా గ్రామములు మరీ చిన్నవయిన కొన్ని గ్రామముల కొక పరపతి సంఘమును, సాధారణముగా 800 గ్రామ ప్రజలకొక సంఘము నేర్పాటు చేయవలయునని సూచించెను. సంఘ కార్యాలయము 3 లేక 4 మైళ్ళ కంటె దూరము ఉండకూడదనిరి. పరపతి సంస్థలన్నింటిలోను ప్రభుత్వ భాగస్వామ్యము ఉండవలయునని సాధారణముగా యిది రు. 1,000 నుండి 5,000 రూ॥ ల వరకు వుండవచ్చునని ప్రత్యేక పరిస్థితులలో 10,000 రూ॥ల వరకూ సభ్యుల వాటాధనము మేరకు (on a Matching basis) వుండవలయునని సూచించిరి. స్వయం పోషకముగా వుండునట్లు రూపొందించబడిన (Viable) సంఘములకు సంవత్సరమునకు 1,200 రూ.చొప్పున 5సం॥ల వరకు ఉద్యోగులను నియమించు కొనుటకు సబ్సిడీ (Managerial Subsidy) ఇవ్వవలయునని సూచించిరి.

## స్వయం పోషక పరపతి సంఘములు

## (Viable societies)

1964లో రాష్ట్ర సహకార మంత్రుల సమావేశము సహకార పరపతి సంఘములు ఆర్థిక పటిష్టత కలిగి నిర్వహణ సామర్థ్యముతో పని చేయుటకు వీలుగా, పనిచేయని సంఘములను రద్దుపరచి స్వయం పోషకమైన సంఘములుగ పునర్నిర్మించు కార్యక్రమము (Viability Pro-

gramme) ను అమలు పరచుటకు నిర్ణయించెను అప్పటిలో ఒకసంఘము నిర్వహణ యోగ్యత కలిగి యుండవలయుననిన ఈ క్రింది వివరింపబడిన ముఖ్యలక్షణములను కలిగియుండవలయునని సూచించిరి.

1. ఒక సంఘము కనీసము లక్షన్నర రూ॥ల పరపతి వ్యాపారం చేయగలిగినదై ఉండవలయును.

2 పూర్తి కాలము పనిచేయు శిక్షణపొందిన ఉద్యోగిని కలిగి యుండవలెను.

3. సంఘం కార్యాలయమును కలిగియుండవలెను.

4. సభ్యుల వాటాధనముపై "డివిడెండు"ను ఇచ్చుటకు, ఇతర రిజర్వు నిధులను ఏర్పరచుటకు తగు లాభముతో పనిచేయగలిగి యుండవలయును.

1969లో రిజర్వుబ్యాంకుచే శ్రీ బి. వెంకటప్పయ్య అధ్యక్షతన నియమింపబడిన అఖిలభారత గ్రామీణ పరపతి సమీక్షా సంఘము 1970-71 నాటికల్లా దేశంలోని ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘములన్నింటిని స్వయంపోషక (Viable) సంఘములుగా పునర్నిర్మించు కార్యక్రమమును పూర్తిచేయ వలయునని సలహా ఇచ్చిరి.

1972లో రిజర్వు బ్యాంకుచే శ్రీ సి. డి. దాతే అధ్యక్షతన నియమింపబడిన సహకార సంస్థల బకాయిల అధ్యయన బృందం ప్రాథమిక సహకార పరపతి సంఘం ఆర్థిక పటిష్టతతో నిర్వహణ యోగ్యతను కలిగివుండుటకు కనీసం రు. 2 లక్షల పరపతి వ్యాపారం చేయుచున్నది. లేక చేయుటకు అవకాశం ఉన్నది కాని అయివుండవలయునని సూచించినది.

## రైతుల సేవా సహకార సంఘములు
## Farmers' Service Co-operative Societies

ప్రస్తుతము ఉన్న సహకార పరపతి వ్యవస్థ సన్నకారు రైతుల, పేదరైతుల వ్యవసాయ కూలీల పరపతి అవసరములను తీర్చుటలో విఫల మైనదని, వారి అవసరములను తీర్చుటకు ప్రత్యేక సంస్థలను, రైతుల సేవా సహకార సంఘములను స్థాపించవలయునని 1971లో జాతీయ వ్యవసాయ కమీషన్ కేంద్ర ప్రభుత్వమునకు సూచించినది. ఈ కమీషన్ సిఫారసుల ననుసరించి రైతులకు, గ్రామీణ వృత్తి పనివారికి సమగ్ర పరపతి ఇతర సేవా సౌకర్యములు అందజేయుటకు ప్రయోగాత్మకంగా, సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థల వ్యవహారిక విస్తీర్ణంలో. రైతు సేవా సహకారసంఘములను స్థాపించుటకు 1973లో ప్రభుత్వము నిర్ణయించినది.

రైతులకు ముఖ్యముగా సన్నకారు, పేద రైతులకు వ్యవసాయ కూలీలకు మరియు గ్రామీణ వృత్తిపనివారికి సమగ్ర పరపతి సౌకర్యాలు కలుగజేయడము; ఉపాధి కల్పనకు సౌకర్యాలు కలుగజేయడము, తద్వారా ఉత్పత్తి ఆదాయములను పెంపొందింప జేయడం, నిత్య జీవితావసర వస్తువుల పంపిణీని నిర్వహించడం. ఈ సంఘముల యొక్క ముఖ్యోద్దేశములు. ఈ ఆశయాల సాధనకు ఈ దిగువ నుదహరించిన కార్యక్రిమాలు చేపట్టవలసియున్నది.

1. సభ్యులకు స్వల్పకాలిక, మధ్యకాలిక, దీర్ఘకాలిక ఋణాలను మంజూరు చేయటం.

2. వ్యవసాయోత్పత్తి కవిత్తనాలు, ఎరువులు క్రిమినాశక మందులు వ్యవసాయ పరికరాలు, పశుపోషక ఆహారం మొదలగునవి కొనుగోలుచేసి సభ్యులకు సరఫరా చేయుట, వ్యవసాయ సాంకేతిక సలహాలను అందించుట.

3. సభ్యుల ఉత్పత్తులను సేకరించి, విక్రయించడము.

4. సభ్యులకు గిడ్డంగి సౌకర్యాలను ఏర్పరచడము,

5. ప్రోసెసింగ్ యూనిట్లను స్థాపించడము లేక అద్దెకు తీసుకోవ డం యిందుకు సంబంధించి సభ్యుల అవసరాలను తీర్చడం.

6. లిఫ్టు ఇరిగేషన్ పథకాలను చేపట్టడం.

7. సన్నకారు రైతులు, వ్యవసాయకూలీలు స్వయంపోషక ఆదా యములు కలిగి జీవించుటకు వీలుగా కోళ్ళ పెంపకము, గొర్రెల పెంప కము, చేపల పెంపకం, పాడిపరిశ్రమ, పందుల పెంపకము, తేనె పరి శ్రమ, పట్టు పరిశ్రమ మొదలగు వ్యవసాయ అనుబంధ వృత్తులను చేపట్టు టకు పరపతి సౌకర్యాలు కలుగచేయడము.

8. సభ్యుల ఆర్థికాభివృద్ధికి దోహదపడు ఇతర అన్ని కార్యక్రమ ములను చేపట్టి నిర్వహించుట.

కనీసం పదివేల జనాభా కలిగిన ప్రాంతానికి ఒక రైతు సేవా సహకార సంఘమును స్థాపించవచ్చును. 5 సం॥లలో కనీసం 10 లక్షల రూపాయల వ్యాపారాన్ని నిర్వహించగల దక్షత ఈ సంఘానికి వుండ వలయును. ఈ సంఘములో అందరికి సభ్యత్వ అవకాశములు యున్నను, పాలకవర్గంలోని సభ్యత్వంలో మూడింట రెండువంతులు సన్నకారు, పేదరైతులకు వ్యవసాయ కూలీలకు గ్రామీణ వృత్తి పనివారికి కేటా యించడంద్వారా సంఘము యొక్క నిర్వహణపైన అధికారం బలహీన వర్గములవారికి వుంటుంది. ఈ సంఘములకు కేంద్ర సహకార బ్యాంకులు గాని వాణిజ్య బ్యాంకులుగాని, ఆర్థిక సహాయము చేయును. రాష్ట్ర ప్రభుత్వము ఈ సంఘములలో రు. 50,000 వరకు వాటాధనము తీసు కొనును. సంఘ నిర్వహణలో ప్రత్యేకశిక్షణ పొందిన అనుభవం కల్గిన

వ్యక్తి మేనేజింగు డైరెక్టరుగా నియమింపబడును. ఆర్థిక సహాయము చేయు బ్యాంకు, 3 సం॥ల వరకు సంఘముయొక్క మేనేజింగ్ డైరెక్టరు యొక్క జీతభత్యములు భరించును, ఈ సంఘంలకు ఒక సహాయ వ్యవసాయాధికారి, ఇద్దరు గ్రామీణాభివృద్ధి అధికారుల సేవలను 3 సం॥ల పాటు రాష్ట్ర ప్రభుత్వం ఉచితంగా సమకూర్చును.

మన రాష్ట్రంలో ఇప్పటివరకు 71 రైతు సేవా సంఘములు ప్రారంభింపబడినవి. వాటిలో 59 సంఘములకు వాణిజ్య బ్యాంకులు 12 సంఘములకు కేంద్ర సహకార బ్యాంకులు ఆర్థిక సహాయము అందజేయు చున్నవి.

## బ్యాంకింగు కమీషన్ (1969-72) సిఫార్సులు

కేంద్ర ప్రభుత్వంచే నియమింపబడిన బ్యాంకింగు కమీషను గ్రామ ప్రాంతాలలో పరపతి సరఫరాకు బ్యాంకింగు సౌకర్యాలు కల్పించడానికి గ్రామీణ బ్యాంకులను స్థాపించుటకు సిఫార్సు చేసినది.

## టి. ఏ. పాయ్ అధ్యక్షతన నిపుణుల బృందపు సిఫార్సులు

### Recommendations of expert group headed by Sri T.A. Pai

వ్యవసాయ పరపతిని అందించుటకు సంస్థాపరమైన ఏర్పాట్లు పరిశీలించుటకు శ్రీ టి ఏ. పాయ్ అధ్యక్షతతో నియమింపబడిన నిపుణుల బృందం, బ్యాంకింగు కమీషన్, జాతీయ వ్యవసాయ కమీషన్ వారి సూచనలను పరిశీలించి ప్రాథమిక స్థాయిలో గ్రామీణుల పరపతి అవసరములను తీర్చుటకు స్వయంపోషకమైన, ఆర్థిక పటిష్టత కలిగిన బహుళార్థ సాధక సంఘము (A Viable Multi-purpose society) నేర్పాటు చేయుట ఉత్తమంగా, ఆదర్శవంతంగా వుండునని అభిప్రాయపడినది. వ్యవసాయదారుడు తనకు కావలసిన పరపతి అవసరములను పొందుటకు

వేరు వేరు సంస్థలకు వెళ్ళనవసరం లేకుండా ఒకే సంస్థనుండి (at Single Contact Point) స్వల్పకాలిక, మధ్యకాలిక, దీర్ఘకాలిక పరపతి (సమగ్రపరపతి)ని యితర సేవా సౌకర్యములు పొందుట మంచిదని, ఇందుకు తగిన ఏర్పాటు చేయవలయునని సూచించిరి. ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘములు జాతీయ వ్యవసాయ కమీషన్ వారు సూచించిన రైతుల సేవా సహకార సంఘములవలె పనిచేయగలిగినవై ఉండవలయుననిరి.

## ఆంధ్రప్రదేశ్ గిరిజన సహకార కార్పొరేషన్-1970

**A.P. Girijan Co-operative Corporation-Visakhapattanam**

ఆంధ్రప్రదేశ్ గిరిజన సహకార సంస్థ, విశాఖపట్టణం కేంద్ర స్థానంగా కలిగి పనిచేయుచున్నది. గిరిజనులకు పరపతి సౌకర్యం కల్గించడం, వారికి కావలసిన కుటుంబావసర వస్తువులను సరఫరాచేయడం, గిరిజనులు ఉత్పత్తిచేసే ఉత్పత్తులకు అటవీసంపదకు మంచి గిట్టుబాటు ధర వచ్చునట్లు విక్రయ సౌకర్యములను కల్గించడం, రవాణా, గిడ్డంగి, ప్రోసెసింగు సౌకర్యాలను ఏర్పరచడం ఈ సంస్థ ప్రధాన లక్ష్యం. దాదాపు 30 ప్రాథమిక సంఘంల ద్వారాను, 400 నిత్య జీవితావసర వస్తువుల పంపిణీ డిపోలద్వారాను ఈ సంస్థ పనిచేయుచున్నది, గిరిజనుల ఫలసాయమును అమ్మటకు అనేక పట్టణములలో అమ్మకపు డిపోలను కూడా నడుపుచున్నది. గిరిజనాభ్యుదయానికి ప్రభుత్వ విధానాన్ని అమలు జరపడంలో ఈ సంస్థ ప్రధాన ఏజెన్సీగా కృషి చేయుచున్నది.

రిజర్వు బ్యాంకు ఈ సంస్థకు పరపతి మంజూరు చేయుచున్నది. రాష్ట్ర సహకార బ్యాంకు కూడా తన స్వంత నిధులనుండి ఈ సంస్థకు ఋణసౌకర్యం కలిగించుచున్నది. గిరిజనులకు పరపతి అందజేయుటలో ఈ సంస్థ కేంద్ర సహకార బ్యాంకులవలె పనిచేయుచున్నది.

## విశాల వ్యవసాయ బహుళార్థసాధక సహకార సంఘములు

**L A M P S**

**(Large-sized Agricultural Multi-Purpose Co-op. Society)**

గిరిజన ప్రాంతంలోని సహకార వ్యవస్థా నిర్మాణంను పరిశీలించుటకు శ్రీ కె. ఎన్. బావా అధ్యక్షతన ఒక అధ్యయన మండలిని 1971 డిసెంబరులో కేంద్ర ప్రభుత్వం నియమించినది. ఈ మండలి గిరిజనుల అన్ని అవసరములను తీర్చుటకు LAMPS ను స్థాపించుటకు సిఫార్సు చేసిరి. ఇప్పుడున్న సహకార సంఘములను గిరిజన ప్రాంతములలో LAMPS గా రూపొందించుటకు నిర్ణయింపబడినది.

ఇవి గిరిజనులకు ఉత్పాదక పరపతిని. వినియోగ పరపతిని (Production Credit and Consumption Credit) వ్యవసాయోత్పత్తికి కావలసిన ఎరువులను విత్తనములను క్రిమినాశక మందులను ఆధునిక వ్యవసాయ పరికరములను సరఫరా చేయును. వారికి కుటుంబావసర వస్తువులనుకూడా సరఫరా చేయును.

ఈ ప్రాంతాలలో పండిన పంటను అటవీసంపదను (తేనె, లక్క, తుమ్మజిగురు, కుంకుళ్ళు, షీకాయి అడ్డాకులు, కొండచీపుళ్ళు, చింతపండు, వనమూలికలు మొదలగునవి) ఎగుమతి చేయుటకు మంచిధర వచ్చుటకు రవాణా, గిడ్డంగి విక్రియము, ప్రోసెసింగు కార్యక్రమములకు సేవా సౌకర్యములు సమకూర్చును. ఈ ప్రాంతాలలోని ప్రజల ప్రత్యేక అవసరములను తీర్చి వీరిని దళారుల ఆర్థిక దోపిడీనుండి రక్షించి, వారి ఆర్థిక పురోగతికి సహాయపడుటకై వివిధ రాష్ట్రములతో LAMPS ను స్థాపించుటకు సిఫార్సు చేయబడినది.

## సహకార పరపతి వ్యవస్థ-ఏకీకరణ

సహకార పరపతి వ్యవస్థను ఏకీకరణ చేయవలసిన అవసరమును, యిందుకు గల అవకాశములను పరిశీలించుటకు 1976లో రిజర్వు బ్యాంకు వారు శ్రీ ఆర్. కె. హజారి అధ్యక్షతతో ఒక సంఘమును నియమించి వారు. వారు సహకార పరపతి వ్యవస్థను పరిశీలించి స్వల్పకాలిక దీర్ఘ కాలిక పరపతి సంస్థలను అన్నిస్థాయిలలోను కలుపుట అవసరమని మంచి దని సూచించిరి. చిన్న రాష్ట్రములలో ఈ ఏకీకరణఅన్ని స్థాయిలలోనూ ఒకేసారి చేయవచ్చునని, పెద్ద రాష్ట్రములలో ఈ ఏకీకరణ అన్ని స్థాయి లలోనూ ఒకేసారి తెచ్చుట సాధ్యము కాదని మొదట్లో ప్రాథమిక స్థాయి నుండి ఈ ఏకీకరణ ప్రారంభించాలని ఈ కమీషను అభిప్రాయపడినది.

సహకార పరపతి వ్యవస్థలో ఈ ఏకీకరణ విధానాన్ని రిజర్వు బ్యాంకు యొక్క వ్యవసాయ పరపతి బోర్డు ఆమోదించినది. హజారి కమిటీ చేసిన సూచనలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మాత్రప్రాయముగా ఆమోదించినది. సహకార పరపతి సంస్థల ఏకీకరణ రైతులకు సర్వతో ముఖ శ్రేయస్సుకు ఉపయోగపడునని భావింపబడినది; ఎంపిక చేసిన కొన్ని ప్రాంతములలో నాగార్జునసాగర్, పోచంపాడు ఆయకట్టు అభి వృద్ధి ప్రాంతములలో ప్రాథమిక స్థాయిలో ఈ ఏకీకరణను ప్రయోగా త్మకముగా అమలు చేయడానికి మన రాష్ట్ర ప్రభుత్వము చర్య ప్రారం భించినది. ఈ ఏకీకరణవలన ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘములు స్వల్పకాలిక మధ్యకాలిక పరపతితో పాటు దీర్ఘ కాలిక పరపతినికూడా రైతులకు అందచేయును. ఒకే సంస్థ నుండి రైతు తన పరపతి అవసర ములన్నిటిని తీర్చుకొనుటకు సాధ్యపడును.

## ఆంధ్రప్రదేశ్‌లో స్వయంపోషకమైన పరపతి సంఘముల పునర్నిర్మాణము

1975 సెప్టెంబరుతో జరిగిన రాష్ట్ర సహకార మంత్రుల సమా

వేశము గ్రామీణ సహకార పరపతి సంస్థలు, రైతుల సేవా సహకార సంఘములవలె నిర్వహణ సామర్ధ్యము కలిగి పనిచేయవలయునని. యిందుకు వీలుగా వాటిని స్వయంపోషకమైన సంస్థలుగా త్వరితంగా పునర్నిర్మించుట అవసరమని నిర్ణయించిరి.

మన రాష్ట్రములో ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘములను స్వయంపోషకమైన సంఘాలుగా ఏర్పచుటకు సంఘములను కలుపుటకు, రద్దు చేయుటకు 1976 జనవరిలో సహకార సంఘముల రిజిస్ట్రారుకు అధికారమిస్తూ ఆర్డినెన్సు జారీచేయుట జరిగినది. ఈ కార్యక్రమమును 1977లో అమలు పరచుటవలన మన రాష్ట్రములోని 15.020 ప్రాథమిక సహకార పరపతి సంఘముల సంఖ్య 6500 సంఘములుగా తగ్గినది.

స్వయంపోషకము, స్వశక్తివంతమైన (Economically Viable) సహకార పరపతి సంఘము కనీసము 2 లక్షల రూ॥ల స్వల్పకాలిక పరపతి వ్యాపారము చేయుచున్నది కాని, చేయుటకు అవకాశమున్నది కాని అయి ఉండును. యిందుకు వీలుగా సంఘ వ్యవహారిక విస్తీర్ణములో 2 వేల హెక్టార్ల సేద్యపు భూమి ఉండవలెను. సాధారణముగా సంఘ వ్యవహారిక విస్తీర్ణము 10 కిలో మీటర్ల పరిధికి మించరాదు.



# 7 ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘము నిర్మాణము-పనిచేయు విధము

## Primary Agricultural Co-operative Credit Society Constitution and Working

సంఘము నిర్మాణము, పనిచేయు విధము సంఘపు నిబంధనావళిలో (బైలాలలో) వివరింపబడి యుండును. ప్రతి సంఘపు బైలాలు ఆసంఘపు పేరు, చిరునామాతో ఒక రిజిష్టరు నెంబరు కలిగి, 1964 ఆంధ్రప్రదేశ్ సహకార సంఘముల చట్టముల క్రింద రిజిష్టరు చేయబడును. లేదా రిజిష్టరు కాబడినట్లు భావింపబడి యుండును.

### వ్యవహారిక విస్తీర్ణము :

సంఘము మొదటి బైలాలో వివరింపబడివుండును. సాధారణముగా గ్రామము పెద్దదైన ఒక గ్రామమునకు, చిన్న గ్రామములయిన కొన్ని గ్రామములకు విస్తరించి ఉండును.

### సంఘముయొక్క ఉద్దేశ్యము ;

సభ్యుల ఆర్థిక సాంఘిక శ్రేయస్సుకు కృషిచేయుట, అందుకు ఈ క్రింది కార్యక్రమములను చేపట్టును.

1. వ్యవసాయ మదుపులకు, సభ్యులకు స్వల్పకాలిక, మధ్యకాలిక అప్పులను మంజూరు చేయుట.

2. కో-ఆపరేటివు సెంట్రల్ బ్యాంకులనుండి, వాణిజ్య బ్యాంకుల నుండి లేక మరే యితర సంస్థల నుండి నిధులను సేకరించుట.

3. విత్తనములు, ఎరువులు, క్రిమిసంహారక మందులు మరియు యితర వ్యవసాయ పరికరములను సేకరించి సభ్యులకు అందచేయుట.

4. సభ్యులు పండించిన పంటను, లేదా సంఘము తాలూకు సరుకును నిలువచేయుటకు గిడ్డంగులను నిర్మించుట, లేదా అద్దెకు తీసుకొనుట.

5. తాను స్వయముగా కాని, మార్కెటింగు సొసైటీ ఏజెంటుగా కాని, తన సభ్యుల తాలూకు పంటను సమీకరించుట, గ్రేడ్ చేయుట, రవాణా చేయుట లేదా అమ్మిపెట్టుట,

6. ప్రోసెసింగు యంత్రములను కాని, రవాణాకు వాహనములను కాని స్వంతముగా కలిగియుండుట.

7 వ్యవసాయ సాంకేతిక సలహాలను సభ్యులకు అందజేయుట.

8. సభ్యులకు కావలసిన నిత్య జీవితావసర వస్తువులను సరఫరాచేయుట

9. సభ్యుల స్వయం ఉపాధి కల్పనకు. వ్యవసాయ అనుబంధ వృత్తులను చేపట్టుటకు తోడ్పడుట.

10, సభ్యుల ఆర్థిక పురోభివృద్ధికి దోహదము చేయునటువంటివన్ని పై ఉద్దేశ్యముల సాధనకు అనువైన తదితర కార్యక్రమములను చేపట్టుట

సభ్యుల బాధ్యత ;

పరిమితము, సభ్యులు చెల్లించిన వాటాధనము మేరకు (Limited by shares) లేదా చెల్లించిన వాటా ధనమునకు కొన్ని రెట్లు (Limited by guarantee) బైలాలలో వివరింపబడినట్లు ఉండును. పరిమిత పూచీ సంఘమునకు పేరుతో " లిమిటెడ్ '' అను పదము చేర్చబడి యుండును. పరిమితిలేని పూచీ సంఘములలో కూడ ప్రభుత్వ బాధ్యత సంఘమునకు చెల్లించిన వాటాధనము మేరకు పరిమితమై

వాటా ధనము ;

ఇందు 'A' తరగతి మరియు 'B' తరగతి అను రెండు రకముల వాటాలుకలవు. 'A' తరగతి వాటా 1కి రు. 10 చొ॥న 'B' తరగతి వాటా 1కి రు. 1 చొ॥న ఉండును 'B' తరగతి సభ్యులు నామ మాత్రపు సభ్యులుగా ఉందురు వీరికి 'A' తరగతి సభ్యులకుండు బాధ్యతలు, హక్కులు ఉండవు. ఓటింగు హక్కు ఉండదు. సంఘపు లాభములలో వాటా ఉండదు. మైనర్లు కూడ 'B' తరగతి సభ్యులుగా చేరవచ్చును. సాధారణముగా తనఖా దస్తావేజులు లేక ఇతర పత్రములు సంఘము పేర వ్రాయునపుడు, అందులో వారి (మైనర్ల) సంతకము అవసరమున్న వారిని 'B' తరగతి సభ్యులుగా చేర్చుదురు. సహకార బ్యాంకులలో బంగారునగల తాకట్టుపై అప్పులు యిచ్చునపుడు వ్యక్తులను 'బి' తరగతి (నామమాత్రపు) సభ్యులుగా చేర్చి వారికి అప్పు యిచ్చెదరు.

సభ్యత్వ అర్హత ;

సంఘపు బైలాలనుసరించి సాధారణముగా సంఘ వ్యవహారిక విస్తీర్ణములో నివసించుచున్న 18 సం॥లు దాటి లావాదేవీలు జరుపుటకు అర్హులైన ప్రతివారు సంఘములో సభ్యులుగా చేరవచ్చును ప్రభుత్వము / ఆర్థిక బ్యాంకు కూడా సభ్యత్వము స్వీకరించవచ్చును. ఎవరిని సంఘములో సభ్యులుగా చేర్చుకొనరాదో సంఘపు బైలాలలో వివరింపబడి వుండును.

## సహకార పరపతి సంఘములలో విస్తృత ప్రాతిపదికపై సభ్యత్వము (Universal Membership)

ఆంధ్రప్రదేశ్ సహకార సంఘముల చట్టము 19వ సెక్షనుకు 1976వ సం॥లో తెచ్చిన సవరణలవలన అర్హత కలిగిన ప్రతివారూ సహ

కార పరపతి సంఘములలో వెంటనే కాలయాపన లేకుండా సభ్యులు కావడానికి అవకాశమేర్పడినది. ఈ మార్పు వలన సంఘ పాలకవర్గము ఒక వ్యక్తి యొక్క సభ్యత్వ దరఖాస్తును త్వరితంగా పరిశీలించక పరిష్కరించక ఆలస్యము చేయుటకుగాని, సభ్యత్వాన్ని నిరాకరించుటకుగాని వీలు లేదు. ఈ చట్ట సవరణవలన ఏ వ్యక్తి అయినా సభ్యత్వము కోరుతూ దరఖాస్తును పంచాయితీ సమితి సహకార విస్తరణాధికారి ద్వారా సంఘమునకు పెట్టుకున్నప్పుడు ఆ సభ్యత్వ దరఖాస్తు సంఘమునకు చేరినప్పటి నుండి అతనికి సభ్యత్వము సంక్రమిస్తుంది.

## షేర్ల గరిష్ఠ పరిమితి-ప్రవేశ రుసుం:-

ప్రతి సభ్యుడు కనీసం ఒక వాటా తీసుకొనవలెను. ఏ సభ్యుడూ అనుమతించిన సంఘ వాటా మూలధనం (Authorised share capital of a society) లో పదవ వంతునకు మించి వాటాధనము తీసుకొనరాదు. ప్రతిసభ్యుడు బైలాలలో నిర్దేశించినట్లు వాటాకి, కొంత ప్రవేశరుసుము చెల్లించవలెను.

## నిధులు

1. వాటా ధనము 2. ప్రవేశరుసుము, వాటా బదలాయింపు రుసుము. 3. సభ్యులనుండి, సభ్యులు కాని వారినుండి డిపాజిట్లు. 4. కేంద్ర సహకార బ్యాంకు నుండి వాణిజ్య బ్యాంకులనుండి ప్రభుత్వము నుండి, రిజిస్ట్రారు వారి అనుమతితో మరే యితర వనరుల నుండి అప్పులు. 5. విరాళములు. 6. గ్రాంట్లు, సబ్సిడీలు. 7. సంఘపు లాభముల నుండి కేటాయింపబడిన నిధులు. 8. యితరములు

**డిపాజిట్లు :-**

ఫిక్స్‌డ్ డిపాజిట్లు, పొదుపు డిపాజిట్లు యితర డిపాజిట్లను సంఘ బైలాల ననుసరించి, సహకార సంఘముల రిజిస్ట్రారు, రిజర్వు బ్యాంకు రాష్ట్ర సహకార బ్యాంకు అప్పుడప్పుడు యిచ్చు సూచనల ననుసరించి అంగీకరించును.

సంఘ గరిష్ట ఋణాధికారము :-

యిదివరకటి పరిమితి లేని పూచీ సంఘములలో సంఘ గరిష్ట ఋణాధికారము సభ్యుల నికర ఆస్తి విలువలో 1/8 వంతునకు మించక వుండును నికర ఆస్థిని నిర్ణయించుటకు సభ్యుల పంటభూముల పూర్తి విలువ, నివేశన స్థలముల విలువలో సగము భాగము చరాస్థుల విలువలో నాల్గవవంతు భాగము తీసుకొని ఆ మొత్తము నుండి సభ్యులకుగల అప్పు మొత్తమును తీసివేయుదురు.

పరిమితి పూచీగల సంఘములలో - సంఘమునకు చెల్లింపబడిన వాటాధనము క్షేమనిధి కలుపగా వచ్చిన మొత్తమునకు, పెరుగుతూ వచ్చిన నష్టములు పోగా (అప్పుడప్పుడూ రిజిస్ట్రారు నిర్ణయించు షరతులకు లోబడి) పదిరెట్లకుమించి వుండరాదు.

Maximum borrowing Power of a Society = (Share Capital + Reserve Fund) — (Accumilated losses) X 10

వ్యక్తి గరిష్ట ఋణాధికారము :-

సభ్యుని యొక్క గరిష్ట ఋణపరిమితి 10,000 రూ॥లు. అయితే ఈ పరిమితి రిజిస్ట్రారు అప్పుడప్పుడు నిర్ణయించు నిబంధనల ననుసరించి మారుచుండును. సభ్యుడు, చెల్లించిన వాటా ధనమునకు (రిజిస్ట్రారు నిర్ణయించు షరతులకు లోబడి) కొన్ని రెట్లవరకు ఋణార్హత కలిగియుం

డును. పంటవారీ ఋణవిధానము ననుసరించి సభ్యుని ఋణార్హత అతను పండించు పంటల పెట్టుబడి అవసరముల నాధారముగా నిర్ణయింపబడును.

## వినిమయ పరపతి

## (Consumption Credit)

ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘములు సాధారణముగా ఉత్పత్తి అవసరములకు మాత్రమే అప్పులను యిచ్చుచున్నవి. అయితే 1976లో దేశంలో ఎమర్జెన్సీ విధించిన కాలంలో ప్రభుత్వం బలహీనవర్గపు ప్రజలు తీసుకున్న అప్పులపై మారిటోరియం విధించడం, ఋణమాఫీ చర్యలు తీసుకోవడం వలన సామాన్య ప్రజలకు అప్పు యిచ్చేవారు యివ్వడం మానుకున్నారు. సామాన్య ప్రజల పరపతి అవసరములను తీర్చుటకు ప్రత్యామ్నాయ మార్గాలను అన్వేషించుటకు శ్రీ బి శివరామన్ అధ్యక్షతన ఒక కమీషన్ ఏర్పాటు చేయబడినది. ఈ కమిటీ బలహీన వర్గపు ప్రజల వినియోగపరపతి అవసరములను అంచనావేసి, ఈ పరపతిని సహకార పరపతి సంస్థలు ఉత్పాదక పరపతితోపాటు అందజేయవలయునని సిఫార్సుచేసిరి. వైద్య, విద్యావసరములకు, శుభాశుభ కార్యములకు, కుటుంబ ఖర్చుల నిమిత్తం, ఒక సభ్యునకు సాధారణముగా రు. 250/- నుండి రు. 500/- మించక అప్పులు యిచ్చుటకు సూచించిరి. అయితే సంఘము యిచ్చు మొత్తము పరపతిలో వినిమయ పరపతి 10 శాతమునకు మించి ఉండరాదని సలహాయిచ్చిరి. రాష్ట్ర ప్రభుత్వములు, రిజర్వుబ్యాంకు ఈ కమిటీ సిఫార్సులను అంగీకరించినవి. (వేతన) కార్యదర్శులు పనిచేయు సంఘముల ద్వారా వినియపరపతిని అందచేయుటకు చర్యలు తీసుకొనబడినవి. సంఘములు సభ్యులకు యిచ్చిన వినిమయపరపతిలో పదవ వంతు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వములు కలసి గ్రాంటుగా యిచ్చుచున్నవి.

## ఋణములకు హామీలు - ఋణములపై నిర్బంధములు

సంఘము, సభ్యులుకాని వారికి ఋణములు మంజూరుచేయరాదు అయితే సంఘ ఉద్యోగులకు రిజిష్ట్రారు అనుమతితో నిబంధనావళిలో నిర్దేశించిన షరతుల ననుసరించి ఋణములను ఇవ్వవచ్చును. సభ్యులు కాని వారికి కూడా సంఘములో వారికున్న డిపాజిట్ల హామీపై అప్పులు ఇవ్వవచ్చును,

1964 ఆంధ్రప్రదేశ్ సహకార సంఘముల చట్టము 46వ సెక్షన్ మరియు 42వ నియమము ననుసరించి సభ్యుడు తీసుకున్న అప్పులకు హామీగా తనకున్న భూములపై హక్కునుగాని, కౌలుదారుగా సదరు భూములపై తనకేర్పడిన హక్కునుగాని సంఘమునకు "ఛార్జి" సృష్టించుచు 'డిక్లరేషన్'' వ్రాసి యివ్వవలెను.

అయితే మూజువాణీ కౌలుదార్లు, డిక్లరేషన్ వ్రాసియిచ్చిన వేరొక సభ్యుని జామీను (వ్యష్టి సమిష్టి బాధ్యత) పైన రూ. 1000లు వరకూ అప్పు పొందవచ్చును. 5 గురు కౌలుదార్లు సమిష్టిగా పూచీపడి నప్పుడు, కౌలుదారుకు రు. 750 చొ॥న అప్పు యివ్వవచ్చును అయితే సంఘము బట్వాడా చేసిన మొత్తము అప్పులో 10 శాతమునకు మించి ఈ విధమైన అప్పులు యివ్వరాదు.

పాలకవర్గము వారు అప్పుడప్పుడు చేయు ఉప నిబంధనలకు లోబడి బంగారు, వెండి నగల తాకట్టుపైన, గవర్నమెంటు ప్రామిసరీనోట్ల తాకట్టుపైన, ఆంధ్రప్రదేశ్ కేంద్ర సహకార వ్యవసాయాభివృద్ధి బ్యాంకు డిబెంచర్ల హామీపైన, పంటల హామీపైన సభ్యులకు ఋణములు మంజూరు చేయవచ్చును.

మధ్యకాలిక ఋణములకు, రిజర్వు బ్యాంకు అప్పుడప్పుడు నిర్ధా

రించు షరతుల ననుసరించి హామీలు పొందవలెను.

వాయీ బ్రాహ్మణులకు, రజకులకు, ఇతర బలహీన వర్గముల వారికి ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘములు అప్పులు యిచ్చుటకు అనుమతించడమైనది.

రిజర్వు బ్యాంకు ఆమోదించిన 22 కుటీర, లఘుపరిశ్రమలకు ఉత్పత్తి విక్రియ అవసరములకు ఋణములు యిచ్చుటకు అనుమతించడమైనది.

ఆ. ప్ర. సహకార సంఘముల చట్టము సెక్షన్ 47 మరియు నియమము 41-A ననుసరించి ప్రాథమిక పరపతి సంఘములు తమ సభ్యులకు స్వల్ప, మధ్యకాలిక ఋణములు మంజూరు చేయుటకు ఆర్థిక సహాయ బ్యాంకుల నుండి, ఒక సహకార సంవత్సరములో పొందిన ఋణ మొత్తములో ఏబది శాతము సన్నకారు రైతులకు, యితర బలహీన వర్గములవారికి ఋణములుగా యివ్వవలెను. (సన్నకారు రైతు అనగా 5 ఎకరముల పల్లపు భూమి లేదా 10 ఎకరముల మెట్టభూమి వరకు కల్గిన వ్యక్తి.)

47వ సెక్షన్ మరియు 41-B నియమము ననుసరించి, కేంద్ర సహకార బ్యాంకు లేదా దాని శాఖకు 10 కిలో మీటర్ల పరిధిలో నున్న సంఘములు తమ సభ్యులకు యిచ్చు ఋణములు చెక్కుల ద్వారా లేదా సభ్యుని అభ్యర్థనపై మనియార్డరు ద్వారా బట్వాడా చేయవలెను.

## వడ్డీ రేట్లు

రిజర్వు బ్యాంకు సవరణ ననుసరించి ది 16-11-1988 నుండి క్రింది విధముగా వడ్డీ రేట్లు అమలులోనికి తేబడినవి.

ప్రాథమిక పరపతి సంఘముల సభ్యులు, తాము తీసుకున్న స్వల్ప కాలిక ఋణములకు, అప్పు 5 వేల రూ॥లకు మించక ఉన్న రు 11-50 చొ॥న; 5 వేల రూ॥ల నుండి పదివేల రూ॥లకు మించకఉన్న రు. 12-50 చొ॥న; పదివేల రూ॥లకు మించిన అప్పు మొత్తాల నూటికి 14 రూ॥ల చొ॥న వడ్డీ చెల్లించవలయును.

మధ్యకాలిక ఋణములపై పన్నకారు రైతులు 5 వేల రూ॥ల అప్పు వరకూ నూటికి రు, 10-25 చొ॥న యితరులు రు, 12-50 చొ॥న వడ్డీ చెల్లించవలెను,

జాతీయ వ్యవసాయ గ్రామీణాభివృద్ధి బ్యాంకు (NABARD) వ్యవసాయమదుపులకు స్వల్పకాలిక ఋణములు 7శాతం వడ్డీరేటుకు రాష్ట్ర సహకార బ్యాంకులకు అందజేయును, రాష్ట్ర సహకార బ్యాంకు 0,50 శాతము, కేంద్ర సహకార బ్యాంకులు 1-50 శాతము; ప్రాథమిక పరపతి సంఘములు 2-50 శాతము (Margin) వడ్డీ కలుపుకొని ప్రాథమిక పరపతి సంఘముల సభ్యులకు 11-50 శాతం వడ్డీకి ఋణములను మంజూరు చేయగల్గుతున్నాయి.

## వసూళ్ళు
## (Recovery of loans)

సభ్యుని లేదా, యింతకు పూర్వము సభ్యుడుగానున్న వ్యక్తి నుండి సంఘమున కేమైనా రావలసియున్న యెడల వాటిక్రింద సంఘములోనున్న వారి వాటాధనము డిపాజిటుపైన సంఘమునకు మొదటిహక్కు యుండును. సంఘములో నున్న సభ్యుని వాటాధనమును లేదా డిపాజిటును లేదా మరే యితర మొత్తమునైనను పూర్తిగా కాని కొంతగాని, సంఘమునకు రావలసిన ప్రాప్తికి మినహాయించు కొనుటకు సంఘము స్వేచ్ఛ కలిగియుండును.

తాను సంఘమునకు చెల్లించవలసిన మొత్తముల క్రింద ఏ సభ్యుడైనా సొమ్ము చెల్లించిన యెడల దానిని మొదట అతడు చెల్లింపవలసిన రుసుముల క్రింద, అటు తరువాత పోస్టల్, రిజిస్ట్రేషన్ తదితర చిల్లర ఛార్జీల క్రింద, తరువాత వడ్డీ క్రింద అనంతరము అసలు క్రింద, జమ కట్టుకొనవలెను.

## ముందుగా ముగించవలసిన అప్పులు
## (Loans to be Fore-Closed)

ఇచ్చిన అప్పు దుర్వినియోగమైనప్పుడు సంఘము అప్పును వెంటనే రద్దుచేసి అప్పు ఖాతాను వెంటనే మూసివేయవలెను. ఆ విధముగా ఖాతాను ముగించినప్పుడు సదరు విషయమును అంతవరకు యివ్వతేలిన మొత్తమును అందుపై వడ్డీని అప్పుదారునకు కార్యదర్శి తెలియపర్చవలెను. ముగింపు తేది నుండి పూర్తిగా చెల్లించు తేది వరకు అపరాధపు వడ్డీని లెక్కగట్టి దానిని తక్షణమే వసూలు చేయుటకు తగిన చర్యలను తీసుకొనవలెను,

జామీనుదారు చనిపోయినప్పుడు, లేదా సభ్యుడుగా తగ్గిపోయినప్పుడు, అసలు అప్పుదారు సదరు విషయమును సంఘమునకు వెంటనే తెలియపరచి, అప్పు మొత్తమును వడ్డీతో సహా వెంటనే చెల్లించనైనా చెల్లించవలెను, లేదా పాలకవర్గము వారికి ఆమోదయోగ్యమైన ఒకరు లేక అంతకు మించిన జామీనుదారులతో క్రొత్తగా తిరిగి అప్పు పత్రమును వ్రాసి అయినా యివ్వవలెను.

సభ్యుడు సంఘమునకు తనఖా పెట్టిన లేక ఛార్జికలగజేసిన స్థిరాస్థిని అన్యాక్రాంతముచేసిన అయన అప్పుఖాతాను అప్పు తీర్మానపు గడువుతో నిమిత్తము లేక వెంటనే ముగించ వలెను.

సభ్యుడు ఎన్నడైన సభ్యత్వమునకు అనర్హుడైన యెడల ఆ కారణముచే అతని పేరును సభ్యత్వ జాబితానుండి తొలగించవలసియున్న యెడల లేక. సభ్యునెవరినైన బహిష్కరించవలసి వచ్చినయెడల. అతనికున్న అప్పు ఖాతాను అప్పు తీర్మానపు గడువుతో నిమిత్తములేక. వెంటనే మూసివేసి. వడ్డీతోసహా అతని నుండి రావలసిన మొత్తమును వసూలు చేయుటకు చర్య తీసుకొనవలెను.

## వ్యవసాయ ఉత్పాదక సేవలు
## (Farm Supply services)

వివిధ పంటలను పండించటంలో రైతులు అధికోత్పత్తిని సాధించడానికి పరపతి సంఘములు అనేక విధాలగ సహాయపడుతున్నాయి. రైతులకు కావలసిన మంచి (అధిక దిగుబడి) విత్తనములు. ఎరువులు, క్రిమినాశక మందులు ఆధునిక వ్యవసాయ యంత్రపరికరాలు, పశుపులదాణా, కోళ్ళమేత మొదలగునవి అందుబాటులో ఉంచుతున్నాయి. ప్రభుత్వ వ్యవసాయశాఖ, పశుసంవర్ధకశాఖ మొదలగు వారి సహాయ సహకారములతో వ్యవసాయ సాంకేతిక పరిజ్ఞానాన్ని; పాడిపరిశ్రమ. కోళ్ళపెంపకం మొదలగు వ్యవసాయ అనుబంధవృత్తుల సక్రమ నిర్వహణకు కావలసిన పరిజ్ఞానాన్ని సభ్యులకు అందజేయుటకు సంఘములు కృషిచేయవచ్చును.

## వ్యవసాయోత్పత్తుల విక్రయ సౌకర్యం - పరపతిని విక్రయముతో అనుసంధానము చేయుట
## Agro Marketing Services
## Linking of Credit with Marketing

పంట అప్పు పద్ధతి క్రింద సభ్యులకిచ్చు అప్పులను వారి పంటలను అమ్మగా వచ్చిన మొత్తములనుండి వసూలు చేయవలెను. సభ్యుడు తన పంటను సంఘముద్వారా కాని సంఘము తెలిపిన మార్కెటింగు సంఘము

ద్వారాకాని విక్రయించుటకు వ్రాతపూర్వకముగా అంగీకారము తెలుప వలెను. సంఘములు, సభ్యులు తమ పంటలను లాభదాయకముగా విక్ర యించుకొనుటకు తగు ఏర్పాట్లు చేయవలెను.

పరపతి సంఘములు, మార్కెటింగు సంఘములు సంఘటితముగా పనిచేయుట వలన రైతుల పంటలకు గిట్టుబాటుధర వచ్చునట్లు మార్కె ట్టును ప్రభావితము చేయవచ్చును. దానివలన పరపతి సంఘముల బకా యిలు తగ్గును.

రాష్ట్ర మార్కెటింగు ఫెడరేషనులు, జాతీయ మార్కెటింగు ఫె డరేషను ద్వారా వ్యవసాయోత్పత్తులను ఎగుమతి చేయుటకు కృషి చేస్తు న్నాయి. ఉదహారణకు ప్రత్తి, పొగాకు, వేరుశనగ, బంగాళాదుంపలు, మిర్చి, ఉల్లిపాయలు, పప్పు దినుసులు. అరటిపండ్లు, మామిడిపండ్లు మొదలగు పంటలను జాతీయ మార్కెటింగు ఫెడరేషన్ ఇతర దేశములకు ఎగుమతి చేయుచున్నది. ఈ ఎగుమతి విధానమువలన రైతులు తమ వ్యవసాయోత్పత్తులకు మంచిధర పొందుటకు అవకాశ మేర్పడుచున్నది. సహకార పరపతి సంఘములు, మార్కెటింగు సంఘముల, ఫుడ్ కార్పొ రేషన్ ఆఫ్ ఇండియా, వినియోగదారుల సహకార సంఘముల ఏజ టుగా తమ సభ్యుల ఉత్పత్తులను కొనుగోలు చేయుచున్నవి. రవాణా, గిడ్డంగి, ప్రోసెసింగు సౌకర్యములను కూడా ఏర్పాటు చేయవచ్చును,

## గ్రామీణ సహకార సంఘములద్వారా నిత్యజీవితావసర వస్తువుల పంపకో

గ్రామ ప్రాంతాలలోని వ్యాపారస్థులు సరిఅయిన పంపిణీ వ్యవస్థ లేని కారణంగా, బీద ప్రజల అశక్తత ఆధారంగా వారిని అధికంగా దోపిడీ చేస్తున్నారు. ఈ పరిస్థితిని చక్కదిద్దడానికి సహకార సంఘములు

నిత్యజీవితావసర వస్తువుల పంపిణీ కార్యక్రమాన్ని సమర్థవంతంగా నిర్వహించాలి.

తగు ఆర్థిక వనరులు లేని కారణంవలన చాలా సహకార పరపతి సంఘాలు తమ వ్యాపారాన్ని విస్తృత పరచుకోలేక పోతున్నాయి. ఈ పరిస్థితిని ఎదుర్కొని గ్రామ పరపతి సంఘాలు నిత్యజీవితావసర వస్తువుల పంపిణీ కార్యక్రమాన్ని చేపట్టడానికి సహాయపడటానికి, జాతీయ సహకారాభివృద్ధి సంస్థ (N C D C) గ్రామీణ నిత్యజీవితావసర వస్తువుల పంపిణీ పథకాన్ని రూపొందించి 1976 జనవరి నుండి అమలు పరస్తున్నది. ఈ పథకం క్రింద గ్రామీణ పరపతి సంఘములకు, మార్కెటింగు సంఘములకు ఆర్థిక సహాయము చేయుచున్నది.

సరుకులను భద్రపరచుకోడానికి, ప్రదర్శించడానికి బీరువాలు, కౌంటర్లు, తూనిక యంత్రాలు, వివరణ పట్టికలు మొదలైన వాటిని ఏర్పరచుకోడానికి ఒక్కొక్క సహకార పరపతి సంఘమునకు రు. 5000/-లు 3/4 వంతు అప్పుగాను 1/4 వంతు సబ్సిడీగాను N C D C ఆర్థిక సహాయము చేస్తున్నది.

## కేంద్ర సహకార బ్యాంకుకు/సహకార సంఘముల రిజిష్ట్రారుకు ప్రాథమిక సంఘములు సమర్పించవలసిన నివేదికలు (Statements and Returns to be submitted)

రిజిష్ట్రారు నిర్దేశించిన పద్ధతిలో జూన్ 30 వ తేదీతో అంతమగు ప్రతి సహకార సంవత్సరమునకు ప్రాథమిక పరపతి సంఘము జమాఖర్చుల Statement, లాభనష్టముల Statement, ఆస్తి అప్పుల Statement మరికొన్ని యితర వివరములతో కూడిన సాలుసరి నివేదిక (Annual statement) ను రిజిష్ట్రారుకు, కేంద్ర సహకార బ్యాంకుకు

పంపవలెను. Audit Report వచ్చిన తర్వాత Audit లోపములను సవరించి సవరణ నివేదికను బ్యాంకునకు/రిజిష్ట్రారుకు పంపవలెను. సంఘ సభ్యుల ఆస్థి అప్పుల Statement ను ప్రతీ సంవత్సరము తయారుచేసి గ్రామాధికారుల సంతకము పొంది పాలకవర్గముచే ధృవీకరింపబడి మహా జనసభచే ఆమోదింపబడి బ్యాంకునకు పంపవలెను. బ్యాంకునకు ప్రతినెలా సంఘపు ఆర్థిక ప్రగతిని తెలుపు నివేదిక (Monthly Progress Report) నుపంపవలెను. రిజిష్ట్రారు / బ్యాంకు అప్పుడప్పుడూ కోరు ఇతర నివేదికలను, వివరములను, సంఘము సమర్పించవలయును.

## సంక్షిప్త సమీక్ష

గ్రామస్థాయిలో సంస్థాగతమైన పరపతిని అందజేయుటలో ప్రాథమిక వ్యవసాయ పరపతి సంస్థలు ప్రముఖపాత్ర వహించుచున్నవి. వ్యవసాయ మదుపులకు స్వల్పకాలిక ఋణములు పంటవారీ ఋణపథకము ననుసరించి యిచ్చుచున్నవి. వ్యవసాయ తరుణంలో సరిపడు పరిమాణములో ధనరూపములోను వస్తురూపములోనూ అప్పులను యిచ్చి పంట చేతికి రాగానే పంట అమ్మకములనుండి అప్పులను వసూలు చేయుచున్నవి. నిధులకోసం ఎక్కువగా కేంద్రసహకార బ్యాంకులమీద ఆధారపడుచున్నవి. కొన్నిచోట్లవాణిజ్య బ్యాంకులు కూడా ఈసంస్థలకు పరపతి సహాయం చేస్తున్నవి ఈ సంస్థలు ప్రజలలో పొదుపును ప్రోత్సహించి మిగులు ధనమును డిపాజిట్ల రూపములో సేకరించవలసిన అవసరమున్నది. ఈ విధముగా తమ ఆర్థిక వనరులను పటిష్ఠ పరచుకొనుటకు సంఘములు ఇంకనూ ఎక్కువ కృషి చేయవలయును,

సభ్యులు అధిక వ్యవసాయోత్పత్తిని సాధించుటలో తోడ్పడుటకు మంచి విత్తనములు ఎరువులు, క్రిమినాశక మందులు ఆధునిక వ్యవసా

# ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘములు నిర్వర్తించ వలసిన కార్యక్రమములు
## (Functions of Primary Agricultural Co-op. Credit Societies)

**1. ఆర్థిక సేవలు**

a) పరపతి సౌకర్యాలు (కాలమాన పు పంటరుణాలు, వినిమయ పరపతి, స్వయంఉపాధికల్పనకు, వ్యవసాయ అనుబంధవృత్తులను చేపట్టడానికి మధ్యకాలికఋణములు)

b) డిపాజిట్లను అంగీకరించుట.

**2. ఉత్పాదక సేవలు (సరఫరాలు)**

a) అధిక దిగుబడి విత్తనములు

b) ఎరువులు

c) క్రిమినాశక మందులు

d) ఆధునిక వ్యవసాయ యంత్రాలు, పరికరాలు

e) పశువుల, కోళ్ల దాణా

f) వ్యవసాయ సాంకేతిక సలహా

g) చిన్నతరహా సేద్యపునీటి సరఫరా పథకములు

**3. మార్కెటింగు సేవలు**

a) రవాణా

b) గ్రేడింగు

c) గోదాములు

d) పంటహామీ అప్పు

e) ఆహారధాన్యాల ప్రక్రియ (PROCESSING)

f) పంటలకు లాభసాటిధర

**4. వినిమయ సేవలు**

a) నిత్యజీవితావసర వస్తువులసరఫరా

b) గృహ నిర్మాణ వస్తువులసరఫరా

**5. సంక్షేమ సేవలు**

a) సహకార విద్య, శిక్షణ

b) విద్య, వైద్య, కుటుంబ సంక్షేమ పథకములు

సహాయ సహకారములతో సభ్యులకు వ్యవసాయ సాంకేతిక సలహాలను అందించుటకు ఎక్కువ కృషి చేయవలసివున్నది. నిత్య జీవితావసర వస్తువుల పంపిణీకూడా చేపట్టినవి 1977 నుండి ఉత్పాదక పరపతితో పాటు వినిమయ పరపతినికూడా సభ్యులకు అందచేయుచున్నవి. కొన్ని సంఘములు సభ్యుల ఉపయోగార్థమై 1976 నుండి "రివాల్వింగ్ క్రెడిట్" పద్ధతిలో అప్పుల నిచ్చుచున్నవి కొన్ని సంఘములు గిడ్డంగి సౌకర్యములు ప్రోసెసింగు యంత్రములు ట్రాక్టర్లు కలిగియున్నవి. కొన్ని సంఘములు ఫుడ్-కార్పొరేషన్, మార్కెటింగు ఫెడరేషన్ ఏజంటుగా సభ్యుల పంటలను కొనుగోలు చేయుచున్నవి

సభ్యులు తమ ఆదాయ అవకాశాలను పెంపు చేసుకొనుటకు మధ్యకాలిక ఋణాలనుకూడా మంజూరు చేస్తున్నాయి. ఆయిలు ఇంజన్లు కొనుటకు, బావులు త్రవ్వకొనుటకు, మరమ్మత్తు చేయించుకొనుటకు, ఎడ్లు బండ్లు కొనుగోలుకు వ్యవసాయ అనుబంధ వృత్తులను చేపట్టుటకు మధ్యకాలిక ఋణములు తోడ్పడుతున్నాయి. సన్నకారు రైతులు పేద రైతులు వ్యవసాయ కూలీలు. చేతివృత్తులవారు స్వయం ఉపాధి కల్పనకు వ్యవసాయ అనుబంధ వృత్తులను చేపట్టుటకు మధ్యకాలిక ఋణములను మంజూరు చేయుటవలన వారు స్వయంపోషకముగా జీవించుటకు ఈ సంఘములు మంచిసేవ చేస్తున్నాయి. సంఘములు తాము ఇచ్చు అప్పులలో 75% అప్పులను బలహీనవర్గపు సభ్యులకు అందజేయుటకు కృషి చేస్తున్నాయి.

అందుబాటులో నున్న వివరముల ప్రకారం 30-6-80 నాటికి ఆంధ్రప్రదేశ్‌లోని ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘముల సంఖ్య (రైతు సేవా సహకార సంఘములతో సహా) 7087. సంఘ సభ్యుల సంఖ్య 52,62,000. చెల్లించిన వాటాధనము రూ. 27-28 కోట్లు 1979-80లో యిచ్చిన అప్పులు రు. 108-74 కోట్లు, నిల్వ ఉన్న అప్పులు రూ. 169-24 కోట్లు. బకాయిలు రు. 70-37 కోట్లు (42 శాతము) వ్యాపార ధనం రు. 222-40 కోట్లు,

# 8 పంటవారీ ఋణ విధానము

## ( Crop Loan System )

### Production Oriented System of lending for Agriculture

### ఉత్పత్తి ప్రాతిపదికపై వ్యవసాయ ఋణములు

### S.A.O. Loans (Loans for Seasonal Agricultural Operations)

### కాలమానపు వ్యవసాయ ఋణములు

పూర్వ పరపతి విధానములో పరపతిని ఉత్పత్తి అవసరముల ప్రాతిపదికపై గాక భూస్థోమతపై ఆధారపడి ఇచ్చుటచే పెద్ద రైతులు మాత్రమే ఎక్కువ వ్యవసాయ పరపతి సౌకర్యములను పొందుట జరిగినది, ఈ పరపతి వ్యవసాయ తరుణముతో సంబంధము లేకుండా సంవత్సరం పొడుగునా యిచ్చుటచే తీసుకున్న పరపతి వ్యవసాయోత్పత్తికిగాక యితర విధముగా దుర్వినియోగము చేయుటకు అవకాశమేర్పడినది. ఈ లోపములను సవరించుటకు, అధికోత్పత్తిని సాధించుటలో తోడ్పడుటకు 1983 ఖరీఫ్ సీజన్ నుండి పంటవారి ఋణవిధానము అమలులో పెట్టబడినది. ఈ పద్ధతి నందలి ముఖ్యమైన అంశములు.

1. అధిక వ్యవసాయోత్పత్తి సాధించుటకు వీలుగా సకాలములో వ్యవసాయ తరుణములో సరిపడు అప్పుని (timely and adequate Credit) యిచ్చుట.

2. పంట దిగుబడి ననుసరించి ఋణ తీర్మానపు శక్తిని నిర్ణయించి; పంటవారీగా ఒక ఎకరమునకు కావలసిన పెట్టుబడి అవసరములను పరిశీలించి ఇవ్వదగు అప్పు మొత్తమును నిర్ణయించుట.

3. అప్పును కొంత నగదు రూపములోను, కొంత వస్తు రూపములోను యిచ్చుట. అప్పును వస్తురూపములలో అనగా ఎరువులు, క్రిమి సంహారక మందులు, విత్తనముల రూపములో యిచ్చుటవలన సంఘములు తమ సభ్యులు అధికోత్పత్తిని సాధించుటకు తోడ్పడుచున్నవి.

4. వ్యవసాయ పరపతిని మార్కెటింగ్‌తో సమన్వయ పరచుట-

అప్పు తీసుకున్న సభ్యులు తమ పంటలను సంఘముద్వారాగాని. సంఘము సభ్యత్వము కల్గియున్న మార్కెటింగ్ సంఘముద్వారాగాని విక్రయించుటకు వ్రాత పూర్వకముగా అంగీకరింతురు. పంట తరుణములో సభ్యుల పంట అమ్మకముల మొత్తముల నుండి ఋణములను వసూలు చేయుట వలన బకాయిలు ఉండవు.

## పరపతి పరిమితులు
## (Scales of Finance)

ప్రతి జిల్లా కేంద్రసహకార బ్యాంకు పంటవారీ ఋణపరిమితులను (Scales of Finance) సూచించుటకు సాంకేతిక వర్గమును (Technical Group) సాధారణముగా నవంబరు నెలలో సమావేశపరుచును. ఈ సాంకేతిక వర్గములో వ్యవసాయ, సహకార శాఖల నుండి అధికారులు, కేంద్రి సహకార బ్యాంకుల పాలకవర్గ సభ్యులు. ఉద్యోగులు. ఎంపిక చేయబడిన ప్రాథమిక సహకార పరపతి సంఘముల ప్రతినిధులు. ఆ ప్రాంతము నందలి ఉత్తమ/ఆధునిక కర్షకులు ఉందురు. సాంకేతిక వర్గము. పంటవారీగా ఎకరమునకు కావలసిన ఉత్తి అవసరములను నగదు రూపములోనూ (A-Component -Cash) వస్తురూపములోనూ (B-Component-kind) అంచనావేసి, యివ్వదగు పరపతి పరిమితులను సిఫారసు చేయుదురు, నీటి వనరులున్న భూములకు, నీటివనరులు లేని భూములకు వేరు వేరు పరపతి పరిమాణములు నిర్ణయించబడును. ఆ ప్రాంతములో అధిక సంఖ్యాకులైన రైతాంగము ఎరువులు క్రిమినాశక మందులు వాడడములో ఏ పరిమితి నవలంబిస్తారో ఆ పరిమితి ప్రకారమున్నూ వాటి మార్కెట్ ధరలను బట్టి 'B' Component ను (వస్తురూపములో యిచ్చుఅప్పును) నిర్ణయించాలి. ఈ సాంకేతిక

వర్గము వివిధ పంటలకు అప్పు యిచ్చుటకు, వ్యవసాయ తరుణాన్ని, తిరిగి అప్పులను వసూలు చేయుటకు పంటల తరుణాన్ని దృష్టిలో పెట్టుకొని వాయిదా తేదీలను సూచించును.

ఈ సాంకేతిక వర్గము మధ్యకాలిక అప్పుల విషయములో కూడా వివిధ కార్యక్రమములకు ఎంత అప్పు అవసరమగునది సూచించును. సాంప్రదాయ పద్ధతిలో సేద్యము చేయగావచ్చు ఫలసాయపు విలువలో 15% మధ్యకాలిక ఋణతీర్మానపు శక్తిగా నిర్ణయింతురు. అయితే మధ్య కాలిక అప్పు, ఉత్పాదకశక్తిని పెంచడానికి ఉద్దేశింపబడినదయితే ఋణము పొందుటకు అర్హతను, ఋణతీర్మానపు శక్తిని నిర్ణయించుటకు క్రొత్త పెట్టుబడి వలన ఏర్పడిన అదనపు ఆదాయాన్ని (incremental income) లెక్కలోకి తీసికోవాలి. ఒకానొక విధమైన పెట్టుబడివల్ల వృద్ధిపొందే ఆదాయం అతడు తీసుకున్న అప్పును మూడు సం॥లు మొదలు అయిదు సం॥లలో తీర్చగల శక్తి నిచ్చేదిగావుంటే మధ్యకాలిక అప్పు యివ్వవచ్చును. అలాకాక పెట్టుబడివలన వృద్ధిపొందే ఆదాయం 5 సం॥లలో తీర్చలేనిదై వుంటే సభ్యునకు దీర్ఘకాలిక అప్పు తీసుకొనుటకు సలహానివ్వాలి.

సాంకేతికవర్గ సమావేశానంతరము జిల్లా కేంద్ర సహకార బ్యాంకు తన స్వంత ఆర్థిక వనరులను, రాష్ట్ర సహకార బ్యాంకు నుండి లభించు ఋణములను దృష్టిలో నుంచుకొని బ్యాంకు విస్తీర్ణములోని భూమి విస్తీర్ణమును, అందు పండు వివిధ పంటలను దృష్టిలో నుంచుకొని తాను ఖరీఫ్ మరియు రబీ పంటలకు ఎకరమునకు పంటవారీగా ఎంత అప్పును మంజూరు చేయగలదో అందు నగదు రూపములో ఎంత యిచ్చునదీ, వస్తురూపములో ఎంత యిచ్చునది (Scales of Finance) పరపతి పరిమితులను నిర్ణయించును.

## సభ్యుల / సంఘపు పరపతి పరిమితి ధరఖాస్తు
## (Credit limit statement)

కేంద్రి సహకార బ్యాంకు నిర్ణయించిన (Scales of finance) పరపతి పరిమితులను అన్ని ప్రాథమిక సహకార పరపతి సంఘములకు తెలియపర్చును. బ్యాంకు నుండి ఈ వివరములు అందిన వెంటనే పరపతి సంఘములు, తమ సభ్యులకు ఈ వివరములు తెలియునట్లు వీటికి ఎక్కువ ప్రచారము యివ్వవలయును. దీనివలన సహకార సంఘముల సభ్యులు తమ వ్యవసాయ కార్యకలాపములకు తాము ఏమాత్రము స్వల్పకాలిక, మధ్యకాలిక ఋణములు ఎప్పుడు పొందగలరో తెలుసుకొందురు.

అయితే, పరపతి పరిమితి స్టేటుమెంటును సకాలంలో త్వరితంగా తయారు చేయుటకు వీలుగా ముందుగా సంఘములు, సభ్యుల సేద్యపు భూముల వివరములు తెలుపు రిజిష్టరు (Members Land cultivation Register) ను తయారుచేసి వుంచుకొనవలెను. ఈ రిజిష్టరులోని వివరములు గ్రామ రెవిన్యూ రికార్డులతో సరిచూడవలెను.

సభ్యుల సేద్యపు భూముల రిజిష్టరు మరియు కేంద్ర సహకార బ్యాంకు పరపతి పరిమితుల (Scales of Finance) ఆధారముగా సంఘము తన సభ్యులతో సంప్రదించి పరపతి పరిమితి స్టేటుమెంటును (Credit limit Statement) నిర్ణీత ఫారములో 4 కాపీలు తయారు చేయుదురు. సభ్యునికి ఎంత విస్తీర్ణము భూమికలదో, అతను రాబోయే సంవత్సరములో రెండు సీజనులలో ఎంతభూమిని ఏయే పంటల క్రింద నిజముగా సాగుచేయునో తెలుసుకొని సభ్యుని సంతకమునకై ఏర్పడి యున్న స్థలములో అతని సంతకము తీసుకొనబడి పరపతి పరిమితి స్టేటు మెంటు తయారు చేయబడును. పరపతి పరిమితి స్టేటుమెంటు సంఘ సభ్యుల యొక్కయూ పరపతి సంఘము యొక్కయూ అప్పు ధరఖాస్తు

గ వర్తించును.

పరపతి పరిమితి స్టేట్ మెంటును 2 భాగములుగా తయారు చేయవలెను. మొదటి భాగము సన్నకారు రైతులకు, యితర బలహీన వర్గములవారికి. రెండవభాగము మిగతా సభ్యులకు తయారుచేయవలెను. సాధ్యమైనంతవరకు సభ్యులందరుకూ ఖరీఫ్ మరియు రబీ పంటలకు ఒకే సారి పరపతి పరిమితి స్టేట్ మెంటును తయారు చేయవలెను.

ఈ విధముగా పరపతి పరిమితి స్టేటుమెంటు తయారుచేసిన పిదప, పరపతి సంఘముయొక్క పాలకవర్గము వారు వాటిని పరిశీలించి, చర్చించి ప్రతి సభ్యునికి ఎంతపరపతి, ఖరీఫ్, రబీ పంటలకు మంజూరు చేయవలసినది నిర్ణయించి, కేంద్ర సహకార బ్యాంకుకు సిఫారసు చేయుదురు. ఖరీఫ్, రబీ పంటల కాలమునకు సంఘమునకు కావలసిన మొత్తము ఋణ పరిమితిని మంజూరు చేయవలసినదిగా బ్యాంకువారిని కోరుతూ ఒక తీర్మానము చేయుదురు. సంఘ ఋణ పరిమితి-సంఘ గరిష్ట ఋణాధికారమునకు, కేంద్ర సహకార బ్యాంకు నుండి ఋణము పొందుటకుగల నియమ నిబంధనలకులోబడి యుండును. సంఘ పాలకవర్గముచే ఆమోదింపబడిన పరపతి పరిమితి స్టేటుమెంటు, సంఘ ఆర్థిక వివరములతో సాధారణముగా జనవరి నెలాఖరులోగా కేంద్ర సహకార బ్యాంకుకు పంపబడును.

కేంద్ర సహకార బ్యాంకులో బ్యాంకు అధికారులచే సంఘము యొక్క పరపతి పరిమితి స్టేటుమెంటు పరిశీలింపబడును. తరువాత బ్యాంకు పాలకవర్గము సంఘమునకు ఖరీఫ్ సీజనుకు రబీ సీజనుకు వేరు వేరుగా పరపతి పరిమితిని మంజూరు చేయుదురు. మంజూరు కాబడిన ఉత్తరువు, - పరపతిపరిమితి స్టేటుమెంటు కాపీతో, ఒకటి బ్యాంకు బ్రాంచికి (పరపతి పంపిణీకి); ఒకటి మార్కెటు సంఘమునకు (ఎరువుల పంపిణీకి); ఒకటి సహకార పరపతి సంఘమునకు పంపబడును.

పరపతి మంజూరు ఉత్తర్వు అందిన వెంటనే సంఘము తరపున అధ్యక్షుడు, మరి యిద్దరు పంచాయతీదారులు కలిసి ఒక ప్రోనోటును ఖరీఫ్ సీజనుకు బ్యాంకు యిచ్చు మొత్తము రుణమునకు (నగదు, వస్తు రూపములలో యిచ్చు మొత్తమునకు) కేంద్ర సహకార బ్యాంకుకు వ్రాయుదురు. అదేవిధముగా రబీ సీజనుకుముందు రబీ సీజనులో యిచ్చు అప్పు మొత్తమునకు వేరే ప్రోనోటు వ్రాయుదురు.

(Application For Drawal Against Limit Sanctioned)

మంజూరు కాబడిన పరపతి పరిమితి నుండి అప్పు తీసుకొనుటకు దరఖాస్తు (బకాయి లేని సభ్యులకు మాత్రమే) మూడు కాపీలను సంఘము తయారుచేసి పాలకవర్గమువారి తీర్మానంతో (బ్యాంకు సూపర్ వైజరుద్వారా) బ్యాంకుకు పంపబడవలెను. సంఘము తరపున సాధారణముగా బ్యాంకు అధ్యక్షుడు నగదు రూపములో యిచ్చు పరపతి తీసుకొని వచ్చి సంఘములో జమచేసి, సభ్యుల కందజేయుదురు, చెక్కుల పద్ధతిలో అప్పును పంపిణీచేయు ఏర్పాటు ఉన్నయెడల ఆవిధముగా చెక్కులు సభ్యుల కందజేయబడును. అప్పులోని వస్తు భాగము Fertiliser Loan Pay-Order ద్వారా సభ్యుల కివ్వబడును. బ్యాంకు నుండి తెచ్చిన మొత్తమునకు ప్రెసిడెంటు మరి యిద్దరి పంచాయితీదారుల సంతకంతో సంఘముయొక్క అచ్చు రశీదు: మరియు సభ్యులకు పంపణీ చేసిన రుణ వివరములతో అప్పుబట్వాడా స్టేటుమెంటు బ్యాంకుకు పంపవలెను, బట్వాడా స్టేటుమెంటు నకలు ఒకటి సంఘములో ఉంచవలెను, బ్యాంకు సూపర్ వైజరుకూడా అప్పు సక్రమ పంపిణీకి సంబంధించిన నివేదికను (Loan Verification Report) బ్యాంకునకు పంపును

పై విధంగానే మధ్యకాలిక రుణములకు కూడా దరఖాస్తు తయారు చేయవలయును,

# రివాల్వింగ్ క్రెడిట్

## (నిరంతర పరపతి పథకము)

## Revolving Credit

ప్రతి రైతుకు, సంవత్సరములో అతను అమ్మే పంటల విలువ ఆధారంగా యిచ్చే క్యాషు క్రెడిట్ (Cash Credit) సౌకర్యాన్ని రివాల్వింగ్ క్రెడిటు అంటారు. 1975వ సంవత్సరము నుండి ఈ నూతన అప్పు విధానము ఎంపిక చేయబడిన కొన్ని గ్రామీణ సహకార బ్యాంకులలోనూ, విశాల సహకార సంఘములలోను ప్రయోగాత్మకముగ ప్రవేశ పెట్టినారు.

సహకార సంఘములో సభ్యుడిగా ఉండి స్వంత భూమికలిగి స్వంత వ్యవసాయం చేస్తూ రెండు లేక అంతకంటే ఎక్కువ పంటలు పండిస్తున్న ప్రతిరైతూ రివాల్వింగ్ క్రెడిట్ పథకములో చేరవచ్చును. అలాచేరిన ప్రతిరైతుకూ దగ్గరలో నున్న కేంద్ర సహకార బ్యాంకు బ్రాంచిలో ప్రత్యేకంగా ఒక కరెంటు అకౌంటు (Current Account) తెరచి పాసు పుస్తకము యిస్తారు.

రైతు తాను అమ్మిన పంట మొత్తము సొమ్మును తు. చ. తప్పకుండా బ్యాంకులో తన రివాల్వింగ్ క్రెడిట్ అకౌంటుకు జమచేయాలి. పంట అనగా భూమిమీద పండించిన పైరులే గాక నిత్యము అమ్మే వ్యవసాయ అనుబంధ ఉత్పత్తులు. ఉదాహరణకు పాలు, గ్రుడ్లు మొదలైనవి కూడా పంటగానే గుర్తింపబడతాయి. రైతు తన పంటను తన యిష్టము వచ్చిన వారికి, యిష్టమైనప్పుడు, తన యిష్టము వచ్చిన ధరకు అమ్ముకొనవచ్చును. అయితే అటుల అమ్మగా వచ్చిన సొమ్మును మాత్రము సరాసరి బ్యాంకులో తన అకౌంటుకు జమచేయాలి. సంవత్సరం మొత్తము మీద ఒక రైతు ఎంత విలువగల పంట అమ్మకాలను బ్యాంకులో జమ

చేస్తాడో ఆ మొత్తము మరుసటి సంవత్సరమునకు అతని క్రెడిటు లిమిటును నిర్ణయిస్తుంది. అయితే సహజముగా ప్రతి సంవత్సరము పంటల దిగుబడిలోనూ, ధరలలోను హెచ్చుతగ్గులు ఉంటాయి కనుక క్రెడిట్ లిమిటును నిర్ణయించడానికి రెండు సంవత్సరాల సగటు అమ్మకములను పరిగణనలోనికి తీసుకుంటారు. అయితే ఏ రైతుకు కూడా రు. 10,000 లకు మించిన క్యాషు క్రెడిట్ యివ్వరు. ఈ పద్ధతి ప్రవేశపెట్టిన మొదటి సంవత్సరములో సంఘములో సభ్యునికి మంజూరు కాబడిన పంటవారి అప్పుపరిమితులు (Crop loan Credit limits) రివాల్వింగ్ క్రెడిట్ లిమిట్లుగా మంజూరు చేస్తారు. రైతులు తమ వాస్తవమైన అమ్మకాలు మాత్రమే అకౌంటుకు జమచేసేలాగున, ప్రతి బ్యాంకు ఆ ప్రాంతపు అవసరములను బట్టి కొన్ని ప్రత్యేక నిబంధనలు పెడుతుంది. వీటిని రైతులు తెలుసుకొనవలెను.

రివాల్వింగ్ క్రెడిట్ కరెంటు అకౌంటుమీద రైతుకు యిచ్చే Running Cash Credit. మంజూరైన అప్పు మొత్తమునకు మించకుండా అకౌంటు నుండి సొమ్ము ఎన్నిసార్లయినను తీసుకొనవచ్చును. అయితే దీనిలో చేరే ప్రతిరైతు సంవత్సరం మొత్తం మీద ఎప్పుడైనా సరే ఒక్క వారం రోజులు మాత్రం బ్యాంకుకు అప్పులేకుండా ఉండాలి, తనకియిచ్చే క్రెడిట్ లిమిటుకు సెక్యూరిటీగా తన స్వంత భూమిమీద సొసైటీకి ఛార్జి సంక్రమింప చేయాలి. తీసుకొను అప్పులో కొంత భాగము ఎరువులు వగైరా కొనుగోలుకు వినియోగించాలి.

రైతు అప్పుడప్పుడు తీసుకొను మొత్తానికి ఎంత వడ్డీ రేటు వసూలు చేస్తారో అంతకు రెండు శాతం (2%) తక్కువగా రైతుయొక్క నిల్వ సొమ్ముపై బ్యాంకు వడ్డీ చెల్లిస్తుంది, కరెంటు అకౌంటుకు రివాల్వింగ్ క్రెడిటు అకౌంటుకు యిది ముఖ్యమైన భేదము. దీనివలన రైతు తన దగ్గర డబ్బు నిల్వ ఉంచుకొనకుండా బ్యాంకులో జమచేసి లాభము

పొందవచ్చును. అయితే యీ కాతాలోని నిల్వలమీద యింత వడ్డీ వచ్చే సౌకర్యం ప్రతి రైతుకు రూ. 10,000 వరకు మాత్రమే వర్తిస్తుంది. యింతకు మించిన సొమ్ము (Credit Balance) మీద బ్యాంకు ఎటువంటి వడ్డీ ఇవ్వదు.

రివాల్వింగు క్రెడిటు లిమిటు పథకంలో చేరిన సభ్యుడు పొదుపు డిపాజిట్టును చెల్లించ నవసరములేదు. మంజూరైన పరపతి పరిమితిలో 10వ వంతు మాత్రము వాటా ధనంగా చెల్లించాలి.



# 9 బకాయిలు - నివారణ చర్యలు

## Overdues-Remedial measures

ప్రాథమిక పరపతి సంఘముల నుండి తమకు రావలసిన వాయిదా మీరని ఋణ మొత్తములు మేరకు మాత్రమే కేంద్ర సహకార బ్యాంకులు, NABARD తమకు మంజూరు చేసిన ఋణపరిమితుల నుండి అప్పు తీసుకొనుటకు అర్హత కల్గియున్నవి. NABARD ఋణములన్నియు. కేంద్ర సహకార బ్యాంకుకు రావలసిన వాయిదామీరని ఋణముల రూపములో భద్రమై ఉండవలయును. రిజర్వు బ్యాంకు. తన నుండి కేంద్ర సహకార బ్యాంకులు అప్పు పొందవలెనన్న గత సంవత్సరము మొదటి పంటకాలపు చివరినాటికి ఉన్న గరిష్ఠ ఋణ నిల్వలను 40% మొత్తమునకు తగ్గించవలెనని, అట్లు తగ్గించేవరకు ఖరీఫ్ కు మంజూరైన ఋణ పరిమితినుండి విడుదల లభించదని 1974-75 నుండి ఆంక్ష విధించినది. తీసుకున్న షరతులకు లోబడి ఋణమును సకాలములో తీర్చకున్న NABARD కేంద్రసహకార బ్యాంకులకు అప్పునివ్వదు, తిరిగి కేంద్ర సహకార బ్యాంకు ప్రాథమిక పరపతి సంఘములకు పరపతి సౌకర్యం కల్గించలేదు. పరపతి సంఘములు సభ్యులకు ఋణములను మంజూరు చేయలేవు. ప్రాథమిక పరపతి సంఘములలోని సభ్యులకు పరపతి, సకాలములో నిరాటంకముగా అందవలెనన్న ఈ సంఘములు అప్పుల వసూళ్ళలో ఎక్కువశ్రద్ధ తీసుకొని కేంద్ర సహకార బ్యాంకు ఋణములను సకాలములో తీర్చవలెను. ప్రకృతి వైపరీత్యముల వలన సభ్యులు అప్పులు సకాలములో చెల్లించలేని పరిస్థితులలో ఉంటే కేంద్ర సహకార బ్యాంకు వారి అనుమతితో స్వల్పకాలిక ఋణములను మధ్యకాలిక ఋణములుగా మార్చి, తిరిగి వ్యవసాయ మదుపులకు ఋణమును మంజూరు చేయవచ్చును. సహకార పరపతి సంస్థలలోని బకాయిదారులకు. వారి జామీనుదారులకు. బకాయి తీర్చువరకూ వారికి యితర పరపతి సంస్థలు, ఎటువంటి ఆర్థిక సహాయము చేయరాదని 1978లో రిజర్వు బ్యాంకు.

రాష్ట్రీ సహకార సంఘముల రిజిస్ట్రారు సూచన లిచ్చిరి తగు కారణము లేక బకాయిపడిన సభ్యులపై చట్టప్రకారము కఠిన చర్యను తీసికొనవలయును. అలా చేయనిపక్షంలో వాయిదా మీరిన రుణముల కారణంగా సంఘమును ఎత్తివేయవలసిన పరిస్థితి రావచ్చును.

కఠినచర్యను తీసుకొనుటకు ముందు సభ్యులకు రుణములను సకాలములో తీర్చవలసిన ఆవశ్యకతను తెలియచెప్పి వసూళ్ళకు తగు కృషి చేయవలయును. అవసరమైతే మహాసభను సమావేశపరచి సంఘ ఆర్థిక పరిస్థితిని, సంఘము చేస్తున్న కృషిని సభ్యులకు తెలియచెప్పి వసూళ్ళను గురించి తీసికొనవలసిన చర్యను సభ్యులతో సంప్రదించి చర్చించి నిర్ణయించవలెను. తరచు పాలకవర్గ సమావేశములను జరిపి వసూళ్ళ పరిస్థితిని ఎప్పటికప్పుడు సమీక్షించి, తగుచర్యలు తీసుకొనుచుండవలెను.

సభ్యులు తాము తీసుకొన్న రుణములను సంఘమునకు సకాలములో చెల్లించక పోవుటకు లేదా చెల్లించలేక పోవుటకు నిజమైన కారణములను తెలుసుకొని సరిఅయిన పరిష్కార మార్గములు రూపొందించుకొనవలయును. వాయిదా మీరిన రుణములు తగ్గుటకు సంఘము రెండు విధములైన చర్యలు తీసుకొనవచ్చును. మొదటిచర్య-వాయిదా మీరిన ఋణములు ఏర్పడకుండాను (Preventive Measures) ; రెండవది వాయిదా మీరిన ఋణములు ఏర్పడిన తర్వాత వాటి వసూలుకు చట్టరీత్యా తీసుకొనదగు కఠినచర్య (Curative Measures) .

సంఘము సభ్యునకు అప్పు మంజూరు చేయునపుడు ఆ అప్పు సభ్యుని ఆర్థిక పరిస్థితిని పెంపుచేయుటకు తోడ్పడునది లేనిది పరిశీలించవలెను, సభ్యుని సరిఅయిన అవసరములన్నిటికి, పూర్తిగా సరిపడు అప్పును సకాలములో సులభంగా త్వరితంగా అతనికి లాభము చేకూరునట్లు యిచ్చుటకు సంఘము కృషి చేయవలయును. అప్పు సక్రమ వినియోగ

ముపై తగు పర్యవేక్షణ సలహా ఉండవలయును, సభ్యుడు అప్పును దుర్వినియోగము చేసిన, వాయిదా తేదీతో నిమిత్తం లేకుండా వెంటనే చట్టరీత్యా తగుచర్య తీసుకొని ఋణమును వసూలు చేయవలయును. సంఘం యొక్క ఋణవిధానము సభ్యుని ఆర్థిక పరిస్థితిని మెరుగు పరిచేదిగా ఉంటే, సభ్యునకు తనకువచ్చిన ఆదాయమునుండి రుణము తీర్చుట కష్టముకాదు: రుణవిధానములో ఏమైన లోపాలుంటే వాటిని సరి చేయుటకు కృషి చేయవలయును. వాయిదా మీరిన రుణములపై ఎక్కువ అపరాధపు వడ్డీని విధించవలెను. లేదా సకాలములో చెల్లించిన రుణములకు వడ్డీలో రిబేట్ యిచ్చు పద్ధతిని ప్రవేశపెట్టవచ్చును. సభ్యులకు ఒక్క పరపతి వందచేయుటయేగాక అతని ఉత్పాదక అవసరములను తీర్చుటకుకూడా సంఘములు కృషి చేయవలయును. మంచి విత్తనములు, ఎరువులు, క్రిమినాశక మందులు, ఆధునిక వ్యవసాయ పరికరములు, వ్యవసాయ సాంకేతిక విజ్ఞానము సభ్యుల కందుబాటులో ఉంచిన ఈ సౌకర్యములవలన సభ్యులు ఎక్కువ లాభం పొందెదరు. నిత్య జీవితావసర వస్తువుల పంపిణీనికూడా సభ్యుల ఉపయోగార్థం చేపట్టవచ్చును. సన్నకారు రైతులు, వ్యవసాయ కూలీలు, వ్యవసాయ అనుబంధ వృత్తులయిన పాడిపరిశ్రమ, కోళ్ళ పెంపకం, గొర్రెల పెంపకం, పందుల పెంపకం, చేపల పెంపకం, తేనె పరిశ్రమ మొదలగునవి చేపట్టుటకు సంఘం వారికి తోడ్పడవలయును. ఈ కార్యక్రమముల వలన వారి ఆదాయములు పెరిగి వారు స్వయంపోషకంగా జీవించుటకు తోడ్పడును. అంతిమంగా సభ్యులు ఆర్థికముగా శక్తివంతులవడం వలననే సహకార పరపతి సంఘములు పటిష్టమవటం జరుగుతుంది, అందుచేత సంఘ సభ్యుల ఉత్పత్తులకు సరి అయిన ధర వచ్చునట్లు విక్రయపు ఏర్పాట్లుకూడా సంఘములు నిర్వహించవచ్చును. సంఘములు కేంద్ర సహకార బ్యాంకులతోను, మార్కెటింగ్ సంఘములతోను, ఇతర సహకార సంస్థలతోను, పంచాయితీ సమితి, జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ మొదలగు యితర

అభివృద్ధి సంస్థలతోనూ, శాఖలతోనూ సత్సంబంధములను పెంచుకొని వారు సంఘమునకు, సంఘ సభ్యులకు సహాయ సహకారము లిచ్చునట్లు కృషి సలుపవలెను. సంఘములు సక్రమంగా పనిచేయుటకు శిక్షణ పొందిన, పూర్తి కాలపు ఉద్యోగులను నియమించవలెను. సంఘములు, సభ్యులు పొదుపుచేయుటకు అనువగు డిపాజిట్టు పథకములను రూపొందించి అమలు పరచవలెను. సభ్యులలో పొదుపు మితవ్యయమును ప్రోత్సహించవలెను. ఈ విధముగా సంఘములు సభ్యుల ఆర్థికాభివృద్ధికి సామర్థ్యముతో పనిచేయుటవలన సంఘములలో వాయిదామీరిన ఋణములు ఏర్పడకుండా నివారించవచ్చును.

వాయిదా మీరిన ఋణములు ఏర్పడకుండా తగుచర్యలు తీసుకొనుటవలననూ ఉద్దేశ పూర్వక బకాయిదారులపై సకాలంలో చట్టరీత్యా కఠినచర్యలు తీసుకొనుటవలననూ, సంఘములలో బకాయిల సమస్య పరిష్కరించవచ్చును.

మనదేశములో సహకార పరపతి సంఘముల స్థాపనకు కారకులైన శ్రీ నికోల్సన్‌గారి మాటలను సహకార సంఘములు, సభ్యులు ఈ సందర్భంలో జ్ఞప్తికి తెచ్చుకొనుట ఉపయోగకరంగా ఉండును.

"Credit is a weapon that may destroy the unskilful wielder; it is helpful or destructive, according as it is used or abused;. –Fredrick Nicholson.

(పరపతి ఆయుధముతో సమానము; దీనిని వినియోగించడంలో నిపుణత లేని వానిని నష్టపరచును. సక్రమంగా వినియోగిస్తే సహాయపడును. దుర్వినియోగము చేస్తే నాశనము చేయును.)

సహకార పరపతి సంఘముల విజయము, జీవనశక్తి, పరపతి

వ్యాపారమును నష్టంరాకుండా ఆరోగ్యప్రదమైన బ్యాంకింగు పద్ధతుల ననుసరించి సమర్థవంతంగా నిర్వహించుటపైననే ఆధారపడి యున్నది. అందుచేత, ఈ కార్యక్రమ నిర్వహణలో అత్యంత నిపుణతను జాగరూకతను సంఘములు ప్రదర్శించవలసి యున్నది. లేనిపక్షంలో ఈ సంఘములు సమాజమునకు సేవచేయలేవు.

## అఖిలభారత గ్రామీణ పరపతి సమీక్షాసంఘపు సిఫార్సులు
## (Recommendations of All India Rural Credit Review Committee)

రిజర్వు బ్యాంకుచే శ్రీ బి. వెంకటప్పయ్య అధ్యక్షతతో నియమింపబడిన అఖిలభారత గ్రామీణ పరపతి సమీక్షా సంఘము (1969) పరపతి సంఘములలో బకాయిలు పెరుగుటకు ఈ క్రింది కారణములు ముఖ్యమైనవని తెలిపిరి.

1. పర్యవేక్షణ లోపము. 2. అప్పులు ఇచ్చుటలో తప్పుడు పద్ధతుల నవలంబించుట 3. పరిపాలనా అసమర్థత, 4. యితర చోట్ల కన్నా సహకార సంఘములు యిచ్చు అప్పులపై తక్కువ వడ్డీ రేటు, 5. వాయిదా మీరిన ఋణములను తట్టుకొనుటకు సంఘములకు స్వంత వనరులు తగినంతగా లేకపోవుట. 6. పంటల నష్టం. 7. రాజకీయ వత్తిడలు, 8 పరపతిని మార్కెటింగుతో సమన్వయపరచక పోవడం.

బకాయిలు పెరగడం సహకార పరపతి ఉద్యమమునకు ఆరోగ్యప్రదమైన లక్షణముకాదు. ఈ పరిస్థితిని చక్కబరుచుటకు తగుచర్యలు వెంటనే తీసుకొనవలసియున్నది. ఈ క్రింది చర్యలు బకాయిలు తగ్గుటకు తోడ్పడునని వారు సిఫారసుచేసిరి.

1. అప్పు యిచ్చేముందు ప్రయోజనమును పరిశీలించవలెను. ఉత్పాదక

పరపతి, సభ్యుని ఆదాయమును పెంచేదిగా వున్న యెడల బకాయి లను తగ్గించును.

2. యిచ్చిన అప్పు సక్రమంగా వినియోగింపబడినది, లేనిది పర్యవేక్షింప వలెను.

3. పరపతిని మార్కెటింగుతో సమన్వయపర్చవలెను.

4 పరపతి పరిమితిని మంజూరు చేయునప్పుడు. సంఘముతో సభ్యునిఖాత లావాదేవీలు సంతృప్తికరంగా ఉన్నది లేనిది పరిశీలించవలెను.

5. సంస్థలను నడుపుటలో శిక్షణ పొందిన దక్షతగల వేతనకార్యదర్శుల సేవలను వినియోగించవలెను.

6. పాలకవర్గ సభ్యులు, బకాయిలు తగ్గుటకు ఎక్కువ కృషి చేయవలెను.

## బకాయిలపై అధ్యయన బృందపు సిఫార్సులు
## Study team on over dues

రిజర్వు బ్యాంకువారు శ్రీ సి. డి. దాతే (Datey) అధ్యక్షతన నియమించిన సహకార పరపతి సంస్థల బకాయిల అధ్యయన బృందము 1974లో తమ రిపోర్టులో సహకార పరపతి వ్యవస్థలో వాయిదా మీరిన బకాయిలు సంస్థలశక్తికి మించి పెరుగుచున్నవని తెలిపిరి. ఇందుకు ముఖ్యకారణము రైతులలో సకాలములో అప్పు తీర్చవలెననే నిశ్చయము క్రమశిక్షణ లోపించుటగా పేర్కొనిరి. సకాలములో సరిపడు వంతగా అప్పులు రైతులకు అందుటలేదనియు. పూర్తికాలపు వేతనకార్యదర్శులు లేకపోవుట, ఉద్దేశ పూర్వక బకాయిదారులపై వెంటనే చట్టరీత్యా తగు చర్య తీసుకొనుటలో పాలకవర్గ వైఫల్యము యితరకారణములుగా పేర్కొనిరి.

బకాయిలను తగ్గించుటకు వారు ఈ క్రింది సిఫార్సులు చేసిరి.

1. a) రిజిష్ట్రారుకు తనంతటతానే బకాయిలను భూమిశిస్తు వసూలు చేయునట్లు వసూలు చేయుటకు ఉత్తర్వులు జారీ చేయుటకు అధికార మీయవలెను.

b) ప్రాథమిక పరపతి సంఘములలోని బకాయిదారులపై చర్య తీసుకొనుటకు కేంద్ర సహకార బ్యాంకులకు అధికార మీయవలెను.

2. దావావేయుట, అమలుపరచుట మొదలగు చర్యలను, పరిస్థితిని ఎప్పటికప్పుడు సమీక్షించవలెను.

3. బకాయిదారులకు ఎన్నికలలో ఓటింగ్ హక్కు లేకుండా చేయవలెను. సంఘములో వాయిదామీరిన ఋణ మొత్తం 70% శాతమునకు మించినయెడల మొత్తము పాలకవర్గము రెండు సంవత్సరముల వరకు తమంతట తామే రద్దు కాబడినట్లు భావింపబడవలెను. ఈ విధముగా సహకార సంస్థల చట్టమును మార్పుచేయవలెను.

4. ప్రభుత్వముచే ధాన్యసేకరణ జరుపబడుతున్న ప్రాంతములలో సభ్యుని పంట 50% మేరకు లేక సంఘమునకు ఇవ్వవలసిన ఋణ మొత్తము మేరకు ఏది తక్కువయితే ఆ మొత్తమును వసూలు చేయుటకు చట్టరీత్యా ఏర్పాటు చేయవలెను.

5. సహకార పరపతి సంఘములలోని బకాయిదారులకు వారి జామీనుదారులకు ఏ విధమైన ఋణములు ఏ పరిస్థితులలోనూ ప్రభుత్వము ఇవ్వకూడదు.

6. ఉద్దేశపూర్వక బకాయిదారులపై చట్టరీత్యా చర్య తీసుకొనుటకు రాష్ట్ర ప్రభుత్వము రెవెన్యూ యంత్రాంగమునుకూడా సహాయకారిగా ఉంచవలెను.

7. అన్ని సంఘములు పూర్తి కాలపు వేతన కార్యదర్శులను నియమించవలెను.

8. ప్రకృతి వైపరీత్యము వలన పంటలు పోయిన పరిస్థితులలో జాతీయ వ్యవసాయ పరపతి స్థిరీకరణ నిధినుండి ఉదారముగా రైతులకు సహాయము చేయవలెను.

9. సహకార పరపతి సంఘములు మరియు కేంద్ర సహకార బ్యాంకులు సభ్యులనుండి వసూలు చేసిన మొత్తములను తిరిగి సభ్యులకు అప్పులు యిచ్చుటకు ఉపయోగించక ఆ మొత్తములను రిజర్వు బ్యాంకుకు ఇవ్వవలసిన రుణమును తీర్చుటకు చెల్లించవలెను. ఎక్కువ వసూళ్ళను చూపించుటకు తప్పుడు పద్ధతులను అవలంబించే ఉద్యోగులను కఠినముగా శిక్షించవలెను.

## బకాయిల వసూలుకు చట్టరీత్యా చర్యలు

ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘములు బకాయిల వసూలుకు ఆంధ్రప్రదేశ్ సహకార సంఘముల చట్టము, నియమావళి ననుసరించి ఈ క్రింది విధముగా చర్యలు తీసుకొనవచ్చును.

1. సెక్షన్ 61 క్రింద బకాయిల వసూలుకు సంబంధించిన వివాదముపై డిక్రీ యివ్వవలసినదిగా కోరుతూ రిజిష్ట్రారుకు దావా దాఖలు చేసుకొనవచ్చును. ఇందుకు సంబంధించి దరఖాస్తు అందిన మీదట సాధారణముగా 6 నెలల లోపల. రిజిష్ట్రారుచే దావా పరిష్కరింపబడి డిక్రీ యివ్వబడును.

2. డిక్రీ అందిన తర్వాత డిక్రీ అమలుకు సె. 70 క్రింద రిజిష్ట్రారుకు దరఖాస్తు చేసుకొనవచ్చును డిక్రీ అమలు సభ్యుని చర. స్థిరాస్థులపై చేయవచ్చును (సె. 85 ననుసరించి సభ్యుని చరాస్థులపై సంఘము

మొదటి ఛార్జి కలిగియున్నది. సె. ౪౪ రూలు ౩౨ ననుసరించి సభ్యుడు అప్పు పొందుటకు హామీగా తన స్థిరాస్తిపై సంఘమునకు ఛార్జి కల్గించును).

౩. సె 71 క్రింద సభ్యులనుండి వసూలు కావలసిన బకాయిలపై చర్య తీసుకొనుటకు సర్టిఫికెట్టు (ధృవపత్రము)ను జారీ చేయవలసినదిగా రిజి స్ట్రారును కోరవచ్చును, ఈ సెక్షన్ క్రింద జారీ చేయబడిన సర్టిఫికెట్టు సభ్యుడి నుండి రావలసిన బకాయికి కడపటి ఋజువుగా వుండును. ఈ సర్టిఫికెట్టు ఆధారముగా, ప్రత్యేకించి దావా చేయవలసిన అవసరం లేకుండా సె. 70 క్రింద బకాయి వసూలుకు అమలు దరఖాస్తును రిజి స్ట్రారుకు దాఖలు చేసుకొనవచ్చును.

4. బకాయి వసూలుకు సంఘమును ఆటంకపరచు ఉద్దేశ్యముతో సభ్యు డు తన చర, స్థిరాస్తులకు వేరే విధముగా బదలీ చేస్తున్నాడని సంఘము నకు తెలిసినట్లయితే, వెంటనే, ఈ వివాదమునకు సంబంధించిన తీర్పునకు ముందుగానే. ఆ సభ్యుని ఆస్తిని జప్తు చేయవలసినదిగా సె. 7౩ క్రింద రిజిస్ట్రారుకు సంఘము దరఖాస్తు చేసుకొనవచ్చును. రిజిస్ట్రారు సంతృప్తి నొందిన. సంఘము కోరినట్లుగా ఆ సభ్యుని ఆస్తిని జప్తు చేయుటకు ఆదేశించును.

౬. బకాయి వసూలు నిమిత్తము సభ్యుని ఆస్తి విక్రయమునకు తేబడి నప్పుడు, వేలములో ఎవరూ పాటదారులు లేకున్న. సెక్షన్ 40 ప్రకా రము సంఘము, సభ్యుని ఆస్థిని కొనుగోలుజేసి తన బకాయికి జమ కట్టు కొన వచ్చును.

౬. సంఘములో సభ్యునికి చెందిన వాటా ధనము, డిపాజిట్లు, డివిడెండు, ౘబేటు మొదలగు మొత్తములపై, అతనిచే సంఘమునకు చెల్లించవలసిన ఋణము లేక యితర మొత్తము విషయములో సె. ౩౩ ననుసరించి

సంఘము ఛార్జి కలిగియున్నది. అందుచేత సభ్యుడు బకాయిదారై నప్పుడు అతనికి చెందిన పై మొత్తములను అతని బకాయికి జమకట్టుట ద్వారా సంఘము సభ్యుని బకాయిని వసూలు చేసుకొనవచ్చును.

## దావా దరఖాస్తు తయారుచేయు విధము

బకాయి చెల్లింపని సభ్యులకు. వారి జామీనుదార్లకు సాధారణ ముగా నోటీసు అందిన 15 రోజులలో వారి బకాయిలను చెల్లించవలసి నదిగా సంఘము రిజిష్టరు నోటీసును (తిరుగు రసీదుతో) జారీ చేయవలెను. నోటీసులో చెప్పిన గడువులోపల వారు బకాయిలు చెల్లింపకున్న, సంఘపాలకవరము బకాయి దారులపైన. వారి జామీను దారులపైన దావా వేయుటకు తీర్మానించవలెను. దావా వేయుటకు దావాఫీజు ప్రభుత్వ ఖజానాలో (098–Co-operation Miscellaneous receipts, arbitration fees ఖాతాకు) సహకార సంఘముల చట్టము రూలు 48లో తెలిపిన రేటు ననుసరించి చెల్లించవలెను. దావా దర ఖాస్తుకు. 1) దావా వేయుటకు పాలకవర్గము చేసిన తీర్మానపు నకలు. 2) సంఘము జారిచేసిన నోటీసు నకలు, 3) రిజిష్టరు నోటీసు తిరుగు రసీదు, 4) దావా ఫీజు చలానా, 5) అప్పుల లెడ్జరులోని సభ్యుని అప్పు ఖాతా నకలు. 6) సభ్యుడు వ్రాసియిచ్చిన అప్పు పత్రము జతపరచ వలెను. దావా దరఖాస్తు కాపీలు ఎందరు ప్రతి వాదులున్నారో (బకాయిదారుడు. జామీనుదారులు) అన్ని కాపీలు, అదనముగా మరి ఒక కాపీ తయారు చేయవలెను.

దావా దరఖాస్తు, తాలూకా సహకార ఆఫీసరు వారి కార్యాల యములో, లేదా. కేంద్రి సహకార బ్యాంకు డిప్యూటీ రిజిష్ట్రారు ఛీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు వారి కార్యాలయములో దాఖలు చేయవచ్చును.

## దావాను పరిష్కరించు విధానము

దావా అందిన వెంటనే, దానిని స్వీకరించిన సహకార అధికారి, దావా దరఖాస్తు సక్రమముగా ఉన్నది లేనిది పరిశీలించి సక్రమముగా ఉన్న వివాదపరిష్కారముల (Arbitration Register) పుస్తకములో నమోదు చేసి దానికి ఒక నెంబరు యిచ్చెదరు. దావాను ఆయనకాని, ఆయనచే అధికారము పొందిన మరియొక అధికారి కాని పరిష్కరించుటకు చర్యలు తీసుకొనును.

దావా విచారణాధికారి సివిలు కోర్టువలె వ్యవహరించును దావా వేసిన సంఘము వాది (Plaintiff) గాను, దావా వేయబడిన సభ్యులు ప్రతివాదులు (Defendants) గానూ వ్యవహరింతురు దావా విచారణాధికారి చేయు ఉత్తర్వు, సివిలు కోర్టు ఉత్తర్వువలె అమలులోకి తేబడును. దావా విచారణాధికారి, దావాకు సంబంధించి వాఙ్మూలము ఇచ్చుటకు తన కోర్టు (కార్యాలయము)లో హాజరు కావలసినదిగా వాది, ప్రతివాదులకు సమనులు యిచ్చును. నిర్ణయింపబడిన రోజున పార్టీలనుండి వాఙ్మూలమును తీసుకొని సంఘ రికార్డులను పరిశీలించి తమ తీర్పును వ్రాయుదురు. దావాను స్వీకరించిన అధికారి తీర్పును లేక డిక్రీ కాపీని, డిక్రీదారు (Decree holder) అయిన సంఘమునకు పంపును, డిక్రీ నిర్ణయమును తీర్పు ఋణగ్రస్తులు (Judgement Debtors) అయిన సభ్యులకు తెలియపర్చును.

## దావా తీర్పు (డిక్రీ) అమలుకు దరఖాస్తు

డిక్రీ అందిన తర్వాత ఆ డిక్రీని అమలుపరచుటకు బకాయిదారులకు చెందిన చరాస్తులపై లేక స్థిరాస్తు , లేదా రెండింటిపైన చర్యతీసుకొనుటకు సంఘ పాలకవర్గము నిర్ణయించవలెను. సహకార సంఘముల చట్టము రూలు 52 క్రింద తెలుపబడిన ఫారము 'డి' నమూనాలో అమలు

ధరఖాస్తును తయారు చేయవలెను, అమలుకు ఫీజు (Govt treasury లో 098–Co-operation. Miscellaneous receipts. Execution fees) ఖాతాకు, చెల్లించి, చలానాను, డిక్రీకాపీని, డిక్రీ దరఖాస్తుకు జతపరచి, దరఖాస్తును తాలూకా సహకార ఆఫీసరు వారి కార్యాలయములో లేదా కేంద్ర సహకార బ్యాంకు D.R. ఛీఫ్ ఎగ్జిక్యూటివు ఆఫీసరు వారి కార్యాలయములోకాని దాఖలు చేయవలెను.

## ఆస్తి జప్తుచేసి అమ్ముట ద్వారా బకాయిలను వసూలు చేయు పద్ధతి

అమలు దరఖాస్తు (Execution Petition) స్వీకరించిన అధికారి దానిని పరిశీలించి సక్రమముగా నున్న Execution Register లో నమోదు జేసుకొని దానికి ఒక నెంబరు యిచ్చెదరు. అమలు చర్య-చరాస్తులపైన అయిన డిమాండు నోటీసు D-2 ఎంతమంది జడ్జిమెంటు బకాయిదారులున్నారో అన్ని కాపీలు మరియు అదనముగా ఒక కాపీ తయారుచేసి తన కార్యాలయపు సీలువేసి, సంతకము చేసి. అమలు ధరఖాస్తుతో ఆస్తులను జప్తువేయుటకు సేల్ ఆఫీసరు (Sale Officer) కు పంపుదురు.

సేల్ ఆఫీసరు. తాను జప్తు అమలుపరచుటకు వెళ్లు తేదీ, సమయము, గ్రామము సూచించుచు ('ఫారము-8'లో) ఒక నోటీసును డిక్రీదారుకు పోష్టు ద్వారా పంపుదురు. జప్తు కాలములో సేల్ ఆఫీసరు గార్కి అవసరమయిన సహాయమును డిక్రీ దారయిన సంఘము చేయవలెను, తాను తెలిపిన రోజున సేల్ ఆఫీసరు డిక్రీదారుతో గ్రామము వెళ్లి డిమాండు నోటీసు (D-2) ను జడ్జిమెంటు బకాయిదారునిపై జారీ చేయును. డిమాండు నోటీసు జారీచేసిన వెంటనే బకాయిదారుడు అందులో తెల్పిన మొత్తమును అనగా డిక్రీ మొత్తము, దానిపై వడ్డీ.

మరియు జప్తు అమలుపై అయిన ఖర్చులు చెల్లించవలెను. అలా చెల్లించని పక్షములో అతని చరాస్తులు జప్తు చేయబడును. జప్తు చేయబడిన వస్తువుల వివరములు. వాటి మదింపులు (Inventory list) ఫారము-4లో పూర్తి చేసి డిక్రీదారుకు. దానికాపీని బకాయిదారుకు ఇవ్వవలయును, జప్తు చేయబడిన వస్తువులను వేలములో అమ్మివేయుటకు సాధారణముగా 15 రోజుల గడువుతో ఒక తేదీని నిర్ణయించి Sale Notice ఫారము-5లో బకాయిదారునకు. తనతో వచ్చిన డిక్రీదారు ప్రతినిధికి అందజేయును. జప్తు చేయబడిన చరాస్తులను డిక్రీదారుకు, లేదా గ్రామాధికారికి స్వాధీనపరచి బాండు (ఫారము-18)లో సంతకం పొందవలయును. ఆయన ఆ ఆస్తులను వేలము నాటికి హాజరు పరచవలయును. నిర్ణీత తేదీనాడు ఆ చరాస్తులు వేలములో అమ్మివేయబడి, వచ్చిన నగదు సంఘ బకాయిలకు జమ కట్టబడి, ఇంకనూ మిగిలిన బకాయిదారుకు చెల్లించబడును.

ఒకవేళ చరాస్తుల విలువ డిక్రీ మొత్తమునకు సరిపోని పక్షమున స్థిరాస్తిని జప్తు చేయవచ్చును, తనఖా లేదా ఛార్జియిచ్చిన ఆస్తులైనచో ఆ ఆస్తులను జప్తు చేయనవసరము లేకుండా అమ్మివేయుటకు ఇవ్వబడు డిమాండు నోటీసు (D-6) లేక వేరే స్థిరాస్తులయిన జప్తుచేసి అమ్మి వేయుటకు డిమాండు నోటీసు (D-7) అమలు ధరఖాస్తు స్వీకరించిన అధికారిచే తయారు చేయబడి అమలు ధరఖాస్తు (E.P.) తో చర్యకు సేలు ఆఫీసరుకు పంపబడును.

సేలు ఆఫీసరు ఇదివరకు చెప్పబడినట్లు డిమాండు నోటీసును బకాయి దారునిపై జారీ చేయును, లేదా స్థిరాస్తి ఉండు స్థలమునందు అతికించవలెను.

అటు తరువాత సేల్ ఆఫీసరు అమలు దరఖాస్తును తిరిగి E P. స్వీకరించిన అధికారి (E.P. entertaining authroity) కి పంపును. ఆయన స్థిరాస్తులను బహిరంగ వేలములో అమ్మి వేయుటకు 30 రోజుల గడువుతో తేదీ, సమయము, స్థలము నిర్ణయించి 'ఫారము-9' ద్వారా స్థిరాస్తి వేలము ప్రకటించెదరు. ఈ నోటీసు నకలు ఆయన కార్యాలయము నందు, మరియు తాలూకా ఆఫీసునందు నోటీసుబోర్డులో ప్రదర్శించబడవలయును. 'ఫారము-9' నమూనాలో డిక్రీదారుకు, జడ్జిమెంటు బకాయిదారుకు పోస్టుద్వారా స్థిరాస్తి వేలము వేయబడు తేదీ సమయం, స్థలము తెలుపబడవలయును. ఆ నిర్ణీత తేదీనాడు స్థిరాస్తులు బహిరంగ వేలములో అమ్మివేయబడి సంఘ బకాయిలకు జమకట్టబడును. వేలములో పాటదారులు రాకున్న సంఘము, పాటలో పాల్గొని ఆస్తులను కొని తన అప్పులకు జమ వేసుకొనవచ్చును. వేలము జరిగిన తేదీ నుండి 30 రోజుల లోపల బకాయిదారుడు సంఘమునకు చెల్లించవలసిన బకాయి, వసూలు ఖర్చులు, పొండేజీ మరియు వేలము మొత్తముమీద 5% కొనుగోలుదారుకు ముదరా చెల్లించిన అమ్మకము రద్దు చేయబడును. అట్లాజరగని పక్షములో, వేలములో ఆస్తులు కొన్నవారికి వేలము జరిగిన 30 రోజుల తర్వాత 'ఫారము-10' నమూనాలో సేలు సర్టిఫికెట్టు జారీ చేయబడును.

## భారతీయ కాలదోషముల చట్టము

## (Indian Limitation Act 1963)

ఆంధ్రప్రదేశ్ సహకార సంఘముల చట్టము 1964, సెక్షన్ - 61 మరియు రూలు 49 క్రింద రిజిస్ట్రారు సివిలు కోర్టుగా భావింపబడును, ఆయనకు బకాయిలు, వివాదములను దాఖలు చేసుకొనుటకు భారతీయ కాలదోషముల చట్టమునందలి నిబంధనలు ఈ క్రింది విధముగ వర్తించును.

| విషయము | కాల పరిమితి |
| --- | --- |
| 1) అడిగిన వెంటనే చెల్లింపదగు అప్పు పత్రము (ప్రామిసరీనోటు) | అప్పుపత్రము వ్రాయబడిన తేదీ నుండి 3 సంవత్సరములు |
| 2) నిర్ణీత గడువులకు చెల్లింపదగు అప్పు పత్రము | చెల్లింపదగు తేదీ నుండి 3 సంవత్సరములు |
| 3) వాయిదాలలో చెల్లింపదగు అప్పు పత్రము | ప్రతి వాయిదాకు. అది చెల్లింపవలసిన తేదీ నుండి 3 సం॥లు |
| 4) రిజిష్టరు చేయబడిన తాకట్టు పత్రము | సొమ్ము చెల్లింపదగు తేదీ నుండి 12 సం॥లు |
| 5) డిక్రీ అమలుకు | డిక్రీ యివ్వబడిన తేదీ నుండి 12 సం॥లు |
| 6) ప్రధాన ఋణగ్రహీతపై జామీనుదారుడు దావా వేయుటకు | ఋణదాతకు ఋణగ్రహీత చెల్లించవలసిన అప్పును జామీనుదారు చెల్లించిన తేదీ నుండి 3 సం॥లు |
| 7) అమ్మకమును రద్దు చేయుటకు దరఖాస్తు | అమ్మకము జరిగిన తేదీ నుండి 30 రోజులు |
| 8) అమ్మకములో కొనుగోలు చేసిన స్థిరాస్థిని స్వాధీనపరచుటకు | అమ్మకము స్థిరపరచిన తేదీ నుండి ఒక సంవత్సరము |

కాలపరిమితి దాటిన తర్వాత దాఖలు చేయబడిన వివాదము రద్దగును. కనుక సంఘములు కాలదోషములోగా బకాయిదారులపై చర్య తీసుకొనవలయును. అలా కాని పక్షములో సంఘమునకు వచ్చు నష్టములకు పాలకవర్గ సభ్యులు వ్యక్తిగతముగా బాధ్యులగుదురు. వారినుండి ఆ నష్టములు భర్తీ చేయబడును.

బకాయిదారుడు కాలదోషము గడువులోగా లిఖితపూర్వకముగా అప్పు చెల్లింపుకు ఒప్పుదల యిచ్చినయెడల, ఆ తేదీనుండి మరల కాలదోషము గడువు లెక్కించబడును. అప్పుకు కాలదోషము పట్టిన తరువాత పొందబడిన ఒప్పుదల చెల్లదు.

అప్పునకు కాలదోషము పట్టులోగా వడ్డీ క్రిందగాని, లేక అసలు క్రిందగాని బకాయిదారునిచే చెల్లు వేయబడినయెడల, అట్టిచెల్లు తేదీనుండి కొత్త కాలదోష పరిమితి లెక్కింపబడును. జామీను అప్పుల విషయములో ఋణగ్రహీత మరియు జామీనుదారుడు కూడ చెల్లులపై సంతకము చేయవలయును, ఎవరు సంతకము చేయరో వారిపై నున్న బాధ్యతకు కాలదోషము పట్టును.



# 10 ప్రభుత్వ ధనసహాయము

## వాటా ధనము

## Government Share Capital Contribution

రాష్ట్ర ప్రభుత్వము ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘము లకు. (సేవా సహకార సంఘములకు, విశాల సహకార సంఘములకు గ్రామీణ సహకార బ్యాంకులకు. రైతు సేవా సహకార సంఘములకు) రూ. 15,000/లు నుండి రు. 50,000 ల వరకు వాటా ధనము ఇచ్చు చున్నది. ప్రభుత్వ వాటాధనము పొందుటకు సంఘములలో ఈ క్రింది షరతులు పరిశీలింపబడును.

1) సంస్థలు స్వశక్తివంతమైనవి కాని, స్వశక్తివంతము అగుటకు అవకాశమున్నవి కాని (Viable or Potentially Viable) అయి యుండవలెను.

2) సంస్థలు పూర్తి కాలపు వేతన కార్యదర్శిని కలిగియుండవలెను.

3) సంఘము ఆడిట్‌లో 'D' తరగతికి చెందియుండరాదు.

4) సంఘము 40 శాతమునకు మించి బకాయిలు సాధారణముగా కల్గియుండరాదు.

ప్రభుత్వ వాటాధనము 12 సంవత్సరములలో సమాన వాయిదాలలో వాపసు చేయవలసి ఉన్నది. మొదటి వాయిదా 8 సంవత్సరములు పూర్తి అయిన పిదప చెల్లించవలయును ప్రభుత్వ వాటా ధనము వలన సంఘముయొక్క గరిష్ట ఋణాధికారము వ్యాపారధనము పెరిగి సంఘము ఆర్థిక పటిష్టతతో పనిచేయుటకు అవకాశమేర్పడును. జాతీయ వ్యవసాయ గ్రామీణాభివృద్ధి బ్యాంకు, జాతీయ వ్యవసాయ పరపతి (దీర్ఘ కాలిక కార్యకలాపాల) నిధినుండి రాష్ట్ర ప్రభుత్వములకు, సహకార సంఘములలో వాటాలు తీసుకొనుటకు ఋణములను మంజూరు

## గిడ్డంగులు నిర్మించుకొనుటకు సహాయం

ఎంపిక చేయబడిన ప్రాథమికవ్యవసాయ సహకార పరపతి సంఘములకు పంటల నిల్వకు, మరియు ఎరువులు, క్రిమిసంహారక మందుల నిల్వకు గిడ్డంగి 100 మెట్రిక్ టన్నుల ప్రమాణం గలది నిర్మించుకొనుటకు, 'ప్రపంచ బ్యాంకు గిడ్డంగి వసతి పథకం' క్రింద ప్రభుత్వము సహాయం చేయుచున్నది. 1980-81లో ప్రారంభమయిన ఈ పథకం ప్రకారము ఆంధ్రప్రదేశ్‌లో 3000 గ్రామీణ గిడ్డంగులు ఐదు సంవత్సరాలలో నిర్మించడం జరుగుతుంది. సంఘములో కుటుంబావసర వస్తువుల పంపిణీ కార్యక్రమములను నిర్వర్తించుటకు విక్రయ విభాగము. సంఘమునకు కార్యాలయము, మరియు సంఘ కార్యదర్శికి నివాస వసతిని గిడ్డంగిలో ఏర్పాటు చేస్తారు ఒక్కొక్క గిడ్డంగికి 80 వేల నుండి లక్ష రూపాయలు ఖర్చు కాగలదని అంచనా వేయడమైనది. గిడ్డంగి కయ్యే ఖర్చులు 50 శాతము ఋణముగానూ; 45 శాతము వాటాధనముగానూ (25 శాతము జాతీయ సహకార అభివృద్ధి కార్పొరేషను, 20 శాతము రాష్ట్ర ప్రభుత్వము) సహాయం అందించటం జరుగుతుంది. మిగతా 5 శాతము సంఘమే తన స్వంత నిధులనుండి భరించాలి.

ఈ పథకమును జాతీయ స్థాయిలో జాతీయ సహకార అభివృద్ధి కార్పొరేషన్, రాష్ట్రస్థాయిలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సహకారబ్యాంకు అమలు పరచుచున్నవి.

## ప్రత్యేకపారు బాకీలనిధి లేక నష్టాన్ని భర్తీ చేయునిధి
## Special Bad Debts Reserve fund or Risk fund

ఆర్థికంగా వెనుకబడివున్న బలహీనవర్గపు సభ్యులకు అప్పులు ఇచ్చిన తిరిగి వసూలు కావనుభయంతో సాధారణముగా వారికి అప్పులు ఇచ్చుటకు సహకార సంఘములు వెనుకాడుచున్నవి. కాని ఈ వర్గ

ములకారికికూడా పరపతిని అందజేయవలసియున్నది. వారికి పరపతి నిచ్చుటకు సంఘములను ప్రోత్సహించు తలంపుతో ఒక పథకమును రాష్ట్ర ప్రభుత్వములు N C D C సహాయ సహకారములతో అమలు చేయు చున్నది. ఈ పథకము క్రింద ప్రస్తుత సహకార సంవత్సరములో బల హీనవర్గపు సభ్యులకిచ్చిన పరపతి, క్రిందటి సంవత్సరము ఆ వర్గపు ప్రజల కిచ్చిన పరపతి మొత్తముకంటె ఎక్కువగావున్న, ఆ ఎక్కువ యిచ్చిన పరపతి మొత్తముమీద సహకార పరపతి సంఘములకు 4% చొ॥న కేంద్ర సహకార బ్యాంకులకు 2% చొ॥న గ్రాంట్లు (Out right grants) 6వ పంచవర్ష ప్రణాళికా కాలములో ఇవ్వబడినవి. ఈ గ్రాంట్లు ("Risk fund") అని పిలువబడుచున్నవి

మొదట 1960లో శ్రీ V. L. మెహతా అధ్యక్షతతో ప్రభుత్వ ముచే నియమింపబడిన సహకార పరపతిమీద నిపుణుల సంఘము (Expert Committee on Co-op. Credit) బలహీనవర్గపు సభ్యు లకు పరపతి నిచ్చువట్లు సహకార సంఘములను ప్రోత్సహించుటకు ప్రత్యేక పారుబాకీల నిధిని, ప్రభుత్వము ప్రాథమిక సంఘములకు, కేంద్ర సహకార బ్యాంకులకు ఇవ్వవలెసినదని సిఫార్సుచేసిరి. ఈ సిఫార్సును ప్రభుత్వము అంగీకరించి, అప్పటినుండి ప్రత్యేక పారు బాకీల నిధిని సహకార పరపతి సంస్థలకు మంజూరు చేయుచున్నది. ఐదవ పంచవర్ష ప్రణాళికా కాలములో ఈ నిధి 'Risk fund' అని పిలువబడుచున్నది.

## సహకార పరపతి సంఘముల చిన్నతరహా అప్పులకు హామీ పథకము

డిపాజిట్టు ఇన్సూరెన్సు మరియు క్రెడిట్ గ్యారెంటి కార్పొరే షను Small loans (Co-operative Credit societies) Guarantee scheme అను నూతనపథకము నొకదానిని సహకార రంగ సంస్థ లకు వర్తించుటకు 1982 లో రూపొందించి, 1983 జనవరి 1వ తేదీ నుండి అమలు పరచుచున్నది.

# II ప్రభుత్వ ప్రతిపాదిత అభివృద్ధి సంస్థలు

## Government Sponsored institutions for economic Development of masses

### సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థ
### (Small Farmers Development Agency)

1969లో బి. వెంకటప్పయ్య అధ్యక్షతతో ఏర్పడిన "అఖిలభారత గ్రామీణ పరపతి సమీక్షా సంఘము" వారు సన్నకారు రైతుల (Small Farmers) పేదరైతుల (Marginal Farmers) వ్యవసాయ కూలీల (Agricultural Labourers) అవసరములను సహకార పరపతి వ్యవస్థ తీర్చలేక పోయిందని, ఆధునిక వ్యవసాయ పద్ధతులు వీరికి అందుబాటులోనికి రాలేదని, వీరికి తోడ్పడేటందుకు, ప్రత్యేకమైన సంస్థలను ఏర్పాటు చేయాలని సిఫారసు చేసినారు. తగిన సహాయ సంపత్తులను అందజేసే పక్షములో రైతాంగములో అధిక సంఖ్యాకులైన ఈ కోవకు చెందిన రైతులుకూడా మంచి ఫలసాయాన్ని సాధించగలరని భావించిరి కేంద్ర ప్రభుత్వము వీరి సిఫారసులను అంగీకరించినది. నాల్గవ పంచవర్ష ప్రణాళికా కాలములో వివిధ రాష్ట్రములలో 46 సన్నకారురైతుల అభివృద్ధి సంస్థలను (S.F.D.A); 41 పేద రైతుల, వ్యవసాయకూలీల అభివృద్ధి సంస్థలను (M.F.A.L.D.A) స్థాపించినారు. మన రాష్ట్రములో 4 జిల్లాలలో ఈ సంస్థలను స్థాపించినారు. ఐదవ పంచవర్ష ప్రణాళికా కాలములో ఈ రెండు రకముల సంస్థలను ఒకటిగా చేసి వాటిని సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థగా పిలుస్తున్నారు. ఐదవ ప్రణాళికా కాలంలో 160 S.F.D.A లను (మన రాష్ట్రములో మరో 12జిల్లాలలో ఈ సంస్థలను) స్థాపించుట జరిగినది.

ఈ సంస్థలు సన్నకారు రైతులను, పేదరైతులను, వ్యవసాయ కూలీలను, గ్రామీణ చేతివృత్తుల వారిని గుర్తించి, వారి ఆర్థికాభివృద్ధికి

వివిధ పథకములను రూపొందించి, సహకార సంస్థలు లేక, వాణిజ్య బ్యాంకులద్వారా అమలు పరుస్తాయి. ఈ పథకములను రూపొందించుట లోను, అమలుపరుచుటలోనూ ప్రభుత్వపు వివిధ అభివృద్ధి శాఖల సహాయాన్ని తీసుకొంటారు. వివిధ పథకములకు అవసరమైన నిధులను కేటాయించి, అవి సక్రమంగా వినియోగమయ్యేలాగున S. F. D. A. చూస్తుంది. దీనికి జిల్లా కలెక్టరు అధ్యక్షులుగా ఉంటారు. ఈ సంస్థకు పూర్తికాలం పనిచేసే Project Officer (I.A.S. Cadre ఉద్యోగి) ఉంటారు. కార్య నిర్వహాక వర్గంలో జిల్లాలోని లీడ్ బ్యాంకు ప్రతినిధి, కేంద్రి సహకార బ్యాంకు ప్రతినిధి. కేంద్రి వ్యవసాయాభివృద్ధి బ్యాంకు ప్రతినిధి, సన్నకారు రైతుల, పేదరైతుల వ్యవసాయకూలీల ప్రతినిధులిద్దరు, షెడ్యూల్డు కులముల, తెగలకు చెందిన ప్రతినిధి ఒకరు సభ్యులుగా ఉంటారు ఈ సంస్థల కార్యకలాపాలను, అభివృద్ధిని రాష్ట్రస్థాయిలో ప్రభుత్వపు ప్రధాన కార్యదర్శి అధ్యక్షతన ఒక సమీక్షా సంఘము సమీక్షిస్తుంటారు.

సన్నకారురైతు అనగా 2½ ఎకరముల మాగాణి లేక 5 ఎకరముల మెట్టపొలంగాని ఉన్నరైతు 1¼ ఎకరముల మాగాణి లేక 2½ ఎకరముల మెట్టపొలం ఉన్నరైతులను పేదరైతులు (Marginal farmers) గాను ఈ సంస్థలు నిర్ణయించును. వ్యవసాయకూలీకి సొంతభూమి ఉండకూడదు. అతని ఆదాయంలో 50 శాతానికిపైగా వ్యవసాయపు పనుల నుండి లభించాలి. ఈ సంస్థనుండి సహాయం పొందడానికి కుటుంబమును ఒక యూనిట్‌గా తీసుకొంటారు. అయితే నెలకు రు. 200/- చొ॥న వ్యవసాయేతర ఆదాయం ఉన్నవారు ఈ సంస్థ పరిధిక్రిందకురారు.

## Role of S.F.D.A. in helping the Members of Co-operatives

సహకార సంఘములలోని సభ్యులకు సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థలు ఈ క్రింద వివరింపబడిన విధముగా తోడ్పడుతున్నవి.

సన్నకారు రైతుల సంస్థ వ్యవహారిక విస్తీర్ణములోనున్న సన్నకారు రైతులను పేదరైతులను, వ్యవసాయ కూలీలను గుర్తించి వారు ఆ ప్రాంతములలోని సహకార సంఘములలో సభ్యులుగా చేరుటకు తోడ్పడును. ఈ వ్యక్తులకు ఆయా సంఘములలో చేరుటకు వీలుగా 4 వాటాల వాటాధనం మేరకు 2 సం॥లలో తీర్పు షరతుపై వడ్డీలేని అప్పులు యివ్వబడును. సహకార పరపతి సంఘములు స్వల్పకాలిక, మధ్యకాలిక అప్పులను, వ్యవసాయాభివృద్ధి బ్యాంకులు దీర్ఘకాలిక పరపతి, వీరికి అంద జేయుటకు ప్రోత్సహించును. బలహీనవర్గములవారు పొందిన మధ్య కాలిక, దీర్ఘకాలిక అప్పులలో సన్నకారు రైతులకు 25%, పేదరైతు లకు, వ్యవసాయ కూలీలకు 33.33% సబ్సిడీని ఈ సంస్థ యిచ్చును, సబ్సిడీ మొత్తమును సభ్యులు సహకార సంఘములలో అదనపు వాటాలు తీసుకొనుటకు ఉపయోగించవచ్చును. ఆర్థికంగా బలహీనంగా ఉన్న కేంద్ర సహకార బ్యాంకులకు బలహీనవర్గపు వ్యక్తులకు అప్పులిచ్చుటకు తోడ్పడుటకుగాను 5 సం॥ల గడువులో తీర్చుటకు బ్యాంకు రేటుకంటే 2.5% తక్కువ వడ్డీకి S.F.D.A. అప్పులనిచ్చును. బలహీనవర్గము వారికి అప్పులు యిచ్చేటందుకు సహకార సంస్థలను ప్రోత్సహించేటందుకు గాను యిచ్చిన అప్పులపైప్రాథమిక మిశ్ర సంఘములకు 4% చొ॥వను, కేంద్ర సహకారసంస్థలకు 2% చొ॥వను రిస్కుఫండు (Risk Fuud) గ్రాంటుగా మంజూరు చేయును.

పంచవర్ష ప్రణాళికా కాలానికి ఒక్కొక్క S.F.D.A. కు 150 లక్షల రూ॥లను కేటాయించినారు. ఈ కాలంలో ఈ సంస్థ 50 వేల వ్యక్తుల అభ్యుదయానికి కృషి చేయాలని లక్ష్యముగా నిర్ణయించినారు.

## అనావృష్టి, పీడిత ప్రాంతాల అభివృద్ధి కార్యక్రమము
## Drought Prone Areas Programme

మనదేశములో 20 శాతము ప్రాంతము తరచు అనావృష్టికి గురి అవుతున్నది. నాల్గవ పంచవర్ష ప్రణాళికా కాలములో కేంద్రప్రభుత్వము ఈ ప్రాంతాల అభివృద్ధికి ప్రత్యేక పథకము అనావృష్టి పీడిత ప్రాంతాల అభివృద్ధి కార్యక్రమములను ప్రతిపాదించినది. ఐదవ పంచవర్షప్రణాళికా కాలములో ఈ పథకమునకు సమగ్రరూపమిచ్చి అమలు పర్చుట జరిగినది.

దేశములోని 13 రాష్ట్రములలోని 74 జిల్లాలలో అచ్చట వర్షపాతపు తీరును. నీటివసతి సౌకర్యములను అనావృష్టి తీవ్రతను పరిశీలించి ఈ కార్యక్రమమును అమలుకు ఎంపిక చేసినారు. మన రాష్ట్రములో అనంతపురం, చిత్తూరు, కడప, కర్నూలు, మహబూబ్‌నగర్, ప్రకాశం మరియు నల్గొండ జిల్లాలలో ఈకార్యక్రమమును అమలు చేయుట జరుగుతున్నది.

అనావృష్టి తీవ్రతను తగ్గించుటకు ఈ ప్రాంతపు ప్రజలు, ప్రత్యేకించి బలహీనవర్గముల వారి ఆదాయాన్ని స్థిరపరచుటకు, పెంపు చేయుటకు ఈ పథకము క్రింద కార్యక్రమములు రూపొందించి అమలు చేయబడును, మంచి వర్షపు సంవత్సరములలో ఉత్పత్తిని అధికపరచుటకు. అనావృష్టి సంవత్సరములలో వచ్చే నష్టాన్ని తగ్గించుటకు కృషి చేయుచున్నారు. మెరుగుపరచబడిన మెట్టసేద్యపు విధానాలు, భూసార పరిరక్షణ కార్యక్రమములు నేలకోతను అరికట్టడం, తేమను నిలువచేయడం పట్టు పరిశ్రమ తోటల పెంపకం నీటివనరులను పెంచడం మొదలగు కార్యక్రమములద్వారా అభివృద్ధిని సాధించడానికి కృషి చేస్తున్నారు. ఈ ప్రాంతములలోని వ్యవసాయాభివృద్ధి కొన్ని పరిమితులకు లోబడి

ఉన్నది కనుక వ్యవసాయ అనుబంధమయిన కోళ్ళ పెంపకం, గొఱ్ఱెల పెంపకం. పాడిపరిశ్రమ తేనె పరిశ్రమ మొదలగు ఉపవృత్తులను చేపట్టుటకు ఉపాధికల్పనకు ఈ కార్యక్రమము ఉద్దేశింపబడినది. ఇటీవల ఈ కార్యక్రమముల అమలుకు ప్రపంచబ్యాంకు సహాయపడుతున్నది.

ఈ కార్యక్రమమును అమలుపరచుటకు అనావృష్టి ప్రాంతాల అభివృద్ధిసంస్థలను (Drought Prone Area Development Agency) లను స్థాపించిరి జిల్లా కలెక్టరు ఈ సంస్థకు అధ్యక్షులుగా ఉందురు. దుర్భిక్షప్రాంతాల అభివృద్ధి కార్యక్రమములు అమలుపరచు ప్రాంతములలో సహకార సంఘములు తమ సభ్యులకు ఈ క్రింది విధముగా సహాయ మొనర్చును.

ఈ కార్యక్రమము క్రింద ఈ ప్రాంతాలలోని సహకార సంఘములు, వ్యవసాయాభివృద్ధి బ్యాంకులు పైనతెలిపిన వివిధ అభివృద్ధి కార్యక్రమములను అమలుపరచుటకు స్వల్పకాలిక, మధ్యకాలిక. దీర్ఘకాలిక ఋణములను యితర సేవాసౌకర్యములు అందజేసి సభ్యుల ఆర్థిక పురోగతికి కృషిచేయుచున్నవి. ఈ పథకముక్రింద ఋణములను పొందిన సహకార సంస్థల సభ్యులకు మధ్యకాలిక, దీర్ఘకాలిక ఋణములలో, సన్నకారు రైతులకు 25% యితర బలహీనవర్గముల వారికి 33.3% సబ్సిడి ఇవ్వబడుచున్నది.

## సమగ్ర గ్రామీణాభివృద్ధి పథకం
## (Integrated Scheme of Rural Development)

గ్రామీణ భారతదేశాన్ని ఆర్థికంగా అభివృద్ధిపరచుటకు. పేదరికాన్ని నిర్మూలించడానికి ఆరవ పంచవర్షప్రణాళికలో సమగ్రగ్రామీణాభివృద్ధి పథకాన్ని క్రొత్తవ్యూహంగా రూపొందించి అమలుచేయుట జరిగినది. ఈ పథకంలోని కార్యక్రమాలను రూపొందించడానికి, అమలు

వరచడానికి పంచాయితీ సమితి ప్రాంతాన్ని ప్రాతిపదికగా (ఒక Unitగా) తీసుకొంటారు. సమితి ప్రాంతంలోని ప్రజల అవసరాలను, అభివృద్ధి సాధించడానికున్న అవకాశాలను పరిశీలించి ఆ ప్రాంతాన్ని, మరియు ప్రజల సర్వతోముఖాభివృద్ధికి కార్యక్రమాలు రూపొందించి అమలు జరపటం జరుగుతుంది. అందుబాటులోనున్న సాంకేతిక పరిజ్ఞానాన్ని వినియోగించడం, అదనపు ఉపాధి అవకాశాల కల్పన, మవులిక వదుపాయాలు సమకూర్చడం ద్వారా గ్రామీణాభివృద్ధిని సాధించడం ఈ పథకంలక్ష్యం ప్రతీ పంచాయితీ సమితి ప్రాంతంలోనూ ఏటా ఆరు వందల కుటుంబాలకు (సంవత్సరానికి రూ. 3,500/- కన్న తక్కువ ఆదాయం ఉన్న కుటుంబాలకు) ఈ పథకంక్రింద ప్రయోజనం చేకూర్చటం జరుగుతుంది. ఈ పథకంలోని కార్యక్రమాలు వ్యవసాయకూలీలు పేద రైతులు, సన్నకారు రైతులు, గ్రామీణ చేతివృత్తులవారు, నిరుద్యోగులు ఇతర నిరుపేదల జీవితాభ్యుదయానికి, జీవనస్థాయిని మెరుగుపర్చడానికి ఉద్దేశింపబడినది. దేశపిత మహాత్మాగాంధీ ప్రవచించిన అంత్యోదయ సిద్ధాంతాన్ని అమలు చేయడం ద్వారా దారిద్ర్యరేఖకు దిగువన జీవిస్తున్న పేదప్రజలను ఉద్ధరించడం ఈ పథకం ఆశయం.

ఈ పథకముక్రింద 18 సం॥ల నుండి 35 సం॥లలోపు గ్రామీణ యువతీ యువకులకు వారికి వివిధ వృత్తుల మీదనున్న అభిరుచి, నైపుణ్యాముల ననుసరించి స్వయం ఉపాధి కల్పించుకొనుటకు ఆయా వృత్తులలో ప్రత్యేకశిక్షణ యిచ్చుట జరుగుతున్నది శిక్షణ కాలములో రూ 125/- ఆర్థికభృతి (Stipend) యిస్తున్నారు శిక్షణ పూర్తి కాగానే ఆయా వృత్తులలో స్వయం ఉపాధిని. కల్పించుకొనుటకు జాతీయ బ్యాంకుల ద్వారా ఋణ సహాయము, ప్రభుత్వ సబ్సిడీ అందచేయబడుతున్నది.

ఈ సమగ్ర గ్రామీణాభివృద్ధి పథకం 1978-79లో రెండువేల పంచాయితీ సమితులలో అమలుచేయడం ద్వారా ప్రారంభించుట జరిగి

నది, ప్రతీ సంవత్సరంలోనూ 800 కొత్త పంచాయితీ సమితులకు ఈ పథకాన్ని విస్తరింపజేయడానికి ఉద్దేశింపబడినది. అయితే, 1980 గాంధీ జయంతి నుండి దేశంలోని మొత్తము 5,011 పంచాయితీ సమితుల లోనూ ఈ పథకాన్ని అమలు చేయడానికి కేంద్ర ప్రభుత్వం నిర్ణయించినది. ప్రతీ పంచాయితీ సమితిలో ఏటా 5 లక్షల రూ॥లను ఈ పథకాన్ని అమలుపర్చుటకు ఖర్చు చేయడమైనది. ఈ ఖర్చును కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు చెరి సమానంగా భరిస్తున్నవి.

ఈ పథకం క్రింద యిచ్చు అప్పులలో వ్యవసాయ కూలీలు, పేదరైతులకు 33 1/3 శాతము, సన్నకారు రైతులకు 25 శాతము. గిరిజనులకు, 50 శాతము ఇతర బలహీనవర్గాల వారికి, చేతివృత్తుల వారికి 25 శాతము నుండి 50 శాతము వరకు సబ్సిడీ లభిస్తుంది. అభివృద్ధి కార్యక్రమముల అమలుకు కావలసిన మిగతా మొత్తమును బ్యాంకులు తదితర ఆర్థికసంస్థలు సమకూరుస్తాయి.

## జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ
## (District Rural Development Agency)

సమగ్ర గ్రామీణాభివృద్ధి పథకమును అమలు పర్చడానికి, సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థలను, అనావృష్టి పీడిత ప్రాంతాల అభివృద్ధి సంస్థలను జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థలుగా మార్చడమైనది. ఆ అభివృద్ధి సంస్థలులేని జిల్లాలలో కూడా దేశవ్యాప్తంగా 'జిల్లా గ్రామీణాభిసంస్థ' లను నెలకొల్పినారు.

ఇదివరకటి సన్నకారు రైతుల, పేదరైతుల వ్యవసాయ కూలీల అభివృద్ధి పథకములను, అనావృష్టి పీడితప్రాంతాల అభివృద్ధి పథకములను, సమగ్ర గ్రామీణాభివృద్ధి పథకములను సమన్వయపరచి జిల్లా గ్రామీణాభివృద్ధికి ఈ సంస్థ కృషిచేయును,

## ఆయకట్టు ప్రాంతాల అభివృద్ధి కార్యక్రమము
## Command Area Development Programme

మనదేశంలో క్రొత్తగా నిర్మింపబడుతున్న పెద్దతరహా, మధ్యతరహా నీటిపారుదల ప్రాజెక్టుల క్రిందనున్న ఆయకట్టును త్వరగా అభివృద్ధిపరచి ఆ భూములను సేద్యయోగ్యము చేయుటకు కేంద్ర ప్రభుత్వము ప్రత్యేక పథకముద్వారా సహాయపడుచున్నది. మన రాష్ట్రములో నాగార్జునసాగరు కుడి, ఎడమ కాలువల క్రిందను, శ్రీరామసాగర్ తుంగభద్ర ప్రాజెక్టుల క్రిందను ఆయకట్టు అభివృద్ధిని అమలు పరచుటకు ఆయకట్టు ప్రాంతాల అభివృద్ధి సంస్థలను (Command Area Development Authority) ఏర్పాటుచినారు. రాష్ట్ర ప్రభుత్వ స్థాయిలో ఈ కార్యక్రమముల అమలును, అభివృద్ధిని సమీక్షించేటందుకు ఆయకట్టు ప్రాంతాల అభివృద్ధిశాఖ C.A. Dev. Department ఉన్నది. ప్రపంచబ్యాంకుకూడా ఈ కార్యక్రమములకు ఆర్థిక సహాయముచేయుచున్నది. ఈ పథకముల అమలుకు, ముందుగా N A B A R D వారి ఆమోదము పొందవలసి వున్నది.

భూమి పునరుద్ధరణ కార్యక్రమములకు భూమిని చదునుచేయుటకు గట్లుపోతకు పంటకాల్వలను నిర్మించుటకు అగుఖర్చును శాస్త్రీయముగా అంచనావేసి నిర్ణయింతురు. ఈ కార్యక్రమములు నీటిపారుదల శాఖవారి (P.W.D.) అజమాయిషీలో నిర్వహింపబడును. అవసరమయినచోట్ల Agro Industrial Corporation వారి సహాయము తీసుకొనబడును.

ఈ కార్యక్రమము క్రింద ఆర్థిక సహాయము కొన్ని తాలూకాలలో వ్యవసాయాభివృద్ధి బ్యాంకులు, కొన్ని తాలూకాలలో వాణిజ్య బ్యాంకులు చేయుచున్నవి. కేంద్రసహకార బ్యాంకులు పరపతి సంఘములద్వారా S A.O. Loans అందించుచున్నవి.

భూమిని చదునుచేయు కార్యక్రమములకు భూమికున్న వాలును బట్టి (Slope) పరపతి ఆవసరములను నిర్ణయింతురు. ఈ ఋణమొత్తమును రెండు దఫాలుగా యిచ్చెదరు. మొదటిదఫా యిచ్చిన అప్పు పద్ధతిని వినియోగము చేయబడినట్లు నీటిపారుదలశాఖ ఇంజనీరింగు విభాగము వారి ధృవపత్రము ఆధారముగా రెండవ వాయిదా మొత్తము విడుదల చేయబడును. ఈ కార్యక్రమముల అమలును పర్యవేక్షణ జరిపినందుకు గాను P.W.D. వకు కొంతమొత్తమును చెల్లించవలయును. అభివృద్ధికి కావలసిన మొత్తములో కొంత భాగమును రైతు తన స్వంతవనరులనుండి (Down Payment) భరించవలెను, సన్నకారు రైతులు 5%, మధ్య తరగతి రైతులు 10% పెద్దరైతులు 15% భరించవలయును. సన్నకారు రైతులు అప్పులు తిరిగి 2+12 సం॥లలోనూ, యితర రైతులు 2+8 సం॥లలోనూ తిరిగి చెల్లించవలెను.

ఈ అభివృద్ధి పథకముక్రింద సహకార సంఘ సభ్యులకు దీర్ఘకాలిక ఋణములలో సన్నకారు రైతులకు 25%, పేదరైతులకు 33.33% సబ్సిడీ యివ్వబడును.

నాల్గవ పంచవర్ష ప్రణాళికా కాలంలో (1974 డిశంబరు) యీ పథకము ప్రవేశపెట్టబడినది. ఐదవ ప్రణాళికా కాలములో ఈ పథకము క్రింద ఆయకట్టు ప్రాంతములలో భూమి అభివృద్ధి, నీటిపారుదల సౌకర్యాలతోపాటు ఆ ప్రాంతపు ఇతర అవసరములు, రహదారులు, మార్కెటింగ్, ప్రోసెసింగు, ఇతర సౌకర్యములు పెంపుచేయుటకు ఆ ప్రాంతపు సమగ్ర అభివృద్ధికి కృషి చేయుట జరుగుచున్నది. అభివృద్ధి శాఖలు, అభివృద్ధి సంస్థల సమన్వయ సహకారములతో ఈ అభివృద్ధి సాధించుటకు Command Area Development Authority కృషి చేయుచున్నది.

ప్రస్తుతము 38 Command area Development authorities ద్వారా 12 రాష్ట్రములలోని 102 జిల్లాలలో ఈ అభివృద్ధి కార్యక్రమము అమలు జరుపబడుచున్నది.

## ఆంధ్రప్రదేశ్‌లో ద్రవ్యసహాయ సహకార కార్పొరేషనులు

## Co-operative Finance Corporations

1) Andhra Pradesh Back - Ward Classes' Co-operative Finance Corporation.

2) A.P. Scheduled Castes Co-op. Finance Corporation

3) A.P. Women's Co-op. Finance Corporation.

4) A,P. Scheduled Tribes Co-op. Finance Corporation

5) A.P. Physically Handicaped Co-operative Finance Coproration

రాష్ట్రంలోని వెనుకబడిన తరగతుల, షెడ్యూల్డు కులముల, మహిళల, షెడ్యూల్డు జాతుల ఆర్థిక పురోభివృద్ధికి కృషి చేయుటకు ప్రత్యేక ద్రవ్యసహాయ సంస్థలను రాష్ట్రస్థాయిలో స్థాపించడం జరిగింది. ఇవి వరుసగా ఆంధ్రప్రదేశ్ వెనుకబడిన తరగతుల సహకార ద్రవ్యసహాయ సంస్థ (1974) ఆంధ్రప్రదేశ్ షెడ్యూల్డు కులముల సహకార ద్రవ్య సహాయ సంస్థ (1974) ఆంధ్రప్రదేశ్ మహిళల ద్రవ్య సహాయసంస్థ, ఆంధ్రప్రదేశ్ షెడ్యూల్డు జాతుల ద్రవ్య సహాయ సంస్థ (1978), ఆంధ్రప్రదేశ్ వికలాంగుల ద్రవ్య సహాయ కార్పొరేషన్ (1981) ఇటువంటి సంస్థలను దేశము మొత్తంమీద మన రాష్ట్రంలోనే మొట్టమొదటిగా స్థాపించడం జరిగింది. పై సంస్థల కనుబంధముగా జిల్లా స్థాయిలో అ

సంస్థల జిల్లా సేవా సహకార సంఘములు/బ్రాంచీలు పనిచేయుచున్నవి. ఈ సంస్థలు ఆంధ్రప్రదేశ్ సహకార సంఘముల చట్టము క్రింద రిజిష్టరు కాబడినవి.

ఈ సంస్థలు ఆయా వ్యక్తుల ఆర్థికాభివృద్ధికి అనేక రకముల పథకములను రూపొందించి సహకార పరపతి సంఘములు, సహకార బ్యాంకులు, వాణిజ్య బ్యాంకులద్వారా అమలు పరచుచున్నవి. ఈ సంస్థలు సభ్యులకు వివిధ అభివృద్ధి కార్యక్రమములకు మార్జిన్ మనీ (Margin money) రూపంలో 20% అప్పు పెడుతుంది. మిగిలిన 80% సంఘములు, బ్యాంకులు అప్పుగా యిస్తాయి.

పై సంస్థల జిల్లాస్థాయి సంఘములు / బ్రాంచీల కమిటీ అధ్యక్షుడుగా జిల్లా కలెక్టరు వ్యవహరిస్తారు. వివిధ జిల్లాలలో అమలు జరుపబడిన వివిధ పథకములవలన బెస్తవారు, చేనేత పనివారు, కుమ్మరులు, కమ్మరులు, కుట్టు పనివారు, పాదరక్షలు తయారుచేయువారు, రజకులు, నాయీ బ్రాహ్మణులు, హరిజనులు గిరిజనులు, మహిళలు వృత్తివనులు, కుటీర పరిశ్రమలు చేసుకొనేవారు, ఆటోరిక్షాలు, చిన్నబస్సులు, లారీలు, సైకిలు రిక్షాలు, అచ్చు ఆఫీసులు, రేషన్ షాపులు నడిపేవారు, వ్యవసాయకూలీలు. పాడిపరిశ్రమ, గొర్రెల పెంపకం, పందుల పెంపకము, కోళ్ళ పెంపకం, చేపల పరిశ్రమ తేనె పరిశ్రమ మొదలగు అనుబంధ వృత్తులు చేపట్టుటకు; అనాథ స్త్రీలు మొదలగువారు స్వయం ఉపాధి కల్పనకు ఆర్థిక పురోభివృద్ధికి ఈ సంస్థలు తోడ్పడుతున్నాయి.

ఆర్థికముగా వెనుకబడినవారు, ఏ కులమునకు చెందినా ఆ వ్యక్తి సాలుసరి ఆదాయము రూ. 1500/లకు మించక పోయినట్లయితే వెనుకబడిన తరగతుల ద్రవ్య సహాయ సంస్థద్వారా అప్పుపొందుటకు అర్హుడు.

పై సంస్థలు, బలహీనవర్గమునకు చెందిన తమ సభ్యులకు మరింత సామర్థ్యములో సేవచేయుటకు, సహకార పరపతి సంఘములకు తోడ్పడుతున్నవి.

# 12 కేంద్ర సహకార బ్యాంకులు

## (Co-operative Central Banks)

మూడంతస్థుల సహకార పరపతి వ్యవస్థలో కేంద్ర సహకార బ్యాంకులు కీలకమైన స్థానాన్ని ఆక్రమించినవి. పరిపాలనా సౌలభ్యం కోసం సాధారణముగా జిల్లాకు ఒక కేంద్ర సహకార బ్యాంకును స్థాపించుట జరిగినది. అందుచేత వీటిని జిల్లా కేంద్ర సహకార బ్యాంకులుగా వ్యవహరిస్తారు, అయితే కొన్ని జిల్లాలలో ఒకటికన్న ఎక్కువ కేంద్ర సహకార బ్యాంకులుండటం, ఒకే కేంద్ర సహకార బ్యాంకు రెండవ జిల్లాలో కొంత ప్రాంతమునకు విస్తరించి ఉండటం కూడా ఉన్నది. మన రాష్ట్రములోని 23 జిల్లాలలో 27 కేంద్ర సహకార బ్యాంకులు దాదాపు 400 బ్రాంచీలద్వారా పనిచేస్తున్నాయి.

ఈ బ్యాంకుల ముఖ్యోద్దేశ్యములు ;

1) జిల్లాలోని సహకార ఉద్యమాభివృద్ధికి తగిన విధంగా దోహదం చేయటం.

2) ప్రాథమిక సహకార సంఘములకు పరపతి మరియు బ్యాంకింగు సౌకర్యములను కల్పించుట.

3) సహకార సంఘములకు ఋణములను మంజూరు చేయుటకు నిధులను సేకరించుట - బ్యాంకింగు వ్యాపారము చేయుట.

4) ప్రాథమిక సహకార సంఘముల రిజర్వు నిధులను సురక్షితంగా దాచడం, సంఘముల మిగులు మొత్తములను డిపాజిట్లుగా అంగీకరించి వాటిని లాభదాయకముగా వినియోగించుట.

5) గ్రామ ప్రాంతములలో బ్యాంకు బ్రాంచీలను విరివిగా తెరచి బ్యాంకింగు సౌకర్యములను విస్తరించుట . గ్రామ ప్రాంతములలోని మిగులు ధనమును డిపాజిట్ల రూపమున సేకరించుట.

6) సభ్యత్వ సంఘముల పర్యవేక్షణకు. తనిఖీకి తగిన ఏర్పాట్లు చేయుట సంస్థల మధ్య సమన్వయాన్ని పెంపొందించుట

7) సభ్యత్వ సంఘములకు కావలసిన పుస్తకములను. ఫారములను సరఫరా చేయుట.

8) సభ్యత్వ సంఘముల ఆర్థిక పురోభివృద్ధికి కృషి చేయుట - ఆ సంఘముల లక్ష్యసాధనలో తోడ్పడుట.

## సభ్యత్వము :

బ్యాంకు వ్యవహారిక విస్తీర్ణములోని అన్ని ప్రాథమిక సహకార సంఘములు సభ్యులుగా చేరవచ్చును, రాష్ట్ర ప్రభుత్వము, రాష్ట్ర సహకార బ్యాంకుకూడా సభ్యత్వము స్వీకరించవచ్చును.

ఈ బ్యాంకులు స్థాపించిన మొదట్లో వ్యక్తులనుకూడా సభ్యులుగా చేర్చుకొనుట జరిగినది. అయితే 1964 సం॥రపు ఆంధ్రప్రదేశ్ సహకార సంఘముల చట్టములో వ్యక్తులను కేంద్ర సహకార బ్యాంకులలోను ఇతర సమాఖ్యలలోను సభ్యులుగా చేర్చుకొనుట నిషేధింపబడినది. అయితే, యిదివరకటి వ్యక్తిగత సభ్యులు తమ జీవితకాలములో సభ్యులుగా కొనసాగవచ్చు, వారి వాటాలు యితరులకు బదిలీచేయబడవు.

## నిర్వహణ :

కేంద్ర బ్యాంకుల నిర్వహణలో తుదినిర్ణయం సర్వసభ్య సమావేశం చేతులలో ఉన్నప్పటికి సాధారణ కార్యక్రమముల నిర్వహణ పాలకవర్గానికి అప్పగించడం జరుగుతుంది. వివిధ సహకార సంఘములకు చెందిన ప్రతినిధులు 20 మందిని, వ్యక్తుల నుండి ఒకరిని, పాలకవర్గ

సభ్యులుగా ఎన్నుకొందురు, వీరుగాక పాలకవర్గములో రాష్ట్ర ప్రభుత్వపు ప్రతినిధులు యిద్దరు ఉందురు. 1978వ సం॥లో కేంద్ర సహకార బ్యాంకుల పాలకవర్గపు సభ్యత్వములో 50% వరకు బలహీన వర్గముల చెందినవారికి కేటాయించుటకు సహకార సంఘముల చట్టమును సవరించినారు,

## నిధులు ;

బ్యాంకులు నిధులను ఈ క్రింది వివరించిన విధంగా సమకూర్చుకుంటాయి.

1) వాటాధనము - సభ్యత్వ సంఘములనుండి, ప్రభుత్వము నుండి
2) రిజర్వుఫండు, లాభములనుండి ఏర్పరచిన ఇతర రిజర్వులు, నిధులు
3) డిపాజిట్లు - ప్రజలనుండి, సంస్థలనుండి
4) ఋణములు - రాష్ట్ర సహకార బ్యాంకునుండి, జాతీయ వ్యవసాయ గ్రామీణాభివృద్ధి బ్యాంకు నుండి, వాణిజ్య బ్యాంకుల నుండి
5) ప్రభుత్వము నుండి గ్రాంట్లు, సబ్సిడీలు
6) ప్రవేశ రుసుము, యితర విధమగు జమలు

## డిపాజిట్లు ;

## Types of Deposits

ఫిక్స్‌డ్, కరెంటు, సేవింగ్సు, రికరింగు, ప్రావిడెంటుఫండు, ఉద్యోగుల సెక్యూరిటీ డిపాజిట్లు, ప్రాథమిక సంఘముల రిజర్వుఫండు డిపాజిట్లు మొదలైనవి.

బ్యాంకుల వ్యాపార ధనంలో డిపాజిట్లు చాల ముఖ్యమైనవి. డిపాజిట్లను సేకరించడానికి బ్యాంకులు యింకనూ ఎక్కువ కృషి చేయవలసి ఉన్నది. ప్రజలు పొదుపు చేయుటకు అనువైన ఆకర్షణీయమైన,

లాభదాయకమైన డిపాజిట్టు పథకములను రూపొందించి అమలుపరచ వలయును, ఖాతాదారులకు వాణిజ్య బ్యాంకులవలె అన్ని రకముల బ్యాంకింగు సౌకర్యములను అందచేయవలెను, బ్యాంకుల నిర్వహణ సామర్థ్యంవల్ల ప్రజలలో మంచి అభిప్రాయము పెంపొందునట్లు నిరంతరం కృషి చేయవలెను. గ్రామీణ ప్రాంతములలో బ్రాంచీలు విరివిగా తెరువ వలెను. వాణిజ్య బ్యాంకులకంటె సహకార బ్యాంకులు ½% ఎక్కువ వడ్డీని డిపాజిట్లమీద యిస్తున్నవి. బ్యాంకులలోనున్న ఒక్కొక్క ఖాతా దారుని డిపాజిట్టుకు 30 వేల రూపాయల వరకు భీమారక్షణ (Insurance Cover) ఉన్నది. ఇటువంటి విషయములు ప్రజలకు తెలియునట్లుగా విరివిగా ప్రచారము చేయవలయును.

## ద్రవ్యత్వపు వనరులు - Fluid Resources

డిపాజిటర్ల నగదు అవసరములను తీర్చుటకు బ్యాంకులు బ్యాంకింగు రెగ్యులేషన్ చట్టం ననుసరించి తమ మొత్తము డిపాజిట్లలో 3% నగదు రూపంలోను, మరియు 25% ద్రవ్యత్వం కల్గిన ఆస్తులలోనూ నిల్వ ఉంచవలయును.

## తీసుకొను ఋణములు - (Borrowings)

ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘములకు కాలమానపు వ్యవసాయ కార్యకలాపములకు స్వల్పకాలిక అప్పులను, వ్యవసాయ అభివృద్ధి కార్యక్రమములకు మధ్యకాలిక అప్పులను మంజూరు చేయుటకు జాతీయ వ్యవసాయ గ్రామీణాభివృద్ధి బ్యాంకు కేంద్ర సహకార బ్యాంకులకు ఋణ పరిమితిని మంజూరుచేయును, (బ్యాంకు రేటుకంటే 3% తక్కువ వడ్డీకి NABARD S.A.O. Loans అను రాష్ట్ర సహకార బ్యాంకు ద్వారా కేంద్ర సహకార బ్యాంకులకు అందచేయును).

## R.B.I. Scheme of Linking borrowings with deposit mobilisation

అయితే, కేంద్ర సహకార బ్యాంకులు తమ డిపాజిట్లను పెంచు కొనుటలో ఎక్కువ కృషి సల్పుటను ప్రోత్సహించుటకు, నిధులకు రిజర్వు బ్యాంకు (ప్రస్తుతము NABARD )మీద ఆధారపడుటను తగ్గించుటకు రిజర్వుబ్యాంకు తాను మంజూరుచేయు తక్కువ వడ్డీ ఋణ పరిమితులకు, బ్యాంకు డిపాజిట్లకు సంబంధమేర్పరచి ఒక పథకమును 1973 జూలై నుండి అమలు చేయుచున్నది.

జాతీయవ్యవసాయ గ్రామీణాభివృద్ధి బ్యాంకునుండి, కేంద్ర సహ కార బ్యాంకులు ఆడిట్ లో 'A' తరగతికి చెందినవి, తన స్వంతనిధులకు 6 రెట్లు వరకు, 'B' తరగతికిచెందినవి 4 రెట్లువరకు 'C' తరగతికి చెంది నవి 3 రెట్లువరకు ఋణములను (రాష్ట్ర సహకార బ్యాంకు ద్వారా) పొందవచ్చును. (కేంద్ర సహకార బ్యాంకులకు వాటి సభ్యత్వ సంఘ ముల ప్రోనోట్లు హామీలపై రాష్ట్ర సహకార బ్యాంకులు అప్పులిస్తాయి) NABARD నుండి ఋణము పొందవలెనన్న హామీ పత్రములపైన రెండు మంచి సంతకములు (Good Signatures) ఉండవలెను. అందు ఒకటి షెడ్యూల్డు బ్యాంకు లేదా రాష్ట్ర సహకార బ్యాంకు సంతకము అయివుండవలెను. A తరగతి, B తరగతి బ్యాంకులు తమ సంతకము మరియు రాష్ట్ర సహకార బ్యాంకు సంతకము ద్వారా అప్పు పొంద వచ్చును. అయితే C తరగతి బ్యాంకులకు రాష్ట్ర సహకార బ్యాంకు సిఫార్సుపై రాష్ట్ర ప్రభుత్వ హామీపైనగాని అప్పులివ్వరు. ప్రత్యేక పరిస్థి తులలో B మరియు C తరగతి బ్యాంకులకు కూడా ప్రభుత్వ హామీపై స్వంత నిధులకు 6 రెట్లవరకు NABARD పరపతి పరిమితిని మంజూరు చేయును.

## గుజస్తుకాని నిల్వబాకీల పరిమితి
## (Non - Overdue Cover)

అయితే కేంద్రీ సహకార బ్యాంకులు NABARD మంజూరు చేసిన ఋణపరిమితులనుండి సొమ్ము బట్వాడా పొందుటకు తమకు ప్రాథమిక పరపతి సంఘములనుండి రావలసిన వాయిదామీరని ఋణ మొత్తముల మేరకు మాత్రమే అర్హత కల్గియున్నవి. కేంద్రీ సహకార బ్యాంకులు ముందుగా తమ స్వంత నిధులనుండి సభ్యత్వ సంఘములకు అప్పులనిచ్చును. తరువాత NABARD ఋణపరిమితుల నుండి కేంద్ర సహకార బ్యాంకు తమ సభ్యత్వ సంఘముల నుండి తమకు రావలసిన అప్పుల మొత్తమునుండి బకాయిల మొత్తము తగ్గించి మిగిలిన మొత్తం మేరకు అప్పు తీసుకొనవచ్చును. (Claim re-imbursement)

1974-75 సం॥ నుండి రిజర్వుబ్యాంకు మరియొక అంశ విధించినది. కేంద్ర సహకార బ్యాంకులు, రిజర్వు బ్యాంకుకు గత సంవత్సరములో మొదటి పంటకాలపు చివరినాటికి ఉన్న గరిష్ట అప్పుల నిల్వ మొత్తమును (సంవత్సరములోగా వాయిదావచ్చు అప్పుల మొత్తమును) 40 శాతము మొత్తమునకు తగ్గించిననే తప్ప ప్రస్తుత సంవత్సరము మొదటిపంట మదుపులకు మంజూరు చేసిన ఋణపరిమితుల నుండి విడుదల లభించదని అంశ విధించినది.

వ్యవసాయ పంటల మార్కెటింగు కార్యకలాపములకు, స్వల్పకాలిక అప్పులను మధ్యకాలిక అప్పులుగా మార్చుటకు, చేనేత సహకార సంఘములకు పరపతినిచ్చుటకు ప్రత్యేక ఋణపరిమితులను NABARD కేంద్ర సహకార బ్యాంకులకు మంజూరు చేయును.

రాష్ట్ర సహకార బ్యాంకులు కూడా కేంద్ర సహకార బ్యాంకులకు;-వినియోగదారుల సంఘములకు, ఇతర వ్యవసాయేతర సంఘము

లకు పరపతి నిచ్చుటకూ, పరపతి సంఘముద్వారా వినిమయపరపతి సరఫ చేయుటకు. ప్రాథమిక సంఘములు పరపతేతర వ్యాపారము చేయుటకు నగదు పరపతి నిచ్చుటకు తన ఆర్థిక వనరులనుండి రుణములను మంజూరు చేయును.

## ఇచ్చు ఋణములు (LENDINGS)

బ్యాంకునందు సభ్యత్వం కల్గిన ప్రాథమిక సహకార పరపతి సంఘములకు గరిష్ట రుణాధికార పరిమితి ననుసరించి సాధారణముగా సంఘములు బ్యాంకునందు కల్గియున్న వాటాధనమునకు 10 నుండి 20 రెట్ల వరకూ, పంట ఋణవిధానము ననుసరించి అప్పులు ఇవ్వబడును. ప్రాథమిక పరపతి సంఘములు తిరిగి వ్యవసాయ కార్యకలాపములకు రైతులకు అప్పులనిచ్చును. ప్రాథమిక సంఘములద్వారా యీ విధంగా రైతులకు స్వల్పకాలిక, మధ్యకాలిక సౌకర్యాలు కల్పించడమే కేంద్ర సహకార బ్యాంకుల ప్రధాన కర్తవ్యము (ఈ బ్యాంకులు మన రాష్ట్రములో 1981-82లో ఖరీఫ్, రబీ పంటలకు రూ. 107.59 కోట్లు ఋణములుగా పంపిణీ చేసినవి.) సభ్యత్వ సంఘములు పరపతేతర వ్యాపారము చేయుటకు నగదు పరపతి (Cash Credit) సౌకర్యమును కూడా కలుగజేయును. వ్యవసాయ పరపతిలో రివాల్వింగు క్రెడిటు పద్ధతినికూడా 1976 సం॥ నుండి ప్రవేశ పెట్టడం జరిగింది.

కేంద్ర సహకార బ్యాంకులు పరపతి సంఘములకేగాక సభ్యత్వము కల్గియున్న జిల్లాలోని అన్ని సహకార సంఘముల పరపతి అవసరములను తీర్చుటకు కృషిచేయును. కనుక జిల్లాలోని సహకార ఉద్యమాభివృద్ధి కేంద్ర సహకార బ్యాంకు యొక్క ఆర్థిక సామర్థ్యము మీద ఆధారపడి ఉండును. ఇటీవల వ్యక్తులకు (నామమాత్రపు సభ్యులకు) కూడా బంగారు నగల తాకట్టుపై ఋణములను మంజూరు చేయుచున్నవి.

కేంద్ర సహకారబ్యాంకులు, ప్రాథమిక సహకార పరపతి సంఘములకు పరపతి పరిమితులను మంజూరు చేయునప్పుడు ఈ క్రింది షరతులను పరిశీలించును.

పరపతి పరిమితి దరఖాస్తులలో :

1. సంఘములో నూతనముగా చేర్చుకొనబడిన సభ్యుల సంఖ్య - వారు చెల్లించిన వాటాధనము వివరములు

2. సంఘ సభ్యుల పేద్యపు ఋణముల వివరములు

3. పరపతి పరిమితి దరఖాస్తు, బ్యాంకు తెలియపరచిన Scales of finance సూచనల ననుసరించి తయారయినది, లేనిదియు

4. సంఘపు సభ్యులందరూ అప్పుపొందుటకు అవసరమయిన హామీలను యిచ్చినది లేనిదియు - స్థిరాస్తులపై ఛార్జిని (హక్కును) సంఘమునకు సంక్రమింపజేసి రిజిస్ట్రీషను చేయించినది, లేనిది, యితర హామీ పత్రములను పొందినది లేనిదియు

5. చిఠా పుస్తకము పూర్తిగా అప్పు తేదీవరకూ వ్రాయబడినది లేనిది. అవసరమునకు మించిన నగదు బ్యాంకులో జమకట్ట బడినది లేనిది

6. సంఘము పరపతేతర (ఎరువులు, కుటుంబావసర వస్తువులు) వ్యాపారము చేయుచున్న యెడల, అప్పు తేదీనాటికి ఆ సరకు నిల్వల పట్టిక

7. సంఘము యొక్క ఆర్థిక పరిస్థితిని తెలియజేయు ఆస్తి అప్పుల పట్టిక, లాభనష్టముల ఖాతా మొదలగు వివరములు

8. సంఘమునకు అప్పును మంజూరు చేయవలసినదిగా కేంద్ర సహకార బ్యాంకును కోరుతూ వ్రాసిన పాలకవర్గ తీర్మానపు నకలు

9. సంఘము కోరు అప్పు మొత్తము / సంఘ సభ్యులు కోరు అప్పు మొత్తము సంఘ బైలాలు ననుసరించి, గరిష్ఠ ఋణాధికారమునకు లోబడిఉన్నది, లేనిది

10. పాలకవర్గము యొక్క ఎన్నికల తీర్మానపు నకలు, పాలక వర్గ సభ్యుల నమూనా సంతకములు

11. యితర వివరములు

## మంజూరు కాబడిన పరపతి పరిమితుల నుండి నగదు తీసుకొనుటకు సమర్పించిన దరఖాస్తు (Drawal application) లో ఈ క్రింది షరతులు పరిశీలించబడును

1. సభ్యులనుండి ఋణముల వసూళ్ళు-బాయిదా వచ్చిన అప్పులలో 40 శాతము అప్పు మొత్తము వసూలయినది లేనిది,

2. సంఘము బకాయిలను వసూలు చేయుటకు సభ్యులపై తీసుకొన్న చర్యలు తృప్తికరముగా ఉన్నది, లేనిది

3. నగదు తీసుకొనుటకు బ్యాంకును కోరుతూ సంఘ పాలకవర్గము చేసిన తీర్మానము

4. సంఘము కోరు అప్పు మొత్తము మేరకు సంఘము తరపున అవసరమైన బాండు (అప్పు పత్రము) వ్రాయబడినదియు, లేనిది

5. సంఘము అప్పు పొందుటకు కావలసిన వాటాధనము బ్యాంకులో పెట్టుబడి పెట్టినదియు లేనిది

6. సంఘ సభ్యులు అప్పుపొందుటకు కావలసిన వాటాధనము సంఘములో తీసుకొన్నది, లేనిది.

7. సంఘము/సంఘ సభ్యులు తీసుకొనుటకు కోరిన అప్పు, పరపతి పరిమితి దరఖాస్తులో మంజూరు కాబడిన, ఋణ గరిష్ఠ మొత్తమునకు లోబడి ఉన్నదియు, లేనిది

8. ఈ దరఖాస్తువాటికి సంఘములోని బకాయిదారుల వివరముల పట్టిక దరఖాస్తుతో జతపరచినది లేనిది, (బకాయిదారులు తమ బకాయి లను చెల్లించవంతవరకు, మంజూరు కాబడిన అప్పు పొందుటకు అర్హులుకారు)

9. దరఖాస్తుదారుడు, తాను ఫలానా యితర సహకార పరపతి సంస్థ లలో సభ్యుడననీ, తాను తీసుకున్న లేదా జామీనుదారుగా ఉన్న అప్పుల క్రింద బకాయిలేదని ప్రకటన చేయవలెను "బకాయిలేదు" అను సర్టిఫికెట్టును ఆయా సహకార పరపతి సంస్థలనుండి పొంది దాఖలు చేయవలెను, పై విధముగా అతను సమాచారము అంద చేసినది లేనిది

10 సంఘ సభ్యులు సంఘముతో జరిపిన అసంతృప్తికరమైన పాత లావా దేవీలకు సంబంధించిన ప్రత్యేక రిపోర్టు ఏమైన ఉన్నఎడల.

11. ఆ సంఘపు వ్యవహారములమీద రిజిష్ట్రారు/ఆడిటర్ల/బ్యాంకు ఉద్యో గుల ప్రత్యేక రిపోర్టులు ఏమైనా ఉన్నఎడల

## సంఘములకు నగదు పరపతి Cash Credit సౌకర్యములను మంజూరు చేయునప్పుడు ఈ క్రింది షరతులుకూడా విధించబడును పరిశీలించబడును

1. Cash Credit కు మంజూరయిన మొత్తమునకు అధ్యక్షుడు మరి యిద్దరు పంచాయతీదార్లతో కలిసి అవసరమైన కాండ్లు వ్రాసి యివ్వవలెను.

2. Cash Credit పరిమితికి సంవత్సరమునకు (for Calender year) సరుకుకు Fire Insurance చేయించవలెను

3. ఈ ఖాతాపై లావాదేవీలు జరుపుటకు సంఘ ప్రెసిడెంటుకు అధికారమిస్తూ, పాలకవర్గము గావించిన తీర్మానపు నకలు, ప్రెసిడెంటు నమూనా సంతకములు బ్యాంకుకు దాఖలు చేయవలెను.

4. ఈ సౌకర్యమును ఎరువులు, విత్తనములు, నిత్యావసర వస్తువుల పంపిణీ మొదలగు సౌకర్యము లకు సంఘ బైలాలలోని నిబంధనలకు లోబడి జరుపుటకు వినియోగించవలెను.

5. సరుకు అమ్మకము బాపతు పైకము బ్యాంకులోని యీ ఖాతాకు జమ కట్టుచుండవలెను. అమ్మకపు సొమ్మును సరుకు కొనుగోలుకు వినియోగించరాదు.

6. ఈ ఖాతానుండి సొమ్ము తీసుకొనునప్పుడు ఎందు నిమిత్తము ఆసొమ్ము వినియోగించునది తెలుపుతూ, యీ అకౌంటుపై లావాదేవీలు జరుపుటకు అధికారముగల వారి సంతకముతో ఒక ఉత్తరము ను ప్రతి చెక్కుతో పంపవలెను.

7. ప్రతి మాసాంతమున సరుకు నిల్వకు సంబంధించిన రిపోర్టు బ్యాంకుకు పంపుచుండవలెను.

8. ఈ వ్యాపారమునకు సంబంధించిన లావాదేవీలకు ప్రత్యేక చిఠా ఉంచవలెను.

9. ఈ ఖాతాపై చెల్లించవలసిన వడ్డీని ప్రతి అర్ధసంవత్సరమునకు నగదుగా చెల్లించవలెను.

10. యితర అవసరమైన వివరములు షరతులు పరిశీలించబడును.

తనిఖీ ; అనుబంధ సంఘములను తనిఖీ చేయు అధికారము కేంద్ర సహకార బ్యాంకులకు కలదు.

## వాయిదా మీరిన అప్పులను వసూలు పరచుటకు కేంద్ర సహకార బ్యాంకులకున్న ప్రత్యేక అధికారములు

ఆంధ్రప్రదేశ్ సహకార సంఘముల చట్టము సెక్షన్ 63 ననుసరించి ఏ సంఘమయిననూ తాను సెంట్రలు బ్యాంకునుండి పొందిన ఋణమును సకాలములో చెల్లించని ఎడల, సెంట్రలు బ్యాంకు ఆ సంఘ పాలకవర్గమును బకాయిదారులపై సెక్షన్ 61 లేక సెక్షన్ 71 క్రింద చట్టరీత్యా చర్య తీసుకొనవలసినదిగా ఆదేశించవచ్చును. సెంట్రల్ బ్యాంకు నోటీసు అందిన 90 రోజులలోపల పై చర్యలు తీసుకొనుటలో సంఘ పాలకవర్గము విఫలమయిన ఆర్థిక సహాయముచేయు బ్యాంకు నేరుగా సభ్యత్వ సంఘము యొక్క బకాయిదారులపై చట్టరీత్యా చర్య తీసుకొనవచ్చును.

డిక్రీని సెంట్రలు బ్యాంకు పొందిన ఎడల, బ్యాంకు తనకు రావలసిన బాకీలను మొదట సంఘపు అస్తుల నుండి, తరువాత సంఘ సభ్యుల నుండి వారు సంఘమునకు చెల్లించవలసిన ఋణముల మేరకు వసూలు చేసుకొనవచ్చును.

### పరిపాలనా విభాగము - (Administrative Section)

బ్యాంకు అనుబంధ సంస్థలయిన ప్రాథమిక సంఘములు తమ వ్యవహారములను నిర్వహించుకొనుటలో వాటికి తగిన సలహాలు ఎప్పటికప్పుడు ఇచ్చుట, వాటి అభివృద్ధికి కృషిచేయుట, అవి సక్రమముగా పని చేయుచున్నది లేనిదీ పర్యవేక్షించుట కేంద్ర సహకార బ్యాంకు ప్రధాన కర్తవ్యములలో ఒకటి, బ్యాంకులు సమర్థవంతముగా ఈ కార్యక్రమములను నిర్వర్తించుటకు ప్రత్యేక విభాగమును ఏర్పాటు చేసుకొనును. దానిని పరిపాలనా విభాగము అందురు. ఈ విభాగపు ప్రధానాధికారిని

ఛీఫ్ ఎగ్జిక్యూటివు ఆఫీసరు అందురు. సహకార సంస్థల అప్పు దరఖాస్తులు, నిబంధనల మార్పులు ఈ విభాగమునందు పరిశీలింపబడును. సూపరువైజర్ల టూరు ప్రోగ్రాములు, డైరీలు, తనిఖీ రిపోర్టులు ఎగ్జిక్యూటివు ఆఫీసరుచే సమీక్షింపబడును. సంఘములు పనిచేయుట యందుగల లోపములను సవరించుట, పనిచేయని సంఘములను పునరుద్ధరించుట ఈ విభాగపు పని,

## వ్యవసాయ పరపతి స్థిరీకరణ నిధి
## (Agricultural credit stabilisation Fund)

ప్రకృతి వైపరీత్యముల వలన వ్యవసాయ పంటలకు అధికముగా నష్టము సంభవించిన సందర్భములలో రైతులు తీసుకొన్న స్వల్పకాలిక ఋణములు తిరిగి చెల్లించలేక పోయినప్పుడు ఆ ఋణాలను మధ్యకాలిక ఋణాలుగా మార్చడానికి గాను రిజర్వుబ్యాంకు "వ్యవసాయ పరపతి స్థిరీకరణ నిధి" ని 1956లో ఏర్పరచినది ఈ నిధినుండి సహాయం పొందవలెనంటే రాష్ట్ర, కేంద్ర సహకార బ్యాంకులు కూడా యిటువంటి నిధిని ఏర్పరచవలెను. రాష్ట్ర, కేంద్ర సహకార బ్యాంకులు తమ నికర లాభములనుండి 15% ఈ నిధికి కేటాయించవలెను. రాష్ట్ర ప్రభుత్వములు ఈ సంస్థలనుండి తమ వాటా ధనముమీద [illegible]% నకు మించి తీసుకొను డివిడెండ్లను ఈ నిధికి చేర్చుటకు యిచ్చెదరు. ప్రత్యేక గ్రాంట్లుకూడా యిచ్చి ఈ నిధిని బలపర్చుటకు రాష్ట్ర ప్రభుత్వములు సహాయము చేయుచున్నవి.

## ఆర్థికముగా బలహీనముగా ఉన్న కేంద్ర సహకార బ్యాంకుల పునరుద్ధరణ కార్యక్రమము
## Rehabilitation of Weak Central Banks

కేంద్ర సహకార బ్యాంకులలో పాత బాకీలు, అనుమానాస్పదపు

బాకీలు, నష్టములు మూడు సంవత్సరములు దాటిన వాయిదామీరిన అప్పులు తన స్వంత నిధులకు 50 శాతమునకు మించి కల్గియున్న మరియు ఈ రకపు నిధులుపోగా స్వంతనిధులు 25 లక్షల రూపాయలకు తక్కువగా కల్గియున్న వాటిని బలహీనపు బ్యాంకులుగా వర్గీకరించిరి. కేంద్ర ప్రభుత్వం ఈ రకపు బ్యాంకులను పునరుద్ధరించుటకు ఒక పథకము చేపట్టినది. ఈ పథకము క్రింద బ్యాంకులకు అదనపు వాటాధనము, బకాయిలను తాత్కాలికముగా తట్టుకొనుటకు దీర్ఘకాలిక అప్పులు మరియు వాటికివున్న పారుబాకీల నిధికి-పారుబాకీలు, సందేహాస్పదపు అప్పుల మొత్తమునకు ఉన్న తేడా మొత్తమును గ్రాంటుగా యిచ్చుట ద్వారా సహాయము యివ్వబడుచున్నది. 1972-73 మరియు 73-74 సం॥లో ఈ పథకము క్రింద 118 లక్షల రూపాయలను 71 కేంద్ర సహకార బ్యాంకులకు మంజూరు చేయబడినది. ఈ సహాయము పొందిన బ్యాంకులలో, బకాయిలకు కారణములను పరిశీలించుట, ఉద్దేశపూర్వక బకాయిదారులపై చట్టరీత్యా కఠినచర్య తీసుకొనుటకు, పర్యవేక్షణను మరింత నిశితపరచుటకు ప్రతి పది సంఘములకు ఒక సూపరువైజరును నియమించుట, పరపతి విధానములను మెరుగుపర్చుట, మరింత నిశితంగా అభివృద్ధిని సాధించుటకు కొన్ని సంఘములను ఎంపికచేసి వాటిద్వారా సమగ్ర పరపతి, యితర సేవాసౌకర్యములను అందచేయుట, రిజర్వు బ్యాంకు ప్రతినిధితోనూ, రాష్ట్ర సహకార బ్యాంకు ప్రతినిధితోనూ, రాష్ట్ర సహకారశాఖ ప్రతినిధితోనూ కూడిన కమిటీ నొకదానిని ఈ పునరుద్ధరణ కార్యక్రమమును అమలుపరచుటలో ఉన్న అడ్డంకులను తొలగించుటకు నియమించుట మొదలగు కార్యక్రమములను ఈ పథకముద్వారా అమలు జరిపిరి. ఈ కార్యక్రమమును మన రాష్ట్ర సహకార బ్యాంకు సమర్థవంతముగా అమలు జరుపు చుండుటచే రాష్ట్రములోని అనేక బ్యాంకులు లాభపడుతువున్నవి, స్వయం శక్తివంతముగా రూపొందుతున్నవి.

## బ్యాంకుల ప్రగతిపథం

ఆయా జిల్లాలలో సహకార ఉద్యమం పటిష్ఠంగా రూపొందడానికి కేంద్ర సహకార బ్యాంకులు పుష్టిగావుండి సామర్థ్యంగా పనిచేయటం చాలా అవసరము. ఈ బ్యాంకు బలహీనంగా ఉంటే ఆ జిల్లాలో సహకార ఉద్యమం తగినంతగా అభివృద్ధి చెందలేదు. ఋణాలను యివ్వడంలో నూతన పద్ధతులనవలంబించుట. విభిన్న అవసరములకు పరపతి నందించుట, బ్యాంకులను నిర్వహించే సిబ్బందికి మారుతున్న అవసరముల కనుగుణంగా తగిన శిక్షణ యిచ్చుట డిపాజిట్లు సేకరణకు, బకాయిల వసూళ్ళకు మరింతగా కృషిచేయుట సభ్యత్వ సంఘములు వాటి వ్యవహారములను నడుపుకొనుటలో ఎప్పటికప్పుడు తగిన సలహాలు యిచ్చుట, వాటి అభివృద్ధికి మరింతగా కృషిచేయుట సంఘములను పర్యవేక్షించడంలోనూ తనిఖీ చేయడంలోనూ మరింత నైపుణ్యంగా వ్యవహరించుట, అనుబంధ సహకార సంఘముల సభ్యులు, పాలకవర్గ సభ్యులు. ఉద్యోగులు సహకారవిద్యా, శిక్షణ కార్యక్రమములందు పాల్గొనునట్లు ప్రోత్సహించుట, బ్రాంచి కార్యాలయ స్థానములందు తరచు సహకార సమావేశములను నిర్వహించి బ్యాంకు ఆర్థిక పురోభివృద్ధి గురించి, విధానముల గురించి కార్యక్రమముల గురించి తగు ప్రచారముచేసి ప్రజలకు బ్యాంకు పట్ల సద్భావము ఆదరణ పెరుగునట్లు కృషిచేయుట బ్యాంకుల ప్రగతికి తోడ్పడును.



# 13 ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సహకార బ్యాంకు

## (Andhra Pradesh State Co-operative Bank)

ప్రాథమిక పరపతి సంఘములకు ద్రవ్యవనరులు సమకూర్చడానికి కేంద్ర సహకార బ్యాంకుల స్థాపన ఎట్లా అవసరమయినదో, అదేవిధముగా కేంద్ర సహకార బ్యాంకులకు తగిన ద్రవ్యసహాయం అందించడానికి రాష్ట్ర స్థాయిలో రాష్ట్ర బ్యాంకుల స్థాపనకూడా అవసరమయినది. ఈ రాష్ట్ర బ్యాంకులు రాష్ట్రములో ని సహకార పరపతి ఉద్యమానికి నాయకత్వము వహించి, పరపతి విధానము లను రూపొందించి అమలుపరచును. రాష్ట్రములోని సహకార బ్యాంకులకు బ్యాంకరుగా వ్యవహరించి; వారి కార్యక్రమములను సమన్వయపరచుటకు అభివృద్ధి నిమిత్తము తగిన సలహాలు నిచ్చును. సహకార బ్యాంకులకు Clearing house వలె పని చేయును. జాతీయ వ్యవసాయ గ్రామీణాభివృద్ధి బ్యాంకుకు కేంద్ర సహకార బ్యాంకులకు మధ్యనవుండి సహకార సంస్థలకు కావలసిన నిధులను NABARD నుండి సమకూర్చును. అన్ని రాష్ట్ర సహకార బ్యాంకులను రిజర్వు బ్యాంకు షెడ్యూల్డు బ్యాంకులుగా గుర్తించినది.

ఆంధ్ర-తెలంగాణా ప్రాంతములు ఆంధ్రప్రదేశ్‌గా రూపొందిన తరువాత ఇది వరకటి ఆంధ్రరాష్ట్ర సహకార బ్యాంకు, హైదరాబాదు కో-ఆపరేటివు ఎపెక్సు బ్యాంకు 1963లో విలీనము కాబడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సహకార బ్యాంకుగా ఏర్పడెను. దాని వ్యవహారిక ప్రదేశము రాష్ట్రమున కంతటను ఉండును. దాని కేంద్ర కార్యస్థానము హైదరాబాదునందు నెలకొల్పబడెను. ప్రాంతీయ కార్యాలయములు విజయనగరం, ఏలూరు, తిరుపతి, ఒంగోలు. వరంగల్ మరియు హైదరాబాదులో పని చేయుచున్నవి.

### ముఖ్య ఉద్దేశ్యములు ;

1. రాష్ట్ర సహకార బ్యాంకుగా వ్యవహరించాలి.

2. సభ్యులకు ఋణము లిచ్చుటకుగాను డిపాజిట్ల రూపమున అప్పుల రూపమున, ఇతర విధముగాను ద్రవ్యవనరులను సేకరించుట.

3. గవర్నమెంటు ప్రోనోట్లను, ట్రస్టీ సెక్యూరిటీలను కొనుట, అమ్ముట

4. బ్రాంచీలను తెరచి బ్యాంకింగు వ్యాపారము చేయుట.

5. కేంద్ర సహకార బ్యాంకులను తనిఖీచేసి అభివృద్ధి నిమిత్తము తగు సలహాల నిచ్చుట.

6. సెంట్రలు బ్యాంకులను సమావేశపరచి వాటి పరిస్థితులను సమీక్షించుట, అభివృద్ధి పథకములను రూపొందించుట, అమలు పరచుట.

## సభ్యుల బాధ్యత

చెల్లించిన వాటా ధనమునకు పరిమితమైయుండును.

## సభ్యత్వము - వాటాధనము

రాష్ట్రములోని 27 కేంద్ర సహకార బ్యాంకులు రాష్ట్ర ప్రభుత్వము ఇందు సభ్యులుగా వుందురు. రాష్ట్రస్థాయీ-సహకార సమాఖ్యలు, ఇతర సహకారసంస్థలు, వ్యక్తులు నామ మాత్రపు సభ్యులుగా ఉందురు. వాటావిలువ ఒక్కొంటికి రూ. 100-లు బ్యాంకు Authorised Share Capital (అధీకృత మూలధనము) 15 కోట్ల రూపాయలు, 1981-82 నాట్కి చెల్లింపబడిన వాటా ధనము రూ. 11.595 కోట్లు.

## పాలక వర్గము :-

ప్రతి కేంద్ర సహకార బ్యాంకు అధ్యక్షుడు రాష్ట్ర సహకార బ్యాంకులో Ex-Officio డైరెక్టరుగా ఉండును. వీరుగాక రాష్ట్ర ప్రభు

త్వపు ప్రతినిధులు ముగ్గురు, బ్యాంకుయొక్క మేనేజింగు డైరెక్టరు కలిసి బ్యాంకు పాలకవర్గంగా వ్యవహరింతురు. కేంద్ర సహకార బ్యాంకుల ప్రతినిధులు తమలో నుండి ఒకరిని ప్రెసిడెంటుగాను, మరియొకరిని ఉపాధ్యక్షునిగాను ఎన్నుకొందురు. పాలకవర్గము కాలపరిమితి (జనవరి 1వ తేదీతో మొదలిడి డిసెంబరు 31వ తేదీతో అంతమగు) మూడు సంవత్సరములు.

## యిచ్చిన అప్పులు - Lendings

కేంద్ర సహకార బ్యాంకులకు మాత్రమే గాక, రాష్ట్రస్థాయీ సమాఖ్యలకు - రాష్ట్ర సహకార మార్కెటింగు ఫెడరేషన్, రాష్ట్ర వినియోగదారుల సమాఖ్య, కేంద్ర సహకార వ్యవసాయాభివృద్ధి బ్యాంకు, ఆంధ్రప్రదేశ్ చేనేత సంఘము (ఆప్కో) వను గిరిజన కార్పొరేషనుకు, రాష్ట్రస్థాయి మత్స్య పారిశ్రామిక సంఘములకు, పంచదార ఫ్యాక్టరీలకు ఉద్యోగుల సంఘములకు, కుటీర లఘుపరిశ్రమలకు ఋణపరపతి సహాయము చేయుచున్నది. స్వల్పకాలిక, మధ్యకాలిక అప్పులను, నగదు పరపతి అప్పులను మంజూరు చేయును. NABARD మంజూరుచేసిన ఋణ పరిమితులమండేగాక కేంద్ర సహకార బ్యాంకులకు తన స్వంత వనరుల నుండి ఋణవసతిని కల్పించును.

1981-82లో వ్యవసాయ ఋణములుగా రూ. 128.87 కోట్లు (మొత్తం ఋణములలో 69.60 శాతము); వ్యవసాయేతర ఋణములుగా రు. 29.92 కోట్లు పంపిణీచేసినది. 30-6-82 నాటికి కేంద్ర సహకార బ్యాంకులపై రూ 156.87 కోట్లు, ఇతర సహకార సంస్థలపై రు. 27.38 కోట్లు, వ్యక్తులపై రు. 0.58 కోట్లు మొత్తము రు. 184.83 కోట్లు ఋణములుగా ఉన్నవి.

కేంద్ర సహకార బ్యాంకులనుండి రావలసిన ఋణములు, పద్దుల వారీగా ఈ దిగువ వివరించబడినవి.

| ప్రయోజనము : 30-6-82 నాటికి | కోట్ల రూ॥లలో |
|---|---|
| 1) కాలమానపు వ్యవసాయ మదుపులకు (S,A.O. Loans) | 68-44 |
| 2) మధ్యకాలిక వ్యవసాయ రుణాలు | 3-59 |
| 3) మధ్యకాలిక మార్పిడి రుణాలు | 11-80 |
| 4) మధ్యకాలిక కాలవ్యవధి రుణాలు | 3-36 |
| 5) మధ్యకాలిక వ్యవసాయేతర రుణాలు | 0-19 |
| 6) చేనేత సంఘములకు పరపతి | 7-31 |
| 7) సహకార చక్కెర కర్మాగారములకు | 18-78 |
| 8) ఇతర ప్రయోజనములకు | 42-77 |
| 9) ఓవర్ డ్రాఫ్టులు, డిపాజిటుదార్లకు రుణాలు | 0-18 |
| మొత్తము | 156-37 |

బకాయిలు ; అసలు రు. 9.34 కోట్లు (7-6 శాతము): వడ్డీ రు. 0-4 కోట్లు (0-7 శాతము)

## డిపాజిట్లు - (Deposits)

బ్యాంకు డిపాజిట్లు, డిపాజిట్ భీమా మరియు క్రెడిట్ గ్యారంటీ కార్పొరేషన్ వారి హామీ కల్గియున్నవి. వాణిజ్య బ్యాంకులు యిచ్చు వడ్డీ రేటుకంటె ½% హెచ్చు వడ్డీ డిపాజిట్లపై యిచ్చుచున్నది. ఈ బ్యాంకు హైదరాబాదు నగరములో 2 శాఖలు, తిరుపతిలో 1 శాఖ కల్గియున్నది. 30-6-82 నాటికి బ్యాంకు డిపాజిట్లు రు. 106-35 కోట్లు.

## తీసుకొనిన ఋణములు - (Borrowings)

30-6-82 నాటికి రిజర్వుబ్యాంకుకు రూ. 66-22 కోట్లు: రాష్ట్ర ప్రభుత్వమునకు రు. 31-16 కోట్లు: A R D C నకు రు. 0-73 కోట్లు: I D B I నకు రు. 0-15 కోట్లు యివ్వవలసియున్నది.

## క్షేమనిధి మరియు యితర నిధులు

1981-82 లాభములతో బ్యాంకుకున్న క్షేమనిధి రు. 4-50 కోట్లు వ్యవసాయ పరపతి స్థిరకరణ నిధి రు. 11-99 కోట్లు; పారుబాకీల మరియు అనుమానాస్పదపు బాకీల రిజర్వు నిధి 0-77 కోట్లు.

## వ్యాపార ధనము - (Working Capital)

30-6-82 నాటికి బ్యాంకు వ్యాపారధనము రు. 248-16 కోట్లు వ్యాపారధనములో డిపాజిట్లు 43-74% తీసుకొనిన ఋణములు 40-40% స్వంత నిధులు 18-33% గా ఉన్నవి.

## ప్రత్యేక అభివృద్ధి పథకములు

ఈ బ్యాంకు 1968 నుండి సహకార కేంద్ర బ్యాంకుల శాఖల విస్తరణకు సబ్సిడీ పథకం అమలు జేయుచున్నది. 1981-82లో 28 శాఖలు తెరచినందుకు ఒక్కొక్క శాఖకు 12 వేల రూపాయలు సబ్సిడీగా ధనసహాయము చేసినది.

ఇంతియేగాక, 1980-81 సం॥ నుండి కేంద్ర సహకార బ్యాంకుల అభివృద్ధి నిధిని క్రొత్తగా ఏర్పాటుచేసి, నిర్వహించుటద్వారా బ్యాంకుల అభివృద్ధికి కృషి చేయుచున్నది.

1981-82లో మరియొక నూతన పథకమును ప్రాథమిక సహకార సంఘముల అభివృద్ధికి ప్రవేశ పెట్టినది. ఈ పథకము క్రింద ప్రతి కేంద్రసహకార బ్యాంకు వ్యవహారిక విస్తీర్ణములోని 5 ప్రాథమిక పరపతి సంఘములను ఎంపిక చేసి, ఒక్కొక్క సంఘమునకు రు. 2,500లు అప్పుగాను, రు. 2,500లు సబ్సిడీగాను ఆర్థిక సహాయము చేయుచున్నది.

1980-81 నుండి ప్రాథమిక సహకార పరపతి సంఘములు, సహకార మార్కెటింగు సంఘములు, గిడ్డంగులు నిర్మించు కొనుటకు "గ్రామీణ గిడ్డంగుల పథకమును" జాతీయ సహకార అభివృద్ధి కార్పొరేషన్ వారి తోడ్పాటుతో ప్రపంచబ్యాంకు ఋణ సహాయముతో అమలు జేయుచున్నది. ప్రభుత్వ సహాయముతో కేంద్ర సహకార బ్యాంకుల పునరుద్ధరణ కార్యక్రమమును 197. నుండి అమలు పరచుచున్నది.

20 అంశాల ఆర్థిక కార్యక్రమము క్రింద షెడ్యూల్డు కులముల వారికి 15% జాతులవారికి 5% పరపతి యిచ్చుటకు నిర్ణయించడమైనది. 30-6-82 నాటికి సల్పకాలిక పరపతి. షెడ్యూల్డు కులములవారికి రూ. 275-47 లక్షలు: షెడ్యూల్డు తెగలవారికి రు. 68-16 లక్షలు: మధ్యకాలిక పరపతి-షె.కు. వారికి 55-05 లక్షలు: షె.జా. వారికి రూ. 1-06 లక్షలు యివ్వబడినవి. 1981-82లో 10,000 షెడ్యూల్డు కులాల కుటుంబాలకు ఆర్థిక సహాయము అందించవలెనని లక్ష్యముగా పెట్టుకొనగా, 12,249 కుటుంబాలకు సహాయము చేయడమైనది.

మన రాష్ట్ర సహకార బ్యాంకు ఇంకనూ అనేక కారణముల వలన దేశములోని అత్యంత సమర్థవంతమైన బ్యాంకులలో ఒకటిగా పరిగణింపబడుతున్నది. 1981-82లో ఈ బ్యాంకు రు. 1-22 కోట్లు నికర లాభముతో పనిచేసినది, ఆడిట్‌లో 'A' తరగతి బ్యాంకుగా వర్గీకరింపబడినది.

# 14 దీర్ఘకాలిక పరపతి
## (Long term Credit)

రైతులను వడ్డీ వ్యాపారస్థుల కబంధహస్తముల నుండి విముక్తి లభింపజేయడానికి, సులభమైన షరతులతో కూడిన చౌకయైన వ్యవసాయ పరపతిని అందజేయుటకు గ్రామీణ సహకార పరపతి సంఘములను 1904వ సం॥లో మనదేశములో స్థాపించుట జరిగినది. సహకార పరపతి సంఘముల ద్రవ్యవనరులు స్వల్పకాలిక డిపాజిట్లు, ఋణములతోనూ కూడి వుండుటవలన రైతులు తమ పాత ఋణములను తీర్చుకొనుటకు వీలుగా సులభమైన వాయిదాలతో కూడిన పెద్దమొత్తములను దీర్ఘకాలిక ఋణములుగా మంజూరు చేయుటకు ఈ సంఘములకు సాధ్యపడలేదు. అందుచేత రైతుల ఋణభార సమస్య పరిష్కరింపబడలేదు. 1919 సం॥లో అప్పటి మద్రాసు రాష్ట్ర సహకార సంఘముల రిజిష్ట్రారు శ్రీ F. R. Hemingway I.C.S. రాష్ట్ర సహకార బ్యాంకులు డిబెంచర్లను అమ్మి దీర్ఘకాలిక ద్రవ్యవనరులను సేకరించవలెనని ఆ ధనమును దీర్ఘకాలిక ఋణములను మంజూరు చేయుటకు వినియోగించవలెనని సూచన చేసినారు. ఆచరణ యోగ్యము కాదని ఈ సూచనను కేంద్ర ప్రభుత్వము అంగీకరించలేదు. 1920 సం॥లో పంజాబ్ రాష్ట్రంలోని "ఝంగ్" అను గ్రామములో మొట్టమొదటగా భూమితనఖా బ్యాంకును స్థాపించడం జరిగింది. కాని ఈ బ్యాంకు జయప్రదంగా నిర్వహింపబడలేదు. 1925వ సం॥లో అప్పటి మద్రాసు రాష్ట్రములోని గుడ్లవల్లేరు (కృష్ణా జిల్లా, ఆంధ్రప్రాంతము) కాంచీపురములలో సరిఅయిన పద్ధతులలో స్థాపించబడి జయప్రదముగా నిర్వహింపబడుతున్న ప్రాథమిక సహకార భూమి తనఖా బ్యాంకులనే దేశములోని మొట్టమొదటి భూమి తనఖా బ్యాంకులుగా పేర్కొనవచ్చును. 1926వ సంవత్సరములో బొంబాయి రాష్ట్రములో మరి మూడు భూమి తనఖా బ్యాంకులను స్థాపించుట జరిగి

నది. టౌన్సెండ్ కమిటీ (Townsend commitee 1926) సిఫార్సు నంగీకరించి 1929వ సం॥లో మద్రాసు రాష్ట్రములో కేంద్ర సహకార భూమి తనఖా బ్యాంకును స్థాపించడంతో దీర్ఘ కాలిక పరపతి ఉద్యమానికి పునాది వేయడమైనది. దీనితో చెర్లను అమ్మి ప్రాథమిక తనఖా బ్యాంకులకు దీర్ఘ కాలిక ఋణవసతిని కల్పించుటకు కేంద్ర భూమి తనఖా బ్యాంకుల స్థాపన అవసరమయ్యెను. ఇతర రాష్ట్రములలో కూడా భూమి తనఖా బ్యాంకులను స్థాపించినారు. 1931వ సం॥లో ఆర్థికమాంద్యము ఏర్పడినప్పుడు, వ్యవసాయోత్పత్తుల ధరలు విపరీతముగా పడిపోవుటవలన రైతులు అధికముగా నష్టపడి ఋణగ్రస్తులైనారు. ఈ విపత్తు సమయంలో దీర్ఘ కాలిక ఋణములనిచ్చి ఈ బ్యాంకులు రైతులను ఆదుకొన్నవి.

దీర్ఘ కాలిక పరపతి నిచ్చుటకు ప్రత్యేక పరపతి వ్యవస్థను ఏర్పాటు చేయుటకు ఈ క్రింది కారణములను పేర్కొనవచ్చును.

1. సహకార పరపతి సంఘములు నిధులను స్వల్ప కాలిక ఋణములుగా సేకరించుట వలన ఆ నిధులను సభ్యులకు దీర్ఘ కాలిక రుణములుగా మంజూరు చేయుటకు వీలులేదు. దీర్ఘ కాలిక ద్రవ్య వనరులను సేకరించుటకు ప్రత్యేక వ్యవస్థను ఏర్పాటు చేయుట అవసరమని భావింపబడెను.

2. భూమిహక్కుల గురించి దస్తావేజులను సమగ్రంగా పరిశీలించుటకు, భూమిమీద అన్యాక్రాంతాలు లేవని తెలిసికొనుటకు, తనఖా పెట్టిన భూముల విలువను సరిగా లెక్కకట్టుటకు దీర్ఘ కాలిక పరపతిని సక్రమముగా నిర్వహించుటకు, ప్రత్యేక శిక్షణ పొందిన ఉద్యోగుల సేవలవసరము. ఈ ఉద్యోగులను నియమించుకొనే ఆర్థికశక్తి చిన్న సంఘములయిన గ్రామీణ పరపతి సంఘములకు లేదు.

3. గ్రామీణ పరపతి సంఘములకు దస్తావేజులను, రుణపత్రములను సురక్షితముగా దాయగల సదుపాయములు లేవు.

మొదట్లో ప్రాథమిక సహకార భూమి తనఖా బ్యాంకులు రైతుల ఋణభార సమస్యను తగ్గించుటకు, రైతులు తమ పాత అప్పులను తీర్చుకొనుటకు అప్పులిచ్చినను కాలక్రమేణా భూమి అభివృద్ధికి, బంజర్లను సాగులోనికి తీసుకురావడానికి యితర వ్యవసాయాభివృద్ధి కార్యక్రమములకు దీర్ఘకాలిక ఋణము లిచ్చుటకు ప్రాధాన్యత యిచ్చినవి. దేశంలోని ఆహార కొరత తీర్చడానికి వ్యవసాయాన్ని ఆధునికీకరణ చేయడంలోనూ, సేద్యపు నీటివనరులను పెంపొందించుటలోనూ సస్యవిప్లవాన్ని సాధించుటలోనూ దీర్ఘకాలిక ఋణ అవసరములనూ దీర్ఘకాలిక పరపతి సంస్థల కీలకమైన పాత్రనూ గుర్తించుట జరిగినది.

## ప్రాథమిక సహకార వ్యవసాయాభివృద్ధి బ్యాంకులు

## Primary Co-operative Agricultural Development Banks

1972వ సంగలో మన రాష్ట్రములో భూమి తనఖా బ్యాంకుల పేరును 'వ్యవసాయాభివృద్ధి బ్యాంకులు' గా మార్చిరి. ఈ బ్యాంకులు యితర రాష్ట్రములలో భూమి అభివృద్ధి బ్యాంకులుగా పిలువబడుచున్నవి.

ముఖ్య ఉద్దేశ్యములు;- సాధారణముగా 5 సంగల నుండి 15 సంగల వరకు భూమి తనఖాపై ఈ క్రింది కార్యక్రమములకు అప్పులు యివ్వబడును.

1. భూమిపై శాశ్వతమగు మరమ్మత్తులను చేయుటకు, భూమిని అభివృద్ధి పరచుటకు మెట్టభూములను మాగాణిగా మార్చుటకు,

2. చిన్నతరహా నీటిపారుదల సౌకర్యము ఏర్పరచుకొనుటకు, బావులు త్రవ్వుటకు, పాత బావులను మరమ్మత్తు చేసుకొనుటకు. పంపుసెట్లు ఆయిల్ ఇంజన్లు ఎలక్ట్రికల్ మోటార్లు కొనుగోలు చేయుటకు, పంట కాల్వలను నిర్మించుటకు,

3. ట్రాక్టర్లు, చెరకు క్రషర్ లు, ఇతర వ్యవసాయ యంత్రపరికరములను కొనుటకు.

4. కౌలుదార్లు వ్యవసాయ భూములను కొనుగోలుచేయుటకు.

5. పండ్ల తోటల పెంపకమునకు,

6. పాడిపరిశ్రమ, కోళ్ళ పెంపకం, పందుల పెంపకం, మత్స్య పరిశ్రమ, గొర్రెల పెంపకం పట్టు పరిశ్రమ మొదలగు వ్యవసాయ అనుబంధ వృత్తులను చేపట్టుటకు.

7. పొగాకు బ్యారన్ల నిర్మాణమునకు గోబర్ గ్యాస్ ప్లాంటుల స్థాపనకు పశువులశాలల నిర్మాణమునకు.

8 విద్యుచ్ఛక్తి డిపాజిట్లు కట్టడానికి, సహకార పంచదార ఫ్యాక్టరీలలో వాటాలు కొనడానికి.

9. యితర వ్యవసాయ అభివృద్ధి కార్యక్రమములకు.

వ్యవహార ప్రదేశము;- సాధారణముగా ఒక తాలూకాకు పరిమితమై ఉండును.

సభ్యుల బాధ్యత;- పరిమితిగల పూచీగా ఉండును.

వాటా ధనము ;- ఇందు A తరగతి B తరగతి అను రెండురక ముల వాటాలుకలవు 'A' తరగతి వాటా విలువ రూ. 10/- B తరగతి వాటావిలువ రూ. 1/- సభ్యులకు యిచ్చు అప్పులలో 6% నుండి 7½% వరకూ వాటా ధనముగా వసూలు చేయబడును.

సభ్యత్వము;- 18 సం॥లకు పైబడి బ్యాంకు వ్యవహార ప్రదే శములో భూమిని కల్గియుండి అర్హతకల్గిన వ్యక్తులు యిందు 'A' తరగతి

సభ్యులుగా చేర్చుకొనబడుదురు. బ్యాంకునకు హామీయుండబోవు ఆస్తి యందు హక్కుగల యితర్లు, మైనర్లు 'B' తరగతి సభ్యులుగా చేర్చుకొనబడుదురు.

నిధులు ;- 1. సభ్యులనుండి, ప్రభుత్వమునుండి వాటాధనము

2; కేంద్ర సహకార వ్యవసాయాభివృద్ధి బ్యాంకునుండి ఋణములు

3. ప్రభుత్వమునుండి సబ్సిడీలు

4. ప్రవేశ రుసుము యితర విధమగు జమలు

బ్యాంకు గరిష్ఠ ఋణాధికార పరిమితి ;- సాధారణముగా స్వంత నిధులకు 20 రెట్లవరకూ ఉండును.

సభ్యులకు యిచ్చు అప్పులు ;- సభ్యునకు సంపూర్ణహక్కు భుక్తములతోనున్న భూముల తనఖాపై అప్పు లివ్వబడును. ఆకట్టు భూమితోపాటు అప్పుతో కొనిన వ్యవసాయ పరికరములను, యంత్రములను బ్యాంకుకు అస్వాధీనపు తనఖా యివ్వాలి. పరికరములపై లేదా యంత్రములపై రైతు, సహకార బ్యాంకు జాయింటు పేర్లతో ఇన్సూరెన్సు పాలసీని తీసుకొని. దానిని బ్యాంకు పేర నమోదు చేయాలి.

కేంద్ర వ్యవసాయాభివృద్ధి బ్యాంకువారు ఏయే అవసరములకు. ఎంత కాలపరిమితికి, ఎంత అప్పు. ఏ యే షరతులకు లోబడి యివ్వవలయునో నిర్ణయింతురు. పెట్టుబడి స్వభావమునుబట్టి లేదా అప్పుతోకొన్న వస్తువు మన్నికనుబట్టి, పెట్టుబడివలన రైతుకు కలుగు అదనపు ఆదాయమునుబట్టి తీర్మానపు గడువు సాధారణంగా 5 సం॥ల నుండి 15 సం॥ల వరకు ఉండును.

## ప్రాథమిక వ్యవసాయాభివృద్ధి బ్యాంకులందు అప్పు దరఖాస్తును తయారుచేయుట-అప్పుమంజూరు చేయువిధము

అప్పు కావలసిన ప్రతీ రైతు బ్యాంకుచే నిర్ణయించబడిన నిర్ణీత ఫారములో అప్పుకొరకు ప్రాథమిక బ్యాంకు బిజినెస్ మేనేజరు / శెక్రటరిగార్కి దరఖాస్తు చేయవలెను. దరఖాస్తుదారుడు యింతకుపూర్వము ఆ బ్యాంకు సభ్యుడు కాకున్న, నిర్ణీతఫారములో వాటాధనము, ప్రవేశ రుసుముతోసహా సభ్యత్వము కొరకు దరఖాస్తు చేయవలెను. అప్పు దరఖాస్తు పరిశీలనకు మంజూరుకు సంబంధించి నిర్వహణ ఖర్చులను **(Administrative Charges)** బ్యాంకుకు చెల్లింపవలెను.

దరఖాస్తుదారుడు తనఖా పెట్టబోవు భూమి హక్కుకు సంబంధించిన దస్తావేజులు తన వంశవృక్షము, కుటుంబ సభ్యుల వివరములు, సహకార సంఘములకు మరియు యితరులకు యివ్వవలసిన ఋణ వివరములు. గ్రామ రెవెన్యూ లెక్కలకు సంబంధించి భూమి హక్కుదారుని తెలుపు 10 (1) పట్టా వివరములు. సాగుబడి వివరములు తెలుపు నెంబరు 2 అకౌంటు; ప్రభుత్వ శిస్తుబాకీ స్టేటుమెంటు, యిందుకు సంబంధించి గ్రామకరణము సర్టిఫికెట్ తనఖా ఆస్తి ఆంధ్రప్రదేశ్ భూ పరిమితిచట్టము ప్రకారము గరిష్ట పరిమితికి లోబడినదని సభ్యుని ఉత్తరము, భూమి తాలూకు సర్వేప్లాను, అప్పు ఏ వుద్దేశ్యమునకు దరఖాస్తు చేయబడినదో అట్టిపనికి సంబంధించిన ఖర్చు స్టేటుమెంటు యితర వివరములు అప్పు దరఖాస్తుతో జతపరచవలెను.

అప్పు దరఖాస్తు బ్యాంకుకు చేరినవెంటనే మేనేజరు దానిమీద సంతకముచేసి తేదీ వేయును. దరఖాస్తుతోపాటు కావలసిన పత్రము లన్నియూ ఉన్నదీ, లేనిదీ చూచుకొనవలెను. ఏ పత్రముకాని, వివరముకాని లోపించిన యెడల 15 రోజులలో ఆ లోటును భర్తీచేయవల

సినదిగా అప్పుదారుని కోరవలయును. అప్పు దరఖాస్తులన్నియూ, అవి బ్యాంకుకు వచ్చిన వరుసక్రమములో అప్పుదరఖాస్తు రిజిష్టరులో వ్రాయబడి అదేక్రమములో అప్పు దరఖాస్తులమీద చర్య తీసుకొనవలయును.

బిజినెస్ మేనేజరు సభ్యుడు తాకట్టుపెట్టిన భూమిపై అన్యాక్రాంతములు లేవని తెలుసుకొనుటకు "Encumbranee certificate" నిమిత్తము అప్పు దరఖాస్తు తేదీ నుండి 13 సం॥ల క్రితం వరకు సంబంధించి వివరములను యివ్వవలసినదిగా Sub-Registrar of Assurances ఆఫీసునకు దరఖాస్తు దాఖలు చేయవలెను.

E C. రాగానే అభ్యంతరములు లేనియెడల తాకట్టు ఆస్తిపై దరఖాస్తుదారునికి గల హక్కు విషయములను పరిశీలించుటకు Check Memo నొకదానిని తయారు చేయవలయును. దానియందు తనఖా ఆస్తి వంశపారంపర్యమా? లేక కొనుగోలు చేయబడినదా? ఎన్‌కంబరెన్సు సర్టిఫికెట్టులోని వివరములు 10 (1) అకౌంటులోని వివరములు నెంబరు (2) అకౌంటు వివరములు పొలము స్కెచి వివరములు యితర వివరములతో రికార్డుల ననుసరించి అప్పు దరఖాస్తు పరిశీలించబడును.

అప్పు మొత్తము 15 వేల రూపాయలు లోపయిన బ్యాంకునందలి సహకార సంఘముల సబ్‌రిజిష్ట్రారు, బ్యాంకు సూపరువైజరు ఫీల్డు తనిఖీను జరిపి జాయింటు నివేదికను అందచేయుదురు, సభ్యుడు కోరిన అప్పు మొత్తము, సభ్యుని నికరఆదాయము. యిచ్చిన అప్పును ఉపయోగించిన తరువాత అతనికి లభించే అదనపు ఆదాయము (Incremental income), సభ్యుని ఋణ తీర్మానపు శక్తి, భూమి విలువను, ఋణాల అవసరాన్ని అంచనావేసి అప్పు మొత్తమును సిఫార్సుచేసెదరు.

తాకట్టు ఆస్తివిలువ నిర్ణయించునప్పుడు గత మూడు సంవత్సరాలలో తాకట్టుభూమిని పోలిన భూముల అమ్మకముల సరాసరి విలువను

తాలూకా వేల్యుయేషను కమిటీవారు నిర్ణయించిన విలువను తీసుకొని ఏది సభ్యునికి లాభసాటిగా ఉండునో దానిని తీసుకొని భూమి విలువలో 50% మొత్తమునకు మించకుండా అప్పు యిచ్చుటకు నిర్ణయించవచ్చును.

తాకట్టు ఆస్తియొక్క అప్పటి విలువయేగాక అభివృద్ధి కార్యక్రమము అమలు జరిపిన తరువాత పెరుగు భూమి విలువను (Potential value of Land) కూడా పరిగణనలోనికి తీసుకొందురు. అప్పుదారుని ఋణ తీర్మానపుశక్తిని నిర్ణయించుటకు అభివృద్ధి కార్యక్రమము అమలు జరిపిన తరువాత అతనికివచ్చు అదనపు ఆదాయమును అంచనా వేస్తారు. (అదనపు ఆదాయములో 50% నుండి 75% వరకూ సభ్యుని ఆర్థికస్థితినిబట్టి సభ్యుని ఋణ తీర్మానపు శక్తిగా నిర్ణయింతురు.)

అప్పు మొత్తము, 15 వేల రూపాయలకు లోబడియున్నచో బిజినెస్ మేనేజరు సిఫార్సుపై కేంద్రసహకార వ్యవసాయాభివృద్ధి బ్యాంకు అసిస్టెంటు డెవలప్‌మెంటు ఆఫీసరు మంజూరు చేయును, బ్యాంకు పాలకవర్గము అప్పు మొత్తమును ఖరారు చేయును. అప్పు మొత్తము 15 వేల రూపాయలకు మించిన వ్యవసాయాభివృద్ధి బ్యాంకుల డిప్యూటీ రిజిస్ట్రారు లేదా కేంద్ర సహకార వ్యవసాయాభివృద్ధి బ్యాంకు ప్రాంతీయాధికారి స్వయముగా ఫీల్డు ఇన్‌స్పెక్షన్ జరిపి సిఫార్సు చేయుదురు. కేంద్ర వ్యవసాయాభివృద్ధి బ్యాంకు మంజూరు చేయును. కేంద్ర వ్యవసాయాభివృద్ధి బ్యాంకు సిబ్బంది అయిన లీగల్ అసిస్టెంటు దరఖాస్తుదారునికి భూమిపై గల హక్కును పరిశీలించెదరు. బ్యాంకు పాలకవర్గము మంజూరు చేసిన తర్వాత అప్పు బట్వాడా అగును.

అప్పు మంజూరు కాబడిన తరువాత, అప్పుదారుడు అప్పుపత్రమును బ్యాంకునకు వ్రాయవలయును: అప్పు మొత్తం రూ. 7500/-లకు లోపు అయినట్లయితే అప్పులో 5% :అంతకు మించినట్లయితే 7½% వాటా ధన

ముగా చెల్లించవలెను, 'Down payment' చెల్లించవలసి ఉన్నట్లయితే అ మొత్తము మేరకు కూడా చెల్లింపవలయును. సభ్యుడు వ్రాసిన తనఖా దస్తావేజును సెక్రెటరీ రిజిష్టరు చేసి, కాండు వ్రాసిన తేదినుండి 14 రోజు లలోపల దానినకలు Sub-Registrar of Assurances నకు పంపి రశీదు పొందును.

సభ్యుడు అప్పు పత్రమును వ్రాసిన తేదీనుండి నాలుగు నెలల లోపున రెండవసారి 'Encumbrance Certificate' ను పొందవల యును. దీనివలన సభ్యునిభూమి బ్యాంకుకు తనఖా పెట్టినట్లు ధృవ పడును, భూమి అభివృద్ధి నిమిత్తము అయినచో అప్పును రెండు వాయి దాలలో యిచ్చెదరు. మొదట యిచ్చిన అప్పు సద్వినియోగము చేయ బడిన తర్వాత ఆ మేరకు సూపరువైజరు సర్టిఫికెట్టు ఆధారముగా రెండవ వాయిదా అప్పు విడుదల చేయబడును; అప్పు వ్యవసాయ యంత్రపరి కరములు కొనుగోలు నిమిత్తము అయినచో కేంద్ర వ్యవసాయాభివృద్ధి బ్యాంకుచే ఆమోదింపబడిన కంపెనీ పేరున చెక్కు యివ్వబడి యంత్ర పరికరము సభ్యునకు అందచేయబడును.

## దీర్ఘకాలిక పరపతి నిర్వహణలో ఇటీవల వచ్చిన పరిణామములు

1. దీర్ఘకాలిక పరపతిని మంజూరు చేయుటకు బ్యాంకులు తనఖా పెట్టు భూమి విలువలో 50% విలువను ప్రాతిపదికగా తీసుకొనేవి. అభివృద్ధి చెందని భూములవిలువ తక్కువగా ఉండుటవలన సన్నకారు రైతులు అభివృద్ధి కార్యక్రమములను అమలు పర్చుటకు సరిపడు అప్పును పొందు టకు అర్హత కలిగియుండేవారు కాదు. 1970-71 నుండి ఈ పద్ధతిలో మార్పు వచ్చినది. అప్పు తీసుకొని అభివృద్ధి కార్యక్రమమును అమలు

పరచుటవలన భూమి విలువ సహజంగా పెరుగుతుంది. అందుచేత అభి వృద్ధివలన పెరగనున్న భూమి విలువ (Potential Valne of Land) ఆధారముగా ఇప్పుడు బ్యాంకులు ఋణములను మంజూరు చేస్తున్నాయి. ఈ విలువలో సన్నకారు రైతులకు 75% వరకూ అప్పులను మంజూరు చేస్తున్నారు. అభివృద్ధి చేయదలచిన భూమిని మాత్రమే రైతులు బ్యాంకుకు హామీయివ్వాలి. సన్నకారు రైతులకు యిచ్చు అప్పుల విషయములో బాగుచేయని భూమివిలువకు, అభివృద్ధిపరచబడిన తర్వాత వుండు భూమివిలువకు వుండు తేడాను లెక్కించుగట్టి ఆమేరకు రాష్ట్ర ప్రభుత్వము బ్యాంకులకు హామీ యిచ్చుచున్నది. భూమి బాగుపడి విలువ పెరిగిన తరువాత ప్రభుత్వ హామీ రద్దగును. 'D' ఫారం పట్టా దారులకుకూడా భూమి అభివృద్ధి నిమిత్తము అప్పులను మంజూరు చేయుచున్నారు.

2. వ్యవసాయ పరికరములు, యంత్రములు కొనుగోలు చేయుటకు యిచ్చు అప్పుల విషయంలో పరికరముల విలువ తనఖా భూమివిలువలో చేర్చి సభ్యుని ఋణార్హతను నిర్ణయించే సౌకర్యం ఇటీవల ప్రవేశపెట్టి నారు. చిన్న రైతులకు ఈ మొత్తము విలువలో 75% వరకూ పెద్ద రైతులకు 50% వరకూ ఋణమును మంజూరు చేయుచున్నారు. యంత్ర పరికరములను బ్యాంకుకు అదనపు హామీగా (అస్వాధీనపు తనఖా) యివ్వాలి. యంత్రపరికరములను అప్పు కాలపరిమితి వరకూ అప్పు మొత్తమునకు సభ్యుని మరియు బ్యాంకు పేర భీమాచేయించి పాలసీని బ్యాంకులో భద్రపరచవలెను.

3. ఇదివరలో సభ్యుని నికర ఆదాయము ప్రాతిపదికగా అతని ఋణ తీర్మానపుశక్తిని నిర్ణయించేవారు. 1971 నుండి రైతుకు పెట్టుబడికి పూర్వము వచ్చు రాబడికి పెట్టుబడి పెట్టిన తరువాత వచ్చు రాబడికి వ్యత్యాసమును తీసుకొని పెట్టుబడివలన రైతుకు వచ్చు అదనపు ఆదాయం

(Incremental income) ను అంచనావేసి అందులో 50% నుండి 75% వరకూ రైతుయొక్క ఋణతీర్మానపు శక్తిగా తీసుకొనుచున్నారు ఈ విధముగా రైతు పెట్టబోవు పెట్టుబడి ఆర్థికముగా లాభదాయక మగునా? కాదా? అని పరిశీలిస్తున్నారు లాభదాయకమయితేనే అప్పు మంజూరు చేయుట జరుగును.

4. తనఖా బ్యాంకులు స్థాపించిన మొదట్లో రైతులు పాత ఋణా లను తీర్చుకోనటం కోసం అప్పులిచ్చేవి. కాని 1965 సం॥ నుండి ఈ కార్యక్రమమునకు బ్యాంకులు అప్పులు యిచ్చుట నిలిపివేసినవి. రిజర్వు బ్యాంకువారు బ్యాంకులు యిచ్చు అప్పులలో 90% అప్పులు ఉత్పత్తి దోహద అవసరములకు 70% అప్పులను అభివృద్ధిని గుర్తించుటకు అను వుగావున్న కార్యక్రమములకు మాత్రమే అప్పులివ్వవలెనని ఆంక్ష విధించినారు. దాని ననుసరించి బ్యాంకులు చిన్న నీటిపారుదల సౌక ర్యము లేర్పరచుటకు, వ్యవసాయ యంత్రపరికరములు కొనుటకు, భూమి అభివృద్ధి కార్యక్రమములను అమలు పరచుటకు ఎక్కువ ప్రాధా న్యత యిచ్చుచున్నారు. Agricultural Refinance Development Corporation (A.R.D,C) సహాయముతో ఆయకట్టు అభి వృద్ధి కార్యక్రమములను అమలుపరుస్తున్నారు.

5. ఇటీవల పాడిపరిశ్రమ కోళ్ళ పెంపకం, గొర్రెల పెంపకం, పందుల పెంపకం, మత్స్య పరిశ్రమ మొదలగు వ్యవసాయ అనుబంధ వృత్తులను చేపట్టుటకు ఎక్కువగా ఋణములను (Diversified Credit) ఈ బ్యాం కులు మంజూరు చేస్తున్నాయి. వివిధ ప్రాంతముల అవసరముల కను గుణంగా ప్రత్యేక అభివృద్ధి పథకములను రూపొందించి అమలు పరుస్తు న్నాయి, వ్యవసాయాభివృద్ధికి ఎక్కువ కృషి చేస్తున్నాయి. కనుక ఈ బ్యాంకులకు ఇప్పుడు వ్యవసాయాభివృద్ధి బ్యాంకులుగాను, భూమిఅభివృద్ధి బ్యాంకులుగాను పిలుస్తున్నారు.

6. బ్యాంకులు క్రొత్త నూతులకు గొట్టపు బావులకు అప్పులు యిచ్చేటకు ముందు, ఆ ప్రదేశాలలోని భూజల సంపదకు సంబంధించిన వివరాల గురించి సాంకేతిక నిపుణుల (Ground water Director) వారిసలహాను. ఆమోదం (Clearance) తీసుకుంటున్నాయి. తీసుకున్న అప్పుతో త్రవ్విన సేద్యపుబావి పనికిరాకుండా పోయినప్పుడు, ఆ సభ్యుడు తీసుకున్న అప్పు చెల్లింపునుండి 25% మినహాయించే సౌకర్యం ఇటీవల ప్రవేశ పెట్టినారు.

7. అంతర్జాతీయ అభివృద్ధి సంస్థ (International Development Association) పథకముల క్రింద A.R.D.C. పథకముల క్రింద అప్పు పొందదలచిన రైతు తాను పెట్టబోవు పెట్టుబడిలో కొంత భాగము తన స్వంత నిధులనుండి (Down payment) భరించవలెను. ఈ Down payment సభ్యుడు బ్యాంకునకు చెల్లించు వాటాధనముతో కలిపి పెద్ద రైతుల విషయములో 20% వరకూ మధ్యతరగతి రైతుల విషయములో 10% వరకూ చిన్న రైతుల విషయములో 5% వరకూ చెల్లించవలసివుండును. చిన్న రైతులకు ఋణ కాలపరిమితిలో కూడా కొంత సడలింపువున్నది. భూమి అభివృద్ధికి యిచ్చు అప్పులు పెద్దరైతులు 2+3 సంవత్సరములలోనూ, చిన్న రైతులు 1+11 సం॥లలోనూ చెల్లించవలెను అలాగునే Tube wells Dug wells కు యిచ్చు అప్పులు పెద్దరైతులు 1+8 సం॥లలోనూ చిన్న రైతులు 1+11 సం॥లలోనూ చెల్లించవలెను. ఉపయోగించిన అప్పు, ఫలితము యిచ్చుటకు కొంత కాలము పట్టును గాన మొదటి సంవత్సరము ఫలన కాలము (Gestation Period) గా భావించిరి. ఆ కాలములో అప్పులకు వడ్డీ చెల్లించిన చాలును. మిగతా అప్పు వడ్డీ అసలు కలిపి సమాన వాయిదాలలో చెల్లించవలసి వుండును.

౪. ప్రాథమిక బ్యాంకులు యిచ్చు అప్పులలో 50% అప్పులు బలహీన వర్గపు సభ్యులకు యివ్వవలెనని కేంద్ర సహకార బ్యాంకు ఆదేశించినది. యీ మొత్తములో తిరిగి 15% మొత్తమును హరిజనులకు, 4% షెడ్యూల్డు తెగలకు యిచ్చుటకు సలహా యిచ్చిరి. S.F.D.A; D.P.A.P; C.A.D. పథకముల క్రింద యిచ్చు అప్పులలో సన్నకారు రైతులకు 25% పేద రైతులకు (Marginal Farmers) 33⅓% మొత్తమును సబ్సిడీగా యిచ్చుచున్నారు. అప్పులపై రైతులు చెల్లించవలసిన వడ్డీరేటు 11%. ప్రాథమిక సహకార బ్యాంకులు, సభ్యులు వాయిదా బకాయి మొత్తములను సకాలములో చెల్లించుటను ప్రోత్సహించుటకు సకాలములో చెల్లించబడిన వాయిదా మొత్తములపై 2% రిబేటును యిచ్చుచున్నవి.

## ఆంధ్రప్రదేశ్ కేంద్ర సహకార వ్యవసాయాభివృద్ధి బ్యాంకు

## (Andhra Pradesh Co-operative Central Agricultrural Developmeut Bank)

టౌన్ సెండ్ (Town Send) కమిటీ సిఫార్సుల ననుసరించి దేశములోని మొట్టమొదటి సహకార కేంద్ర వ్యవసాయాభివృద్ధి బ్యాంకు అప్పటి మద్రాసు రాష్ట్రములో 1929లో స్థాపించబడెను. రాష్ట్రములోని ప్రాథమిక భూమి తనఖా బ్యాంకుల సమాఖ్యగా వ్యవహరించుట, డిబెంచర్లను జారీచేయు బాధ్యతలను వహించి ప్రాథమిక బ్యాంకులకు దీర్ఘకాలిక నిధులను చేకూర్చుట ఈ బ్యాంకు లక్ష్యము. 1970 నాటికి దేశం మొత్తంమీద 19 కేంద్ర భూమితనఖా బ్యాంకులను స్థాపించుట జరిగినది. మన రాష్ట్రములలో దీర్ఘకాలిక పరపతి వ్యవస్థ సమాఖ్య (Federal) పద్ధతిలో ఉన్నది. కొన్ని రాష్ట్రములలో ఈ వ్యవస్థ నిర్మాణము యూనిటరీ పద్ధతిలో (Unitary System) ఉన్నది. యూనిటరీ పద్ధతిలో ప్రత్యేకముగా ప్రాథమిక బ్యాంకులు స్థాపించబడవు.

కేంద్ర సహకార తనఖా బ్యాంకు శాఖలే జిల్లా సాయిలో కాని తాలూకా స్థాయిలో కాని పనిచేస్తాయి.

1956లో ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర మేర్పడినప్పుడు మద్రాసు కేంద్ర భూమితనఖా బ్యాంకు విభజింపబడి, ఆంధ్ర కేంద్ర భూమితనఖా బ్యాంకు ఏర్పడెను. 1962లో ఈ బ్యాంకు తిరిగి హైదరాబాదు కేంద్ర భూమి తనఖా బ్యాంకుతో సంలీనము గావింపబడి ఆంధ్రప్రదేశ్ కేంద్ర భూమి తనఖా బ్యాంకుగా రూపొందినది. 1976లో ఈ బ్యాంకు పేరు ఆంధ్రప్రదేశ్ సహకార కేంద్ర వ్యవసాయాభివృద్ధి బ్యాంకుగా మార్చబడెను. ప్రస్తుతము ఈ బ్యాంకు 208 ప్రాథమిక వ్యవసాయాభివృద్ధి బ్యాంకుల సభ్యత్వముకలిగి పనిచేయుచున్నది, రాష్ట్ర ప్రభుత్వముతో కలిసి 219 మంది సభ్యులు, నిర్వహణ సౌలభ్యం కోసం కేంద్ర వ్యవసాయాభివృద్ధి బ్యాంకు రాష్ట్ర మొత్తంమీద 22 ప్రాంతీయ కార్యాలయాలను తెరచి నిర్వహిస్తోంది. ప్రాథమిక బ్యాంకులు ఆ ప్రాంతీయ కార్యాలయాల నియంత్రణకు లోబడి పనిచేస్తాయి.

నిధులు:- ఈ క్రింద తెలిపిన పద్ధతుల్లో నిధులను సేకరించును.

1. వాటాధనము - సభ్యత్వ సంఘములనుండి, ప్రభుత్వమునుండి

2. సంస్థ లాభములనుండి రిజర్వుఫండును యితర నిధులను ఏర్పరచును.

3. డిబెంచర్లు జారీచేయుటవలన.

4. జాతీయ వ్యవసాయ గ్రామీణాభివృద్ధి బ్యాంకునుండి, స్టేటు బ్యాంకు ఆఫ్ ఇండియా నుండి, రాష్ట్ర సహకార బ్యాంకునుండి.

5 ప్రవేశరుసుము - యితరములు.

## డిబెంచర్లు - (DEBENTURES)

కేంద్ర వ్యవసాయాభివృద్ధి బ్యాంకులు ముఖ్యముగా డిబెంచర్లను (Debentures) జారీచేయుటవలననే ఎక్కువగా నిధులను సేకరించును. డిబెంచర్లు అనగా దీర్ఘకాలిక ఋణపత్రములని చెప్పవచ్చును, ఈ పత్రములలో సొమ్ము యిచ్చినవారి పేరు, సొమ్ము తీసుకున్న బ్యాంకు పేరు. సొమ్ము తిరిగి యివ్వడానికి నిర్ణయించిన కాలపరిమితి, వడ్డీరేటు మొదలగు వివరములు ఉంటాయి. ఆరునెలల కొకసారి డిబెంచరుదారునకు వడ్డీ చెల్లిస్తారు, ప్రాథమిక తనఖా బ్యాంకులకు ఏవిధమైన అన్యాక్రాంతములేని భూములను తనఖా పెట్టుటవలన సభ్యులు అప్పులను పొందుదురు. కేంద్ర సహకార వ్యవసాయాభివృద్ధి బ్యాంకుకు ట్రాన్స్ఫరు కాబడిన ఈ తనఖా ఆస్తుల హామీమీదనే కేంద్రబ్యాంకు దీర్ఘ కాలిక డిబెంచర్లను (సాధారణముగా కాలపరిమితి 7 నుండి 15 సం॥అవరకు) విడుదలచేస్తున్నాయి ఒకేసారి విడుదలచేసిన డిబెంచర్లను కొన్నవారందరికి తనఖా ఆస్తులపై సమానహక్కు ఉండును. ఈ హామీగాక బ్యాంకు జారీచేసిన డిబెంచర్ల మొత్తమునకు అసలుకు, వడ్డీకి, రాష్ట్రప్రభుత్వం గ్యారంటీ (ప్రస్తుతము 500 కోట్లు రూ॥అవరకు) ఇస్తున్నది. ఈ విషయము కూడా డిబెంచరు పత్రంలో పేర్కొంటారు. డిబెంచర్లు Indian Trust Act క్రింద Trusty Securities గా గుర్తింపబడినవి. అంతేగాక 1938 Insurance Act క్రిందను 1948 Banking Companies Act క్రిందను Approved securities గా గుర్తింపబడినవి. డిబెంచరుదార్ల హక్కులను కాపాడుటకు రాష్ట్రసహకార సంఘముల రిజిష్ట్రారు ట్రస్టీగా యున్నారు, కేంద్ర వ్యవసాయాభివృద్ధి బ్యాంకు ముందుగా రాష్ట్ర ప్రభుత్వపు అనుమతిపొంది డిబెంచర్లను విడుదల చేయును,

కేంద్ర వ్యవసాయాభివృద్ధి బ్యాంకులు విడుదలచేయు డిబెంచర్లు

మూడు రకములు. 1. సాధారణ డిబెంచర్లు, 2. గ్రామీణ డిబెంచర్లు, 3. ప్రత్యేక అభివృద్ధి డిబెంచర్లు.

**సాధారణ డిబెంచర్లు** ;- ఈ డిబెంచర్లను కేంద్ర భూమి తనఖా బ్యాంకులు ప్రతీ సంవత్సరము ఒకేసారి కానీ, అనేక దఫాలుగాని విడుదల చేస్తారు. ఈ డిబెంచర్లద్వారా సేకరించే మొత్తము రిజర్వు బ్యాంకు, కేంద్ర. రాష్ట్ర ప్రభుత్వాలు నిర్ణయించిన మొత్తానికి పరిమితమై ఉంటుంది. వీటి కాలపరిమితి 10 లేదా 15 సంవత్సరాలు. వడ్డీ 5 లేక 6% ఉంటుంది. ఈ డిబెంచర్లను ముఖ్యంగా జీవితభీమా సంస్థ స్టేటు బ్యాంకు, రిజర్వు బ్యాంకు కేంద్ర రాష్ట ప్రభుత్వాలు ఇతర కేంద్ర తనఖా బ్యాంకులు వాణిజ్యబ్యాంకులు సహకార బ్యాంకులు కొంటాయి.

**గ్రామీణ డిబెంచర్లు** ;- ఈ డిబెంచర్లు గ్రామీణ ప్రజలకు గ్రామీణ సంస్థలకు (సహకార సంస్థలకు పంచాయితీలకు) అమ్ముటకు, ఈ విధముగా ఆ ప్రాంతముల మిగులు మొత్తములను సమీకరించుటకు ఉద్దేశింపబడినది. ఈ డిబెంచర్లను అమ్మవలెనని అఖిలభారత గ్రామీణ పరపతి సర్వే కమిటీ (1954) సిఫార్సు చేసింది.

రిజర్వు బ్యాంకు గ్రామీణ డిబెంచర్లను అమ్ముటను ప్రోత్సహించుటకు బ్యాంకులు విడుదలచేసిన డిబెంచర్లలో 8/15 వంతు డిబెంచర్లను కొనుటకు రిజర్వుబ్యాంకు అంగీకరించినది, గ్రామీణ ప్రాంతములలో అమ్ముటకు ఉద్దేశింపబడిన 7/15 వంతు గ్రామీణ డిబెంచర్ల కాలపరిమితి 7 సం॥లకు పరిమితమై ఉంటుంది. వడ్డీరేటు 6½%, రిజర్వుబ్యాంకు కొను 8/15 వంతు గ్రామీణ డిబెంచర్ల కాలపరిమితి 15 సం॥లు. రిజర్వు బ్యాంకు ఆ డిబెంచర్లపై 1% తక్కువ వడ్డీని అంగీకరించుటకు కూడా ఒప్పుకొన్నది, ఈ డిబెంచర్లకు రాష్ట్ర ప్రభుత్వము గ్యారంటీ ఉంటుంది, వడ్డీరేటు తక్కువ అగుటవలన ఈ డిబెంచర్ల అమ్మకము ప్రోత్సాహకర

ముగా లేదు, గ్రామీణ సేవింగు సర్టిఫికెట్లను అమ్ముటద్వారా, ఫిక్సెడ్ డిపాజిట్లద్వారా గ్రామాలలోని మిగులు ధనమును సేకరించుటకు బ్యాంకులు ఇటీవల కృషిచేస్తున్నాయి.

ప్రత్యేక అభివృద్ధి డిబెంచర్లు:- వానిని ప్రత్యేక అభివృద్ధి పథకములు అమలు నిమిత్తము జారీచేయబడును. ఈ డిబెంచర్లను వ్యవసాయ పరోక్ష సహాయక అభివృద్ధి సంస్థ (Agricultural Refinance and Development Corporation) ప్రస్తుతం NABARD రాష్ట్ర ప్రభుత్వము కలసి కొనుగోలుచేయును.

## ఋణ విమోచన నిధి - (Sinking Fund)

డిబెంచరుదార్లకు డిబెంచర్ల గడువు ముగిసిన వెంటనే వాటి మొత్తములను సకాలములో చెల్లించుటకు వీలుగా కేంద్ర తనఖా బ్యాంకులు ఒక నిధిని ఏర్పరచును. దీనినే Sinking Fund అని అందురు. డిబెంచర్ల కాలపరిమితి ముగియునాటికి ఆ నిధిలో డిబెంచర్ల బాపతు అసలు సొమ్ము అంతయూ చేరునట్లుగా ప్రతి సంవత్సరము బ్యాంకుచేయు అప్పుల వసూళ్ళలో కొంతభాగమును ఈ నిధికి జమచేయుదురు. ఈ మొత్తములను ప్రభుత్వ సెక్యూరిటీలలోగాని, ఇతర కేంద్ర భూమితనఖా బ్యాంకు డిబెంచర్లలో గాని invest చేయుదురు. అవసరము వచ్చినప్పుడు వాటిని నగదుగ మార్చి డిబెంచరుదార్లకు చెల్లించెదరు.

## వివిధ ప్రయోజనములకు ఋణసౌకర్యము

1982-83లో A P C A D B ఈ క్రింది కార్యక్రమములకు ఎదురుగా తెలిపిన మొత్తముల మేరకు ఋణములను అందజేసినది.

| సంఖ్య. | ప్రయోజనము | రూ॥లు కోట్లలో |
|---|---|---|
| 1. | బావులు | 15-74 |
| 2. | పంపుసెట్లు | 6-05 |
| 3. | ట్రాక్టర్లు, ఇతర వ్యవసాయ పరికరములు | 10-96 |
| 4. | సేద్యపు నీటిపారుదల పథకములకు (C.A.D,తో కలిసి) | 3-99 |
| 5. | పండ్ల తోటలకు | 3-55 |
| 6. | Diversified purposes | |
| | ఎ) పాడిపశువుల కొనుగోలుకు | 1-88 |
| | బి) గొర్రెల పెంపకం | 4-00 |
| | సి) కోళ్ళ పెంపకం | 0-84 |
| | డి) చేపల పెంపకం | 0-28 |
| | ఇ) ఎడ్లు, బళ్ళు కొనుగోలుకు | 5-49 |
| 7. | పట్టుపురుగుల పెంపకం | 2-12 |
| 8. | గోబర్ గ్యాస్ ప్లాంటుల పొయ్యిల స్థాపనకు | 0-17 |
| 9. | రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డుకు (బావులకు విదుచ్ఛక్తి ఏర్పాటుకు) | 9-90 |
| 10. | ఇతర అభివృద్ధి కార్యక్రమములకు | 4-80 |
| | మొత్తము | 69-58 |

## Refinance from NABARD

పై మొత్తములో 61-15 కోట్లు రూ॥లు జాతీయ వ్యవసాయ గ్రామీణాభివృద్ధి బ్యాంకునుండి Refinance సౌకర్యం గల ప్రత్యేక అభివృద్ధి పథకముల క్రింద, మిగతా రూ. 8-43 కోట్లు సాధారణ పథక

ముల క్రింద ఋణములుగా యివ్వబడినవి. 1982-83లో ప్రత్యేక అభివృద్ధి పథకముల అమలుకు NABARD నుండి రు. 51-52 కోట్లు ఋణముగా పొంది, NABARD నుండి Refinance సౌకర్యం వినియోగించుకొనడంలో మన రాష్ట్ర బ్యాంకు దేశములోని మిగతా రాష్ట్ర బ్యాంకులకంటే అగ్రగామిగా ఉన్నది.

## Loans for Weaker Sections

బ్యాంకు యిచ్చు అప్పులలో 60 శాతము వరకు బలహీనవర్గపు రైతులకు యిచ్చుటకు నిర్ణయించినది, తిరిగి 15% హరిజనులకు, 5% గిరిజనులకు యిచ్చుటకు ఏర్పాటు చేయడమైనది, 82-83లో యిచ్చిన 1,02,885 అప్పులలో 82,484 అప్పులు (86-8 శాతము అప్పులు) అప్పుల మొత్తములో 74% బలహీనవర్గముల వారికి యిచ్చుట ద్వారా యీ లక్ష్యములో ఈ బ్యాంకు మంచి ప్రగతి సాధించినది.

## Overdues - Regulation of Advances

30-6-83 నాటికి బ్యాంకు బకాయిలు అసలు 53-40%, వడ్డీ 36-20% ఉన్నవి. కనుక బకాయిల వసూలు విషయంలో ఈ బ్యాంకు ఇంకనూ ఎక్కువ కృషి చేయవలసి ఉన్నది.

మన రాష్ట్రములోని ప్రాథమిక వ్యవసాయాభివృద్ధి బ్యాంకులు 82-83లో రు. 91-99 కోట్లు, వసూలు చేయవలసి ఉండగా, వసూళ్లు రు. 46-83 కోట్లు, బకాయిలు రు. 45-16 కోట్లు (49 శాతము) ఉన్నది ప్రాథమిక వ్యవసాయాభివృద్ధి బ్యాంకుల అప్పులిచ్చే కార్యక్రమం-వసూలు కావలసిన ఋణమొత్తంలో అవి ఎంత మొత్తం వసూలు చేసాయనే దానిపై ఆధారపడి ఉంటుంది. రిజర్వుబ్యాంకు విధించిన ఈ ఆర్థిక క్రమశిక్షణ ప్రకారం బకాయిలు 25% కంటే తక్కువ ఉంటే ఆ బ్యాంకుల అప్పులిచ్చే కార్యక్రమములో ఎటువంటి నిర్బంధములు లేవు ఎంత

కుకు రోలింగు షీల్డు ద్వితీయ స్థానములో నిల్చిన పశ్చిమ గోదావరి జిల్లాలోని నరసాపురం బ్యాంకుకు వెండికప్పును యిచ్చి సత్కరించినది.

NABARD ఆర్థిక తోడ్పాటుతో ప్రాథమిక బ్యాంకుల ఉద్యోగులకు ప్రత్యేక శిక్షణ కార్యక్రమములను, పునశ్చరణ తరగతులను నిర్వహించుచున్నది. 1982-83లో బ్యాంకు రు. 1.45 కోట్లు నికర లాభముతో పనిచేసి ఆడిట్ లో A తరగతి బ్యాంకుగా వర్గీకరింపబడినది.

### 30-6-83 నాటి బ్యాంకు ఆర్థిక పరిస్థితి

| సంఖ్య | వివరములు | రూపాయలు కోట్లలో |
|---|---|---|
| 1. | అధీకృత వాటా మూలధనము | 20-00 |
| 2. | చెల్లించిన వాటాధనము | 12-28 |
| 3. | క్షేమనిధి | 10-58 |
| 4. | డిపాజిట్లు | 6-69 |
| 5. | 82-83లో జారీచేసిన డిబెంచరు | 64-30 |
| 6. | 30-6-83 నాటికి ఉన్న డిబెంచర్లు | 350-34 |
| 7. | ప్రభుత్వము నుండి ఋణములు | 5-00 |
| 8. | యిచ్చిన ఋణములు (Lendings) | |
| | ఎ) ప్రాథమిక వ్యవసాయాభివృద్ధి బ్యాంకులకు (82-83లో) | 69-68 |
| | బి) రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డుకు | 9-90 |
| 9. | ఎ) ప్రాథమిక బ్యాంకులపై నిల్వ ఉన్న అప్పులు | 275-54 |
| | బి) రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డుపై | 40-48 |
| 10. | మారుబాకీల నిధి | 2-42 |
| 11. | Sinking fund invested | 53-63 |
| 12. | ఇతర పెట్టుబడులు | 25-51 |
| 13. | ప్రాథమిక బ్యాంకులనుండి బకాయిలు | |
| | ఎ) అసలు (88-40 శాతము) | 38-82 |
| | బి) వడ్డీ (88-20 శాతము) | 9-28 |
| 14. | నికర లాభము | 1-65 |

# 15 పట్టణ సహకార బ్యాంకులు
## (Co-operative Urban Banks)

పట్టణములలోని చిన్న వ్యాపారస్తులకు, చేతివృత్తులవారికి పరిమిత ఆదాయములుగల మధ్యతరగతి ప్రజలకు, ఉద్యోగులకు అర్బను బ్యాంకులు పరపతి సౌకర్యములను కల్గించుచున్నవి. 1904 సంవత్సరపు సహకార పరపతిసంఘముల చట్టములోనే పట్టణములలో సహకార పరపతిసంఘములను స్థాపించుటకు అవకాశము కల్పింపబడినది. ఈ బ్యాంకులు/సంఘములు పరిమితిగల పూచీపై స్థాపింపబడును.

ముఖ్య ఉద్దేశ్యములు :- 1. సభ్యులకు ఋణములను మంజూరు చేయుటకు నిధులను సేకరించుట-సభ్యుల నుండి, యితరుల నుండి డిపాజిట్లను సేకరించుట.

2. బ్యాంకింగు సౌకర్యములు కల్గించుట-బ్యాంకింగు రెగ్యులేషను చట్టం ననుసరించి బ్యాంకింగు వ్యాపారము చేయుట.

3. సభ్యులయందు మితవ్యయము, పొదుపు, స్వయం సహాయమును పెంపొందించుట.

వ్యవహారిక ప్రదేశము :- సాధారణముగా అవి పనిచేయుచున్న పట్టణమునకు పరిమితమై ఉండును. పెద్ద పట్టణములయందు ఒకటికన్న ఎక్కువ అర్బను బ్యాంకులు పనిచేయుచున్న వాటి వ్యవహార ప్రదేశము పట్టణములోని కొంత ప్రాంతమునకు పరిమితము చేయబడును. అయితే, 1978లో రిజర్వుబ్యాంకుచే పట్టణ సహకార బ్యాంకులపై మాధవదాస్ అధ్యక్షతన నియమింపబడిన కమిటీ క్రొత్త బ్యాంకును రిజిష్టరు చేయుటకు ముందు ఆ బ్యాంకు 5 సం॥లలో స్వయం పోషకముగా, స్వశక్తివంతముగా (Economic Viabilityతో) అభివృద్ధి చెందుటకు అవకాశమున్నదీ లేనిదీ పరిశీలించవలసినదిగా సలహాయిచ్చిరి.

సభ్యుల బాధ్యత ;- వారు చెల్లించిన వాటాధనము మేరకు పరిమితమై వుండును.

వాటా ధనము :- 'A' తరగతి, 'B' తరగతి అను రెండు రకముల వాటాలు కలవు. 'A' తరగతి సభ్యులతోపాటు స్థిరాస్తి తనఖా పత్రములలో సంతకము పొందవలసిన వారిని, బంగారు నగల తాకట్టుపై అప్పు తీసుకొనువారిని 'B' తరగతి (నామమాత్రపు) సభ్యులుగా చేర్చుకొందురు. 'B' తరగతి సభ్యులకు ఓటింగు హక్కు ఉండదు. హక్కులు, బాధ్యతలు ఉండవు

నిధులు ;- 1. వాటాధనము. 2. డిపాజిట్లు. 3. కేంద్ర సహకార బ్యాంకు నుండి యితరులనుండి ఋణములు, 4. లాభముల నుండి కేటాయింపబడిన క్షేమనిధి యితర రిజర్వు నిధులు, 5. ప్రవేశరుసుము. 6. చందాలు. విరాళములు వగైరా.

డిపాజిట్లు ;- అన్నిరకముల డిపాజిట్లను అంగీకరించును. డిపాజిట్లపై వాణిజ్యబ్యాంకులు యిచ్చు వడ్డీకంటె 1% వడ్డీ ఎక్కువ యిచ్చును. చిట్ ఫండ్ పద్ధతులపైకూడా నిధులు సేకరించును. డిపాజిట్లు భీమా పథకము క్రింద ఒక్కొక్క ఖాతాదారుని డిపాజిట్టు 30 వేల రూ॥ల వరకూ భీమారక్షణ ఏర్పాటు ఉన్నది.

వ్యక్తి గరిష్ట ఋణాధికారము;- సభ్యులు బ్యాంకునందు కలిగియున్న వాటాధనమునకు 5 లేక 6 రెట్లవరకూ అప్పు లివ్వబడును. జామీనుపై రూ. 1,000/- స్థిరాస్తి తనఖాపై రు. 2,500/- నుండి రు. 5,000-/ వరకూ అప్పులు యివ్వబడుచున్నవి.

## యిచ్చు ఋణములు - (Lendings)

1. తనఖా అప్పులు:- సభ్యులకు చెందిన నిర్వివాదమైన స్థిరాస్తి

తనఖాపై అంచనా విలువలో 50% మొత్తమునకు మించకుండా, బైలా
లలో చెప్పబడిన వ్యక్తి గరిష్ట ఋణపరిమితికి లోబడి అప్పు యివ్వబడును.

2, ఫిక్సెడ్ డిపాజిటు హామీపైన 80% వరకూ అప్పు యివ్వ
బడును. గవర్నమెంటు ఋణపత్రముల హామీపైన, కేంద్ర వ్యవసాయా
భివృద్ధి బ్యాంకు డిబెంచర్ల హామీపైనకూడా అప్పు లివ్వబడును.

3, బంగారు నగల తాకట్టుపై వాటి విలువలలో 60% నకు మించ
కుండా అప్పు యిచ్చెదరు.

4. ఋణ గ్రహీత యొక్కయు, జామీనుదారుల యొక్కయు
వ్యక్తిగత సమిష్టి బాధ్యతలపైనకూడా అప్పులు మంజూరు చేయుదురు.

5. ఇండ్ల తనఖాలపై అప్పులు మంజూరు చేయుదురు.

6. ఇటీవల కుటీర పరిశ్రమలకు అర్బను బ్యాంకులు నగదు
పరపతి అప్పులను మంజూరు చేయుచున్నవి

డిపాజిటర్ల నగదు అవసరములను తీర్చుటకు బ్యాంకింగు రెగ్యు
లేషను చట్టము ననుసరించి మొత్తము డిపాజిట్లలో 5% నగదుగాను,
25% ద్రవ్యత్వపు ఆస్తులలోను నిధులను ఉంచవలయును.

## ఉద్యోగుల సహకార పరపతి సంఘములు
## (Employees Co-op. Credit Societies)

పబ్లిక్ సంస్థలలోగాని, ప్రయివేటు సంస్థలలోగాని, సహకార
సంస్థలలోగాని పనిచేయు ఉద్యోగులు తమ పరపతి అవసరములను తీర్చు
కొనుటకు స్థాపించుకొనిన సంఘములను ఉద్యోగుల సహకార పరపతి
సంఘములందురు. ఉదాహరణకు: సహకార బ్యాంకు ఉద్యోగుల సహ

కార సంఘము, పంచాయితీ సమితి ఉద్యోగుల సహకార సంఘము, జిల్లా పోలీసు ఉద్యోగుల సహకార సంఘము రైల్వే ఉద్యోగుల సహకార సంఘము, తంతి తపాలా ఉద్యోగుల సహకార సంఘము మొదలైనవి.

ఈ సంఘముల నియమావళి, సహకార పట్టణబ్యాంకుల నియమావళిని పోలియుండును. ఇవి పరిమిత పూచీపై పనిచేయును. వ్యక్తిగత జమీనుపై 24 నెలలకు మించకుండా నెలసరి వాయిదాలపై చెల్లించు ఋణములను మంజూరు చేయును. జీతములు పంపిణీచేయు అధికారికి, వారి జీతమునుండి ప్రతినెలా చెల్లించవలసిన మొత్తము తగ్గించి, సంఘమునకు చెల్లించు అధికారమును వ్రాతమూలకముగా అప్పు పొందిన ప్రతి సభ్యుడూ యివ్వవలెను. వాయిదాకు చెల్లించవలసిన మొత్తమును తగ్గించి, ప్రతినెలా సంఘమునకు చెల్లించవలసిన బాధ్యత జీతము పంపిణీ చేయు అధికారిపై వుండును. ఈ సంఘములలో ఋణవాయిదాతో పాటు సభ్యుని జీతమునుబట్టి ప్రతీనెలా 0-50 పైసలనుండి 5 రూపాయల వరకు సభ్యునినుండి పొదుపు డిపాజిట్టు వసూలు చేయబడును. ఈ విధముగా వసూలుకాబడిన మొత్తము కొంత మొత్తమైన తర్వాత ఫిక్సెడ్ డిపాజిట్టుగా మార్చెదరు.

కేంద్ర సహకార బ్యాంకులు ఈ సంఘములకు ఋణసౌకర్యము కల్గించును.

స్వంతనిధులు లక్ష రూపాయలు దాటిన ఉద్యోగుల సహకార సంఘములు బ్యాంకింగు రెగ్యులేషను చట్టము పరిధిక్రిందకు వచ్చును. అయితే ఈ సంఘములు సభ్యులు కానివారి నుండి డిపాజిట్లు స్వీకరించకుండుటకు అంగీకరించిన ఈ చట్టము పరిధినుండి మినహాయించబడును.

# 16 వాణిజ్య బ్యాంకులు

## వివిధ సంస్థలద్వారా వ్యవసాయ పరపతిని అందజేయుటకు విధాన నిర్ణయము

## Multi - Agency approach for Financing Agriculture

దేశములో ఏర్పడిన ఆహార కొరతను నివారించడంకోసం, ఆధునిక వ్యవసాయ పద్ధతుల ద్వారా వ్యవసాయోత్పత్తిని పెంచడానికి నిర్ణయించడమైనది. అయితే ఆధునిక వ్యవసాయ పద్ధతుల నవలంబించుటకు వ్యవసాయంలో అధిక పెట్టుబడి పెట్టవలసిన అవసరం ఉన్నది. 1969 వరకు ఒక వ్యవసాయ పరపతి సంస్థలు మాత్రమే. వ్యవసాయ పరపతిని అందించుచున్నవి ఉదాహరణకు 1966లో వాణిజ్య బ్యాంకులు యిచ్చిన మొత్తము ఋణములు 2847 కోట్ల రూ॥లు కాగా, వానిలో 5 కోట్ల రూ॥లు మాత్రమే వ్యవసాయ ఋణాలుగా మంజూరు చేసినవి. 67-68లో సహకార సంస్థలు 405 కోట్ల రూ॥ల వ్యవసాయ పరపతిని పంపిణీ చేసినవి.

1969లో అఖిలభారత గ్రామీణ పరపతి సమీక్షా సంఘమువారు నాల్గవ పంచవర్ష ప్రణాళిక ఆఖరునాటికి (73-74 సం॥ నాటికి) స్వల్పకాలిక పరపతి 2,000 కోట్లు, మధ్యకాలిక పరపతి 250 కోట్లు దీర్ఘకాలిక పరపతి 1600 కోట్ల రూపాయలు వ్యవసాయానికి అవసరమౌతుందని అంచనా వేసినారు. కాని సహకార పరపతి సంస్థలు 73-74 నాటికి స్వల్పకాలిక. మధ్యకాలిక పరపతిని, 750 కోట్ల రూపాయలను, దీర్ఘకాల పరపతిని 700 కోట్ల రూపాయలను పంపిణీ చేయుటకు లక్ష్యముగా నిర్ణయించుకున్నవి కనుక వ్యవసాయ పరపతి సరఫరాలో ఏర్పడిన వెలితిని (Credit gap) పూరించుటకు ఇతర వాణిజ్య బ్యాంకులు కూడ వ్యవసాయ పరపతిని అందించవలయునని సమీక్షా సంఘము సిఫార్సు చేసినది. ఈ సిఫార్సును కేంద్ర ప్రభుత్వము అంగీకరించి 1970 సంవత్సరము నుండి అమలు పరచినది.

## వ్యవసాయ పరపతి - వాణిజ్య బ్యాంకులు

మనదేశములో బ్యాంకింగ్ వ్యవస్థను, బ్యాంకుల పరపతి కార్య కలాపములను, ప్రణాళికా లక్ష్యాలకు అనుగుణంగా మలచుటకు 1965లో క్రెడిట్ ఆథరైజేషన్ స్కీమును ప్రవేశ పెట్టినారు. ప్రాధాన్య రంగా లయిన వ్యవసాయానికి, చిన్నతరహా పరిశ్రమలకు, ఎగుమతి వ్యాపార మునకు ఎక్కువ పరపతి సౌకర్యములను అందించవలయుననే సంకల్ప ముతో 1968లో బ్యాంకింగు వ్యవస్థమీద సామాజిక అజమాయిషీ (Social Control) పథకాన్ని ప్రవేశ పెట్టినారు. ఈ పథకంకూడ తృప్తి కలిగిన ఫలితాలను ఇవ్వని కారణంగా 19-7-1969న తేదీన దేశము లోని 14 పెద్ద పెద్ద పెద్యూల్డు వాణిజ్య బ్యాంకులను జాతీయం చేయడం జరిగినది. 1980లో మరో 6 బ్యాంకులను కూడా జాతీయము చేయ డమైనది.

సామాజిక నియంత్రణను (Social Control) ప్రవేశ పెట్టిన తరువాత వాణిజ్య బ్యాంకులు వ్యవసాయరంగానికి ఇచ్చిన పరపతి 1966-67లో యిచ్చిన 5 కోట్ల నుండి 1968-69 నాటికి 68-69 కోట్లకు పెరిగినది బ్యాంకులు జాతీయం కాబడిన తర్వాత ఈ మొత్తము 1974 జూన్ నాటికి 5386 కోట్ల రూపాయలకు పెరిగినది. 1968లో వ్యవసాయ రంగానికి ఎక్కువగా పరపతిని అందించుటకు తమకు సహాయపడటానికి వాణిజ్య బ్యాంకులు వ్యవసాయ ద్రవ్యసహాయ సంస్థ (Agricultural Finance Corporation) ను స్థాపించినవి.

వాణిజ్య బ్యాంకులు గ్రామ ప్రాంతాలలో సేకరించిన మొత్తం డిపాజిట్లలో 60 శాతము డిపాజిట్లను తిరిగి ఆ ప్రాంతాలకు అప్పుగా యివ్వవలెనని, మొత్తం బ్యాంకు యిచ్చు అప్పులలో 40 శాతము అప్పులు వ్యవసాయరంగంతోసహా ప్రాధాన్యతా రంగాలకు యివ్వవలెనని కేంద్ర ప్రభుత్వము నిర్ణయించినది.

# వ్యవసాయ పరపతి సంఘములను ఆర్థిక సహాయమునకై వాణిజ్య బ్యాంకులకు జతపరచుట

## Ceding of Agricultural Co-op. Credit Societies to Commercial Banks—1970

దేశమంతటా సహకార పరపతి ఉద్యమము సమానముగా విస్తరించి బలపడలేదు. ఎక్కడయితే కేంద్ర సహకార బ్యాంకులు బలహీనముగా ఉన్నవో, అక్కడ వాణిజ్య బ్యాంకులు ప్రాథమిక సహకార పరపతి సంఘములకు వ్యవసాయ పరపతి నందించవలెనని National Credit Council సిఫార్సు చేసింది. ఈ సిఫార్సుల ననుసరించి 5 రాష్ట్రములలోని 52 జిల్లాలలో ఎంపిక చేసిన 2140 ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘములను ఆర్థిక సహాయము యిచ్చుటకు వాణిజ్య బ్యాంకులకు 1970లో జతపరిచినారు ఈ పథకము అమలు పరచబడిన 5 రాష్ట్రములలో ఆంధ్రప్రదేశ్ ఒకటి. మన రాష్ట్రములో ఆర్థికంగా, బలహీనముగా ఉన్న కేంద్ర సహకార బ్యాంకుల నుండి ఎంపిక చేయబడిన 808 సహకార పరపతి సంఘములను విడదీసి వాణిజ్య బ్యాంకులకు జతపరచినారు. వాణిజ్య బ్యాంకు బ్రాంచీలలో ఉన్న సిబ్బందిని సంపూర్తిగా ఉపయోగించేటందుకు, పని కల్పించుటకుగాను ఒక్కొక్క బ్రాంచికి 10 ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘములను జతపర్చవలెను. వాణిజ్య బ్యాంకులు పరపతి నందచేయుచున్న సహకార పరపతి సంఘపు వ్యవహారిక విస్తీర్ణములోని గ్రామాలలో వాణిజ్య బ్యాంకులు నేరుగా వ్యక్తులకు పరపతి నిచ్చుట నిలిపివేసినవి. జతపరచబడిన పరపతి సంఘములు సామర్థ్యంగా పనిచేయుటకు పూర్తికాలపు వేతన కార్యదర్శిని నియమించుటకు ప్రోత్సాహం యివ్వటం జరిగింది. పరపతి సరఫరాలో ఏర్పడిన తీవ్రమైన కొరతను నివారించడానికి, ప్రాథమిక వ్యవసాయ సంఘములను ఆర్థికముగా పటిష్టపరచుటకు ఈ పథకము ఉద్దేశింపబడినది. సహకార

పరపతి సంస్థలు పటిష్టమయి వాటి కార్యాచరణ సామర్థ్యము పెంపొందింపబడిన తర్వాత విడదీయబడిన సహకార పరపతి సంఘములను తిరిగి కేంద్ర సహకార బ్యాంకులకు యిచ్చి వేయుటకు ఉద్దేశింపబడినది. ఈ పథకము తాత్కాలికమైనదిగా భావించడమైనది రాష్ట్రస్థాయిలో ఈ పథకమును సమన్వయపరచుటకు అభివృద్ధిని సమీక్షించుటకు ఒక కమిటీ ఏర్పాటు చేయబడును.

1979 జూన్ నాటికి దేశము మొత్తముమీద 2841 సహకార పరపతి సంఘములకు వాణిజ్య బ్యాంకులు 70 కోట్ల రూ॥లు ఆర్థిక సహాయము చేసినవి. అయితే, యిందులో 60 శాతము బకాయిలుగా నిల్చినవి.

ఈ పథకమువలన వాణిజ్యబ్యాంకులు యిచ్చిన వ్యవసాయ పరపతి మొత్తములో కొంత అభివృద్ధి కనపడినను వ్యవసాయ పరపతి కార్యక్రమమును నిర్వహించుటలో వాణిజ్య బ్యాంకులు సహకార బ్యాంకుల కన్న సమర్థవంతముగా పనిచేయలేక పోయినవని, అభివృద్ధిని సాధించలేక పోయినవని విమర్శ ఉన్నది. అందుచేత 1982 నుండి ఈ పథకమును విరమించడమైనది. అయితే, యిదివరకు వాణిజ్య బ్యాంకుల నుండి సహాయము పొందుతున్న సంఘములు తమకు యిష్టమైతే ఆ విధముగా కొనసాగవచ్చును.

## లీడ్ బ్యాంకు స్కీము (Lead Bank Scheme)

నేషనల్ క్రెడిట్ కౌన్సిల్, నారిమన్ కమిటీ సిఫార్సుల ననుసరించి 1969 డిసెంబరులో రిజర్వు బ్యాంకు లీడ్ బ్యాంకు స్కీమును ప్రవేశపెట్టింది. ఈ పథకం క్రింద దేశంలోని ప్రతిజిల్లాను ఒక వాణిజ్య బ్యాంకుకు కేటాయించడం జరిగింది. ఆ బ్యాంకు కేటాయింపబడిన జిల్లాకు లీడ్ బ్యాంకుగా వ్యవహరిస్తుంది. లీడ్ బ్యాంకు ఆ జిల్లాలోని

అన్నిరకముల పరపతి అవసరాలకు మరియు వనరుల సమీకరణకు, బ్యాంకింగు అభివృద్ధికి ఉన్న అవకాశాలను పర్వేచేయవలయును, జిల్లాలోని బ్యాంకులన్ని కలిసి ఒక సమాఖ్య (Consortium) గా పరిగణింపబడి, ఆ సమాఖ్యకు లీడ్ బ్యాంకు నాయకత్వము వహిస్తుంది. ఇతర బ్యాంకుల సహాయ సహకారములతో, ఆ జిల్లా ప్రత్యేక అవసరములదృష్ట్యా వ్యవసాయము, పరిశ్రమలు, వాణిజ్యము, వ్యాపారం మొదలయిన రంగాల అభివృద్ధికి ప్రత్యేక పథకాలను (District Credit Plan ; Annual action Plan)రూపొందించి అమలుపరచును. జిల్లాలో బ్యాంకుల బ్రాంచిలను స్థాపించవలసిన స్థలాలను ఎంపికచేసి యితర బ్యాంకులతో కలసి బ్యాంకింగు సౌకర్యాల విస్తరణకు కృషి చేయును.

వ్యవసాయ పరపతిని ఎక్కువగా యిచ్చుటకు వీలుగా వాణిజ్య బ్యాంకులు గ్రామీణ ప్రాంతములలో బ్రాంచీలను ఎక్కువగా స్థాపించుచున్నవి. అంతియేగాక, ప్రత్యేక వ్యవసాయాభివృద్ధి శాఖలనుకూడా తెరచుచున్నవి. బ్యాంకులు జాతీయము కాబడినప్పటికి (1969లో) 8200 కార్యాలయశాఖలు మాత్రమే ఉండగా నేటికి దాదాపు 30,000 కార్యాలయశాఖలు కల్గిఉన్నవి. జాతీయకరణకు ముందు బ్రాంచీకి సగటు జనాభా 65,000 ఉండగా నేటికి ఆ సంఖ్య 16,000 తగ్గింది.

వాణిజ్యబ్యాంకులు వ్యవసాయ అవసరములకు వ్యక్తులకు నేరుగాను సహకార సంస్థలద్వారా పరోక్షముగాను (Direct and indirect finance) పరపతి అందజేయుచున్నవి. స్వయం ఉపాధి కల్పనకు వ్యక్తులకు ఋణాలను మంజూరు చేస్తున్నాయి. చిన్న వ్యక్తులకు వాణిజ్య బ్యాంకులు యిచ్చిన ఋణాలకు నష్టము రాకుండా హామీ యిచ్చేందుకు 1971లో జాయింటు స్టాక్ కంపెనీల చట్టం క్రింద క్రెడిటు గ్యారంటీ కార్పొరేషను రిజర్వుబ్యాంకు స్థాపించింది.

వాణిజ్య బ్యాంకులు వ్యవసాయ పరపతిని ఎక్కువగా యిచ్చుట మొదలుపెట్టి నప్పటినుండి ఈ బ్యాంకుల కార్యక్రమములకు సహకార పరపతి పంపిణీలో సమన్వయం చేకూర్చుటకు రెండు వ్యవస్థలమధ్య అవగాహనను సామరస్యాన్ని పెంపొందించుటకు రాష్ట్రస్థాయిలోనూ జిల్లా స్థాయిలోనూ సమన్వయ కమిటీలను (Consultative Committees) ఏర్పరచినారు.

## ప్రాంతీయ గ్రామీణ బ్యాంకులు
## (Regional Rural Banks)

సహకార పరపతి వ్యవస్థ దేశమంతటా సమానంగా అభివృద్ధి చెందలేదు. చాలా రాష్ట్రములలో కేంద్రసహకార బ్యాంకులు ప్రాథమిక సంఘములు ఆర్థికంగా పటిష్టపడి, సామర్థ్యంగా పనిచేయక పోవుట వలన గ్రామీణ పరపతి అవసరములు తీరలేదు. బ్యాంకుల జాతీయికరణ తర్వాతకూడా గ్రామీణ పరపతి సరఫరాలో ఏర్పడిన వెలితి పూరించ బడలేదు. గ్రామీణ ఋణ వ్యూహాన్ని సంస్కరించడానికి, బలహీన వర్గములవారికి ఋణవసతులను మరింత విస్తృతపరచి గ్రామాలలోని పేదరికమును రూపుమాపుటకు ప్రాంతీయ గ్రామీణ బ్యాంకులను స్థాపించుటకు కేంద్ర ప్రభుత్వము నిర్ణయించినది. 1975 అక్టోబరు రెండవ తేదీన గాంధీజీ జయంతి రోజున దేశములోని వివిధ ప్రాంతములలో 5 గ్రామీణ బ్యాంకులు పనిచేయుట ప్రారంభించినవి. నేటికి 270 జిల్లాలలో 159 ప్రాంతీయ గ్రామీణ బ్యాంకులు 7,000 బ్రాంచీలద్వారా పనిచేయుచున్నది.

మన రాష్ట్రములో మొదట మూడు ప్రాంతీయ బ్యాంకులు స్థాపించబడినాయి. తెలంగాణా ప్రాంతములో నాగార్జున గ్రామీణ బ్యాంకు (ఖమ్మం), ఆంధ్రప్రాంతములో విశాఖ గ్రామీణబ్యాంకు

(విశాఖపట్టణం) రాయలసీమ ప్రాంతములో రాయలసీమ గ్రామీణ బ్యాంకు (కడప). అయితే, ఇప్పుడు ఎంచుమించు అన్ని జిల్లాలలో ఈ బ్యాంకులు స్థాపింపబడుతున్నాయి/పనిచేస్తున్నాయి.

గ్రామాలలోని బలహీనవర్గముల ఆర్థికాభివృద్ధికి అనేక పథకము లను రూపొందించి అమలుపరచుటద్వారా వారి జీవనస్థాయిని పెంచుటకు దరిద్ర్య నిర్మూలనకు ఈ బ్యాంకులు సహాయపడతాయి. సహకార బ్యాంకులు, వాణిజ్యబ్యాంకులు అందించే సేవలకు అవరోధం కాకుండా వాటికి తోడ్పాటుగా పరపతి వెలితిని (Credit Gap) పూరించే సంస్థ లుగా పనిచేయును. ఈ బ్యాంకులు యిచ్చే ఋణములు సన్నకారు రైతులకు, వ్యవసాయ కూలీలకు గ్రామీణ చేతివృత్తులవారికి యితర బలహీనవర్గములకు మాత్రమే అందచేయుటకు ఉద్దేశింపబడినవి, ప్రజలకు అన్నిరకముల బ్యాంకింగు సౌకర్యములను అందచేయును. కేంద్ర సహ కార బ్యాంకులు బలహీనముగా వున్నచోట్ల ప్రాథమిక వ్యవసాయ పర పతి సంఘములకు ఋణ సౌకర్యములను కల్గించును. ప్రాథమిక సహ కార సంఘములద్వారా, లేక వ్యక్తులకు నేరుగా, విడిగా లేక ఉమ్మ డిగా ఋణములను మంజూరు చేయును. సహకార సంస్థలవలె ప్రజలకు సన్నిహితంగా వుండి వాణిజ్య బ్యాంకులవలె నిర్వహణ సామర్థ్యం కలిగి పనిచేయుట ఈ బ్యాంకుల లక్ష్యము. బ్యాంకు సిబ్బంది జీతాల స్వరూ పము ఆ ప్రాంతపు గ్రామీణ సాంఘిక జీవనమున కనుగుణముగా రాష్ట్ర ప్రభుత్వపు ఉద్యోగుల జీతభత్యములతో సమానంగా ఉండును. హామీ ఇవ్వలేని వ్యక్తులు బ్యాంకులనుండి ఋణవసతిని పొందలేక పోతున్నారు. కనుక ఈ వర్గములవారికి సెక్యూరిటీ ప్రమేయం లేకుండా, గ్రామాలలో జరిగే ప్రతీ ఉత్పత్తి కార్యక్రమానికి ఆర్థిక సహాయం అందించవలెనని ప్రభుత్వ ఉద్దేశ్యము. అందుకు ఈ బ్యాంకులు విస్తృత పరిధిలో వివిధ గ్రామీణ పరిశ్రమలకు పాడిపరిశ్రమ, కోళ్ళ పెంపకం, మత్స్యపరిశ్రమ

మొదలైన వివిధ వ్యవసాయ అనుబంధ వృత్తులను చేపట్టుటకు స్వయం పోషక ఉపాధిని కల్పించుకొనుటకు వివిధ ఉపవృత్తులను చేపట్టుటకు బలహీనవర్గముల వారికి రుణసదుపాయం కల్పిస్తున్నవి.

ప్రతి గ్రామీణ బ్యాంకు ఒక వాణిజ్యబ్యాంకు (Sponsoring Bank) ఆధ్వర్యాన నెలకొల్పడం జరుగుతుంది. ప్రాంతీయ గ్రామీణ బ్యాంకుకు అనుమతించిన మూలధనం 1 కోటి రూ॥లు, చెల్లింపబడిన వాటాధనం 25 లక్షలు. ఇందులో 50% కేంద్ర ప్రభుత్వము, 15% రాష్ట్ర ప్రభుత్వము, 35% ఈ బ్యాంకును ప్రతిపాదించిన వాణిజ్యబ్యాంకు తీసుకొనును. 1977లో నియమింపబడిన దంతవాలా కమిటీ ప్రాంతీయ గ్రామీణ బ్యాంకులలో స్థానిక ప్రజలకు కూడా భాగస్వామ్యము, 20% వాటాలు యివ్వవలెనని సిఫారసు చేసినారు. ఈ బ్యాంకు పరిపాలనకు చైర్మన్ గాక ఎనిమిదిమంది డైరెక్టర్లు ఉంటారు. చైర్మన్‌ను కేంద్ర ప్రభుత్వము నియమిస్తుంది.

ప్రాంతీయ గ్రామీణబ్యాంకు సాధారణముగా ఒకటి లేక రెండు జిల్లాలకు 10 నుంచి 15 లక్షల జనాభాకు ఒకటి స్థాపింపబడినది. ఒకొ్కక్క బ్యాంకు 60 నుండి 75 బ్రాంచీలు తెరచి పదివేల జనాభాకు ఒక బ్రాంచి చొప్పున పనిచేయుట లక్ష్యముగా కల్గియున్నది.

**Commentary:-** వ్యవసాయ పరపతిని సహకార బ్యాంకులు, వాణిజ్య బ్యాంకులు ప్రాంతీయ గ్రామీణ బ్యాంకులుకూడా యిచ్చు చున్నవి కనుక. ఈసంస్థల కార్యకలాపములలో సమన్వయము అవసరము సంస్థలమధ్య అనవసరమైన పోటీ లేకుండా అవగాహనతోనూ సామరస్య ముతోనూ జాతీయ లక్ష్యములను దృక్పథంలో ఉంచుకొని బ్యాంకులు పనిచేయుటముఖ్యము, వివిధ బ్యాంకు బ్రాంచీలకు, తమ కార్యక్రమ

ములను సాంద్ర పద్ధతిలో అమలు చేయుటకు ప్రాదేశిక విభజనచేయుట మంచిది. సహకార సంస్థలు నిర్లక్ష్యం చేసిన రంగాలకు గ్రామీణ చేతి వృత్తులవారికి, మార్కెటింగు, ప్రోసెసింగు, వినియోగ అవసరములకు వాణిజ్య బ్యాంకులు, గ్రామీణ బ్యాంకులు ఎక్కువగా ఋణ వసతిని కల్పించుట ముఖ్యము.

గ్రామీణ ఆర్థిక నిర్మాణానికి, అభివృద్ధికి ప్రాథమిక సహకార పరపతి సంఘములు ఉపయోగపడునని అందరూ భావించడం జరిగినది. కనుక అన్ని బ్యాంకులు ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘములను బలపర్చుటకు తమ విధానాలను రూపొందించుకొనవలెను. అన్ని అభివృద్ధి కార్యక్రమములకు, వ్యక్తులకు నేరుగా అప్పులు ఇచ్చుటకంటె పరోక్ష పద్ధతిని సహకార సంఘములద్వారా పరపతి అందజేయుట మంచిది. ప్రాంతీయ గ్రామీణ బ్యాంకులు, వాణిజ్య బ్యాంకుల యాజమాన్యం చాలావరకూ ప్రభుత్వానిదే కనుక ప్రాంతీయ గ్రామీణ బ్యాంకులు వున్నచోట, వాణిజ్య బ్యాంకుల గ్రామీణ బ్రాంచీలను; ప్రాంతీయ గ్రామీణ బ్యాంకుల బ్రాంచీలతో సంలీనము చేయుటవలన, బ్యాంకుల మధ్యనున్న అనవసర పోటీ, గందరగోళము తగ్గును.



# 17 సహకార సంస్థల సభ్యులు

సహకార సంఘములు, ప్రజాస్వామ్య సంస్థలు, సభ్యుల స్వంత సంస్థలు, స్వతంత్ర ప్రతిపత్తిగల సంస్థలు, సభ్యులు, ఉత్పత్తిదారులుగా కాని, వినియోగదారులుగా కాని, తమకున్న సమష్టి అవసరములు సకాలములో ఆర్థికంగా లాభదాయకంగా సంస్థద్వారా పొందుటకు సంస్థలను స్థాపించుకొనుచున్నారు, సభ్యుల అవసరములే సంస్థ సృష్టికి కారణము. ఎవరి అవుసరములు ఉమ్మడి సంస్థ సృష్టికి కారణము అయినదో వారి చేతులలోనే సంస్థ పాలనాధికారము ఉండుటవలన సంస్థ తన లక్ష్యములను త్వరితంగా సమర్థవంతముగా సాధించుటకు వీలగును. సహకార సంఘం ప్రాథమిక లక్ష్యం న్యాయమైన ధరకు (At reasonable Cost) సభ్యుల అవుసరములను తీర్చుటే. అయితే, ఈ లక్ష్యం సంస్థను స్థాపించినంతమాత్రాన నెరవేరదు. సంస్థకు నిజ యజమానులైన సభ్యులే సంస్థ కార్యకలాపములలో ఉత్సాహంతో పాల్గొని తమ సంస్థలు తమకు సేవలందించునట్లు, సహాయపడునట్లు సమర్థవంతముగా నిర్వహించుకొనవలెను. సంస్థల కార్యకలాపముల వలన, నిర్వహణలో జరిగే మంచి చెడ్డల వలన, లాభనష్టములు సభ్యులకే వర్తించును గాన, సభ్యులు తమ ప్రయోజనములు కాపాడుకొనుటకు తామే శ్రద్ధ వహించవలసియున్నది. ఇందుకు సహకార సంఘముల చట్టములో సంఘ నిబంధనావళిలో సభ్యులకేర్పరచిన హక్కులు, బాధ్యతలు ప్రతి సభ్యుడు తెలుసుకొనవలసియున్నది, సంఘ నిబంధనావళి ప్రతిని ప్రతి సభ్యుడుకొని, తప్పక చదువవలసినది. సంఘ సక్రమ నిర్వహణలో తన పాత్రను పూర్తిగా అర్థం చేసుకొనవలసింది, తమకున్న చాలా హక్కులు మహాజనసభలో స్వయముగా పాల్గొని యితర సభ్యులతో కలసి వినియోగించవలసి యున్నది, హాజరయిన సభ్యులలో ఎక్కువమంది ఏది సరియైనదని తీర్మానిస్తారో ఆ నిర్ణయాన్ని అమలు పరచటం జరుగుతుంది, దానికి సభ్యుడు బద్ధుడై ఉండాలి,

## సభ్యుల హక్కులు

1) సభ్యత్వ అర్హత కల్గిన ప్రతివ్యక్తి సహకార సంఘములో సభ్యుడుగా చేరవచ్చును. (సెక్షన్ 19, 19 (2A))

2) ప్రతి సభ్యుడు సంఘము యొక్క సేవా సౌకర్యములు పొందవచ్చును. అందుకు సంఘమునకు దరఖాస్తు చేసుకొనవచ్చును. (సె: 22)

3) ప్రతి సభ్యునకు ఒక ఓటుకలదు అతడు దానిని మహాజన సభలో స్వయముగా పాల్గొని వినియోగించవచ్చును. మహాజన సభకు, సంఘపు నిర్వాహణలో తుది అధికారము ఉన్నది. మహాజన సభలో పాల్గొనుట వలన సభ్యుడు ఈ క్రింది విషయములలో యితర సభ్యులతో కలిసి సరి అయిన నిర్ణయాలు తీసుకొని తన సంక్షేమమును కాపాడుకొనవచ్చును. సంఘ అభివృద్దిని పెంపొందింప వచ్చును.

ఎ) సేవానిరతి, నిజాయితీ కల్గిన కమిటీసభ్యులను ఎన్నుకొనవచ్చును. అవసరమనుకొంటే ఎన్నికైన కమిటీ సభ్యులను తొలగించ వచ్చును.

బి) రిజిష్ట్రారుకు పంపవలసిన వార్షిక రిపోర్టును పరిశీలించవచ్చును.

సి) ఆడిట్ రిపోర్టు పరిశీలించి ఆమోదించవచ్చును. లోపభూయిష్ట ముగా ఉన్న ఆ రిపోర్టును తిరస్కరించుట ద్వారా సరిఅయిన రిపోర్టు, సరియయిన లెక్కలు ఉండునట్లు చూచుకొనవచ్చును.

డి) నికరలాభములను పరిష్కరింపవచ్చును.

ఇ) సంఘ ప్రయోజనములకు ప్రతికూలముగా ప్రవర్తించు సభ్యుని బహిష్కరింప వచ్చును.

యఫ్) ఆదాయ వ్యయముల వార్షిక బడ్జెటును పరిశీలించి ఆమోదించుట ద్వారా అనవసర ఖర్చులను తగ్గించవచ్చును,

జి) పాలకవర్గ సభ్యులు, వారి దగ్గర బంధువులు తీసుకొన్న అప్పులను, వాటిని వసూలు చేయుటలో నున్న లోపాలను సమీక్షించి రిజిష్ట్రారుకు రిపోర్టు పంపుటద్వారా అధికార దుర్వినియోగమును అరికట్టవచ్చును. (సె॥ 25, 30.)

4) సంఘపు బాధ్యత (సెక్షన్ 11) మార్పుచేసి నప్పుడుకాని, సంఘ ఆస్తుల, అప్పుల బదలీ, సంఘ విభజన, ఏకీకరణ (సె॥ 12) చేసినప్పుడు కాని, సభ్యుడు ఆ నిర్ణయము తనకు యిష్టము కాకపోయిన తనకు నోటీసు అందచేయబడిన ఒక నెల గడువు లోపల సంఘములోగల తన వాటాధనమును డిపాజిట్టును ఉపసంహరించు కొనుటకు ఐచ్ఛిక హక్కు కలదు. (సె॥ 18)

5) సంఘములో తనకుగల వాటాధనము ఇతర హైకములను తన అనంతరము పొందుటకు వీలుగా సభ్యుడు తన వారసుని గాని, వారసులను గాని నియమించకొనవచ్చును. అవసరమనుకొంటె వారసులను మార్చుకొనవచ్చును. (సె॥ 28. రూలు 18)

6) సంఘపు బైలాలలో నిర్ణయింపబడిన గరిష్ట పరిమితి మేరకు సాధారణముగా సంఘమునకు అనుమతింపబడిన గరిష్ట వాటామూలధనములో 1/10 మించకుండ 5,000 రూ॥లకు మించకుండ సభ్యుడు ఒక సంఘములో వాటాధనమును కల్గి ఉండవచ్చును. ఒక సంవత్సరము పూర్తి అయిన తర్వాత సంఘపు అనుమతితో తన వాటాలను ఇతర సభ్యులకు బదిలీ చేసుకొనవచ్చును. (సె॥ 26, 27)

7) సంఘపు కార్యకలాపాల ఫలితంగా వచ్చిన లాభాలను తన పెట్టుబడికి, సేవకు తగినట్లు యితరులతో కలసి పంచుకొనవచ్చును.
(సె: 45, రూలు 86)

8) సహకార సంఘముల చట్టములో నిర్ణయించిన అనర్హతలకు లోబడి, ప్రతి సభ్యుడు పాలకవర్గ సభ్యుడిగా పోటీచేయవచ్చును. ఈ హక్కును వినియోగించి, తన యోగ్యతానుసారము అధ్యక్షునిగా లేక ఉపాధ్యక్షునిగా ఎన్నిక కావచ్చును. (సె: 21-A, 21-B, 31-C, 31 రూలు 22)

9) సంఘ వ్యవహారములు సంతృప్తికరముగా లేవనితోచినప్పుడు, ఇతర సభ్యులతో కలసి లిఖితపూర్వకమైన నోటీసు ఇచ్చుట ద్వారా మహాజన సభను జరిపించి, విషయములను చర్చించునట్లు కోరగల అధికారమున్నది.
(సె: 32 (2))

10) సంఘ వ్యవహారములు అసంతృప్తికరముగా ఉన్నవని అనుకొన్నట్లయితే, మిగతా సభ్యులతో కలసి సంఘ వ్యవహారములపై విచారణ జరిపించవలసినదిగా రిజిస్ట్రారు వారికి దరఖాస్తు చేసుకొనవచ్చును. (సె:51)

11) తనకు సంఘముతోగాని, యితర సభ్యులతోగాని పాలకవర్గముతోగాని ఉద్యోగులతోగాని సంఘ వ్యవహారములకు సంబంధించి ఏదైనా వివాదము వచ్చినప్పుడు దానిని పరిష్కరించుకొనుటకు సివిలు కోర్టులకు పోనక్కరలేకుండా రిజిస్ట్రారుకు నివేదించుకొనవచ్చును. వివాదములను త్వరితముగా పరిష్కరించుకొనవచ్చును. (సె 61 రూలు 49)

12) సహకార సంఘముల చట్టములను, నియమావళిని, సంఘ నిబంధనావళిని, ఆడిటు రిపోర్టును సభ్యుల మరియు కమిటీల జాబితాను ప్రతి సభ్యుడు సంఘములో పరిశీలనకు పొందవచ్చును. సంఘపు పుస్తకములతో తనకు సంబంధించిన లావాదేవీలను పరిశీలించుకొనవచ్చును. నిర్ణయించిన ఫీజు చెల్లించుట ద్వారా వాటి కాపీలను పొందవచ్చును. (సె: 119)

13) చట్టము క్రింద ఇచ్చిన తీర్పులపై ఈ క్రింద సూచించిన విధముగా అప్పీలు చేసుకొనవచ్చును. (సె 76)

సహకార ట్రిబ్యునలుకు

ఎ) సె 60 క్రింద యివ్వబడిన సర్చార్జి ఉత్తరువు
బి) సె 62 క్రింద యివ్వబడిన ఆర్బిట్రేషను ఉత్తరువు
సి) సె 71 క్రింద బకాయి వసూలుకు యిచ్చు ధృవపత్రము
డి) సె 73 క్రింద తీర్పుకు ముందు యిచ్చు జప్తు ఉత్తరువు

రిజిస్ట్రారుకు లేక ప్రభుత్వమునకు అప్పీలు చేసుకొన దగిన ఉత్తరువులు

ఎ) సంఘమును రిజిష్టరు చేయుటకు పెట్టుకొన్న దరఖాస్తుపై ఇవ్వబడు ఉత్తరువు (సె 6)
బి) సంఘ రిజిస్ట్రేషనను నిరాకరించుచు యిచ్చు ఉత్తరువు (సె 7)
సి) నిబంధనల సవరణను నిరాకరించుచు యిచ్చు ఉత్తర్వులు (సె 16)
డి) సంఘ సభ్యత్వమును నిరాకరించుచు యిచ్చు ఉత్తర్వులు (సె 19)
ఇ) సంఘ కమిటీని రద్దుచేయుచు యిచ్చు ఉత్తర్వులు (సె 24)
ఎఫ్) సంఘమును మూసివేయ వలసినదిగా యిచ్చు ఉత్తర్వులు (సె 64)
జి] విరాళము చెల్లించవలసినదిగా లిక్విడేటరు యిచ్చు ఉత్తర్వులు (సె 66)
హెచ్) సంఘ పుస్తకములను, ఆస్తులను వెతుకుటకు, స్వాధీనపరుచుకొనుటకు యిచ్చు ఉత్తర్వులు (సె 167)

(అప్పీలుకు గడువు 60 రోజులు)

14) సె 76 (1) క్రింద సహకార ట్రిబ్యునల్‌కు అప్పీలు చేసుకొను ఉత్తర్వులు మినహాయించి మిగతా నిర్ణయము అన్నింటికి సంబంధించి రిజిస్ట్రారుకు లేక ప్రభుత్వమునకు రివిజనుకు దరఖాస్తు చేసుకొనవచ్చును (సె 77)

15) 76, 77 విభాగముల క్రింద యిచ్చిన ఉత్తర్వులు అందిన 90 రోజులలోగా అవసరమనుకొంటే వాటి సమీక్ష (రివ్యూ) కు దరఖాస్తు చేసుకొనవచ్చును. (సె 87)

16) సంఘమునందు సభ్యునికి గల వాటా ధనమును జప్తు చేయుటకు సివిలు కోర్టుకు అధికారము లేదు (సె 39)

17) సభ్యుడు సంఘముతో జరిపేలావాదేవీలకు స్టాంపు డ్యూటీ పెట్ట నవసరము లేదు. 5 ఎకరముల పల్లపుభూమి లేక 10 ఎకరముల మెట్ట భూమి మాత్రమే వున్న సభ్యుడు సంఘములో వ్యవసాయ ఋణములు తీసుకొనుటకుగాను పెట్టు తనఖాలకు ఛార్జి డిక్లరేషనులకు, ఎన్కంబరెన్సు సర్టిఫికెట్లుకు, ఫీజు చెల్లించనక్కరలేదు. (సె 41)

18) సభ్యులు సంఘములో గలిగిన వాటా సర్టిఫికెట్లను, వాటా బదలీలను, డిబెంచర్లను, డిబెంచర్ల బదలీలను రిజిస్ట్రేషను చేయనవసరము లేదు. (సె 42)

19) సంఘ వ్యవహారములు తనకు నచ్చకయున్నపుడు సంఘ నిబంధనలకు లోబడి సభ్యుడు యదేచ్ఛగా సంఘమునుండి వైదొలగవచ్చును.

20) సంఘ వ్యవహారములు సంతృప్తికరముగా లేనప్పుడు సభ్యుడు యితర సభ్యులతో కలసి సంఘమును ఎత్తివేయవలసినదిగా కోరుతూ రిజిస్ట్రారు వారికి దరఖాస్తు చేసుకొనవచ్చును. (సె 64)

## సభ్యుల బాధ్యతలు

1) బాధ్యతదృష్ట్యా సహకార సంస్థలను రెండు రకాలుగా విభజింప వచ్చును.

ఎ) పరిమితిపూచీ సంఘములు బి) పరిమితిలేనిపూచీ సంఘములు, అయితే సభ్యుని బాధ్యత సంఘమును మూసి వేయుటకు నిర్ణ

యించినప్పుడు మాత్రిమే ఉదయించును,

పరిమితి పూచీ సంఘములలో - సంఘపు ఋణములకు సభ్యుని బాధ్యత సంఘములో తాను తీసుకొనిన వాటాధనము మేరకు, లేదా నిబంధనావళిలో నిర్ణయించినట్లుగా తీసుకొన్న వాటాలకు కొన్ని రెట్ల వరకూ గాని పరిమితమయి వుంటుంది.

పరిమితిలేని పూచీ సంఘములలో సభ్యుల బాధ్యత సంఘపు రుణములన్నింటికి సమష్టిగాను విడివిడిగాను పూర్తిగా చెల్లించుటకు బాధ్యత వహించుదురు ఈ బాధ్యత సభ్యునికి సంఘములోనున్న వాటాధనము మీద మాత్రమే గాక అతని స్వంత ఆస్థిమీద కూడా వుండును.

2) గత సభ్యుని బాధ్యత ఆ వ్యక్తి సభ్యుడిగా విరమించుకొనిన తేదీ నుండి; మరణించిన సభ్యుని బాధ్యత-అతని ఆస్థిపై అతను మరణించిన తేదీనుండి, రెండు సంవత్సరముల వరకు కొనసాగును ఈ గడువులోగా సంఘమును మూసివేయవలసినదిగా సెక్షను 64 క్రింద ఉత్తరువు జారీ చేయబడిన వారియొక్క బాధ్యత లిక్విడేషను ప్రొసీడింగులు పూర్తియగు వంతవరకు కొనసాగును. అయితే అట్టి బాధ్యత సభ్యత్వ విరమణ లేదా మరణము సంభవించిన తేదీన ఉన్న సంఘపు ఋణములకు మాత్రిమే పరిమితమై ఉండును; (సె 29)

3) తీసుకొన్న అప్పులను సకాలంలో తిరిగి చెల్లించవలసిన ప్రాథమిక బాధ్యత సభ్యునిమీద ఉన్నది. 3 నెలలకు మించి బకాయిపడిన సభ్యులు పాలకవర్గ సభ్యులుగా పోటీచేయుటకు లేక కొనసాగుటకు అర్హత లేదు. (సె 21 A)

4) తీసుకొన్న అప్పుకు హామీగా ఛార్జి యిచ్చిన ఆస్థిని సంఘ లిఖిత పూర్వకమైన అనుమతిలేనిదే అన్యాక్రాంతము చేయరాదు. అట్లు చేసి నట్లయితే శిక్షార్హుడౌతాడు పైగా అదిచెల్లదు. (సె 36)

5) తన పరపతి అవసరములను ఇతర సమాచారమును సంఘమునకు ముందుగా తెలియపరచవలెను. తీసుకొన్న అప్పు సద్వినియోగపరచి సకాలములో తిరిగి చెల్లించవలెను.

6) సభ్యుడు సంఘములో తనకున్న వాటాధనమును ఎట్టి పరిస్థితుల లోను తనఖా పెట్టరాదు. పెట్టినను చెల్లదు. (సె 27)

7) తాను నెలజీతము పొందు ఉద్యోగస్థుడు గాని పారిశ్రామికుడు గాని అయినట్లయితే సంఘము నుండి తీసుకొన్న అప్పులను తన జీతము నుండి అప్పు వాయిదాను మినహాయించుకోడానికి యిష్టపడి అట్టి మినహాయింపుకు బద్ధుడైఉండాలి. (సె 37)

8) రిజిస్ట్రారుగాని, ఆడిటరుగాని తనఖీకివచ్చిన అధికారిగాని కోరినట్లయితే సంఘపు వ్యవహారములకు సంబంధించి తనకు తెలిసిన సమాచారము తెలియపర్చవలెను. సమనులు యిచ్చిన తీసుకొని, దాని ప్రకారము హాజరు కావలెను. అట్లుకానిచో చట్టప్రకారము శిక్షార్హుడగును.

9) సంఘశ్రేయస్సుకు విరుద్ధముగా ప్రవర్తించిన సంఘ మహాజనసభ అతనిని బహిష్కరించవచ్చును. (సె 23)

10) సంఘ మహాజన సభలలో పాల్గొని సంఘ కార్యకలాపాలలో తగిన శ్రద్ధ తీసుకొని సంఘ అభివృద్ధికి కృషిచేయాలి, సహకార సంఘముల చట్టమునకు నియమావళికి సంఘ నిబంధనావళికి సభ్యుడు బద్ధుడై ఉండాలి, తనకున్న హక్కులతో బాధ్యతలుగా గుర్తించి వాటిని సక్రమముగా వినియోగించాలి,

తమ ప్రయోజనాలు తాము కాపాడుకోడానికి సహకార సంఘముల చట్టములో పొందుపరచిన హక్కులు సరిపోతాయో లేదో సభ్యులు పరిశీలించవలసింది. ఇందుకు ఇంకనూ ఎటువంటి మార్పులు చట్టంలో కావలసిఉన్నది, నిర్ణయించుకొని ఆ విధమైన మార్పులు

చేయడానికి రాష్ట్ర ప్రభుత్వమునకు సమర్పించవచ్చును. భారతరాజ్యాంగ చట్టమునకు లోబడి ప్రతీ పౌరుడూ తనకున్న ప్రాథమిక హక్కులను వినియోగించుకోవచ్చును. అలాగే సహకార సంస్థల సభ్యులుకూడా సభ్యుల స్వపరిపాలనను నిరోధించే ఏ విధమైన శాసనములైనను విధానములైనను తగురీతిలో ప్రతిఘటించ వచ్చును,

## సహకార సంఘ సభ్యత్వనకు అర్హత (సెక్షన్ 19)

ప్రాథమిక సహకార సంఘములలో సభ్యులుగా చేరుటకు వ్యక్తులు ఈ దిగువ తెల్పిన అర్హతలు కల్గి ఉండవలెను.

ఎ) మేజరుఅయి, స్వస్థచిత్తము కల్గి ఉండవలెను.

బి) సంఘము, దాని నిబంధనావళి ప్రకారము. ఏదయినా తరగతి వ్యక్తుల కొరకు ఏర్పడినట్లయినచో, ఆ తరగతికి చెందియున్న వ్యక్తిఅయి ఉండవలెను.

సి) సంఘ నిబంధనావళి ప్రకారము, సంఘ వ్యవహారిక విస్తీర్ణములో నివసించుచున్న వ్యక్తిఅయి ఉండవలెను.

## సభ్యత్వము పొందుటకు ఉండకూడని అనర్హతలు (సె॥ 21)

ప్రాథమిక సహకార సంఘములలో ఈ క్రింద తెల్పిన వ్యక్తులు సభ్యులుగా చేర్చుకొనబడుటకు, లేదా సభ్యులుగా కొనసాగుటకు అర్హులుకాదు.

ఎ) దివాలాదారుడుగా నిర్ణయింపబడుటకు దరఖాస్తు పెట్టుకొనిన వ్యక్తి లేదా విడుదలకాని దివాలాదారుడు.

బి) ఏదేని నీతిబాహ్యత నేరమునకు శిక్షింపబడి, అట్టి శిక్ష రద్దు కాకుండా ఉండిన లేదా శిక్షగడువు అంతమయిన తేదీనుండి మూడు సంవత్సరములు గడచువరకు ఆవ్యక్తి సభ్యత్వమునకు అర్హుడుకాదు.

సి) సంఘము లేదా దాని ఆర్థిక బ్యాంకులో వేతనము తీసుకొంటున్న ఉద్యోగి.

డి) ఈ చట్టముక్రింద సంఘ సభ్యత్వము నుండి బహిష్కరింపబడిన వ్యక్తి, అట్టి బహిష్కరణ తేదీనుండి ఒక సంవత్సరకాలము గడుచువరకు సభ్యత్వమునకు అర్హుడుకాదు.

ఇ) "వ్యక్తి చేస్తున్న ఏదేని వ్యాపారము సంఘపు ఉద్దేశ్యములకు లేదా ప్రయోజనమునకు భంగకరము" అని సామాన్య లేక ప్రత్యేక ఉత్తర్వుద్వారా రిజిష్ట్రారుచే నిర్ణయింపబడినప్పుడు, అటువంటి వ్యాపారము చేస్తున్నవ్యక్తి.

(అయితే, పై 'B' మరియు 'C' వాక్యములలో తెల్పిన వ్యక్తులు కొన్ని ప్రత్యేకమైన సంఘములలో సభ్యులుగా చేరుటకు చట్టములో మినహాయింపులు యివ్వబడినవి)

ఆంధ్రప్రదేశ్ సహకార సంఘముల చట్టము సెక్షన్ 21 (1) (e) మరియు సెక్షన్ 21 A (1) (g) క్రింద రిజిష్ట్రారుచే యివ్వబడిన ఉత్తర్వు R. C. నెం. 158772/70 R 1 తేది 24-9-1970.

సభ్యుడు చేసే ఈ క్రింద తెలిపిన వ్యాపారము వాటికెదురుగా తెల్పిన సంఘ ఉద్దేశ్యములకు లేక శ్రేయస్సుకు భంగకరమని రిజిష్ట్రారు పై ఉత్తర్వుద్వారా నిర్ణయించెను.

| వ్యాపార స్వభావము | ఆ వ్యాపారము సంఘ శ్రేయస్సుకు విరుద్ధమని భావింపబడిన సంఘములు |
|---|---|
| 1. వడ్డీ వ్యాపారము-అనగా, ధన రూపములోగాని వస్తు రూపంలో గాని అప్పులు ఒక్కొక్కరికి 100 రూ॥లకు మించి ఒక సంవత్సర కాలములో 6 గురు వ్యక్తులకు యిచ్చిన: లేదా ఎరువులు, విత్తనములు, క్రిమినాశక మందులు, వ్యవసాయ పనిముట్లు, వ్యవసాయ ఉత్పత్తులతో వ్యాపారము చేయుచున్న. | 1. వ్యవసాయ పరపతి సంఘములు<br>2. విశాలపరిధి సహకార సంఘములు<br>3. గ్రామీణ బ్యాంకులు<br>4. పట్టణ బ్యాంకులు<br>5. సకలార్థ సహకార సంఘములు<br>6. రైతు సేవా సహకార సంఘములు |
| 2. ధాన్యము, బియ్యము లేదా ఇతర వ్యవసాయక ఉత్పత్తులతో కమీషను వ్యాపారము (100 రూ॥లకు మించిన క్రయవిక్రయములు ఒక సంవత్సర కాలములో 6 గురు వ్యక్తుల నుండి చేసిన) | సహకార మార్కెటింగు సంఘములు లేదా క్రయవిక్రయ సంఘములు లేదా ప్రత్తి, పొగాకు మొదలగు వ్యవసాయ సరుకుల ఉత్పత్తిదారుల సంఘములు. |
| 3) సంఘము వ్యాపారము చేయు వస్తువులలో, ఏ వస్తువుతోనైనా వ్యాపారము నిర్వహించుచున్న వ్యక్తి. | వినియోగదారుల స్టోర్సులు, చేనేత సహకార సంఘములు లేదా పారిశ్రామిక సంఘములు, |
| 4. కవులుదార్లు లేదా స్వంత వ్యవసాయము చేయుచున్న వ్యక్తులు. | సేద్య సహకార సంఘములు Land Colonisation societies, |

| వ్యాపార స్వభావము | ఆ వ్యాపారము సంఘ శ్రేయస్సుకు విరుద్ధమని భావింపబడిన సంఘములు |
|---|---|
| 5. సంఘము చేసే వ్యాపారము చేస్తున్న కంటాక్టర్లు, వడ్డీ వ్యాపారస్థులు. | 1. గృహనిర్మాణ సంఘములు<br>2. పారిశ్రామిక సహకార సంఘములు.<br>3. Forest Coupe. Societies<br>4. గీతపనివారి సహకార సంఘములు.<br>5. Taxi-Drivers Societies<br>6. Lift irrigation Societies<br>7. రిక్షాలాగువారి సంఘములు<br>8. రవాణా సంఘములు<br>9. మత్స్యకారుల సంఘములు<br>10. Co-op Marketing Societies or any other Society. |

## నామమాత్రపు సభ్యుడు లేదా సహసభ్యుడు (సె-20)

19వ సెక్షన్ లో ఏమి ఉన్నప్పటికి సంఘము ఏవ్యక్తినైనా నామమాత్రపు సభ్యుడిగా లేదా సహ సభ్యుడిగా చేర్చుకొనవచ్చును. కాని అట్టి సభ్యుడు ఓటు చేయుటకు హక్కు కల్గి ఉండదు. మరియు సంఘ లాభములు లేక ఆస్తులలో ఏవిధమైన రూపములోనూ ఎట్టి వాటాకు హక్కుకల్గి ఉండదు.

## సభ్యులను చేర్చుకొనుట

సభ్యత్వము పొందుటకు అర్హుడైన ఏవ్యక్తియైనా సభ్యత్వము కొరకై సంఘమునకు దరఖాస్తు చేసిన, తగినంత కారణము లేకుండ ఏ సంఘము సభ్యత్వమును నిరాకరింపకూడదు. సభ్యత్వము నిరాకరింప

వలసిన సందర్భములో, అట్టి వ్యక్తికి ఆ నిర్ణయమును అందుకుగల కారణములతోసహా రిజిష్టరు పోష్టుద్వారా తెలుపవలెను. నిర్ణయము తీసుకొన్న తేదీనుండి 15 దినములలోగా లేదా ఆయన సభ్యత్వమునకు ధరఖాస్తు పెట్టుకొన్న తేదీనుండి 60 దినములలోగా ఇందు ఏ దినము ముందు సంభవించిన దానిప్రకారము సదరు నిర్ణయమును తెలియపర్చవలెను.

అయితే. సభ్యత్వము కొరకు దరఖాస్తు పెట్టుకొనిన తేదీనుండి 60 దినముల గడువులోపుగా, అట్టి వ్యక్తికి ఆ నిర్ణయము ఏది తెలియపరచనియెడల, ఆ గడువు తేదీ గతించినయెడల సంఘము ఆయనను సభ్యుడుగా చేర్చుకొన్నట్లుగా భావింపబడును.

రూలు 14 ప్రకారము సంఘములో సభ్యుడిగా చేర్చుకొనబడిన, లేదా చేర్చుకొనబడినట్లుగా భావింపబడిన ప్రతి వ్యక్తి పేరు, తగు అథారటీ ఆ వ్యక్తిని సభ్యునిగా అంగీకరించి ఆమోదించిన తీర్మానము తేదీనుండి లేదా సభ్యునిగా భావింపబడి నప్పటినుండి 30 రోజులలోగా సంఘ ప్రధాన నిర్వాహక అధికారిచే ప్రవేశ పుస్తకములో నమోదు చేయవలెను.

## అర్హులైన వ్యక్తులందరికీ వెనువెంటనే సభ్యత్వము (సె 19 (2A) రూలు 12A)

## (Automatic admission or Universal Membership)

"సహకార సంఘములలో చేరదలచుకొన్న వ్యక్తులనందరినీ చేర్చుకొనుటలేదని, ఆ సంస్థలు కొంతమంది వ్యక్తుల జేబు సంస్థలుగా కొనసాగుతున్నవని" విమర్శఉన్నది. అందుచేత ప్రభుత్వము అర్హులైన వ్యక్తు అందరకూ సహకార సంఘములలో వెనువెంటనే సభ్యత్వము లభింప చేయడానికి, 1976లో సహకార సంఘముల చట్టంలో సెక్షన్ 19(2A)

మరియు రూలు 12A క్రింద ఏర్పాటు చేసినది. ఈ విభాగము ననుసరించి సభ్యత్వమునకు అర్హుడైన వ్యక్తి, చట్టంలో తెలుపబడిన 'ఫారము-జె' లో ఈ క్రింద తెలుపబడిన సంఘములలో సభ్యత్వమునకు రిజిష్ట్రారు ద్వారా దరఖాస్తు చేసుకొనవచ్చును.

1) వ్యవసాయ సహకార పరపతి సంఘములు, 2) సేవా సహకార సంఘములు, 3) సకలార్థ సహకార సంఘములు. 4) గ్రామీణ సహకార బ్యాంకులు, 5) విశాల సహకార సంఘములు. 6) వ్యవసాయాభివృద్ధి బ్యాంకులు, 7) రైతుసేవా సహకారసంఘములు, 8) మత్స్య పారిశ్రామిక సహకార సంఘములు, 9) పారిశ్రామిక సహకార విక్రయ సంఘములు, 10) పంచాయితీ సమితిస్థాయీ సహకార సంఘములు, 11) ప్రాథమిక చేనేత సహకార సంఘములు.

రిజిష్ట్రారు, దరఖాస్తును పరిశీలించి సంఘమునకు అందజేయును. దరఖాస్తు సంఘ కార్యాలయమునకు చేరిననాటినుండి దరఖాస్తుదారుడు సంఘ సభ్యుడుగా భావింపబడును (ఈ విభాగము క్రింద రిజిష్ట్రారు అనగా పంచాయితీ సమితి సహకార విస్తరణాధికారిగా అన్వయించుకొనవలెను.)

అయితే సె 19 (2-B) ననుసరించి రిజిష్ట్రారు ఎప్పుడు అయినా తనంతట తానుగాని లేదా సదరు సంఘము దరఖాస్తు చేసిన మీదటకాని లేదా పై చర్యవలన నష్టముపొందిన ఎవరైనా వ్యక్తినుండి పై విభాగము క్రింద సభ్యుడిగా చేర్చుకొనబడినట్లు భావింపబడిన తేదీనుండి 15 రోజుల లోగా దరఖాస్తు అందినమీదట. సభ్యత్వము పొందినవ్యక్తి యొక్క సభ్యత్వపు అర్హతలను పరిశీలించును. అర్హతలు లేనివ్యక్తి సభ్యుడిగా చేరినప్పుడు, రిజిష్ట్రారు దరఖాస్తు అందుకొన్న 30 దినములలోపున, అభ్యంతరములను చెప్పుకొనుటకు తగినంత వ్యవధి ఆ సభ్యునకు యిచ్చిన తరు

వాత, రిజిష్ట్రారు కారణములు తెలుపుతూ అవ్యక్తిని సభ్యత్వము నుండి తొలగించవచ్చును. (ఇక్కడ రిజిష్ట్రారు అనగా మండల సహకార అధికారి (Divisional Co-operative Offices) అని అన్వయించుకొనవలెను).

## సభ్యుల బహిష్కరణ (సె. 23) & (రూలు 20)

సంఘ ప్రయోజనములకు ప్రతికూలముగా ప్రవర్తించిన సభ్యుని సభ్యత్వమును సర్వసభ్య సమావేశములో ఆమోదింపబడిన తీర్మానము ద్వారా రద్దు చేయవచ్చును. అయితే ఈ సమావేశమునకు హాజరై ఓటుచేసిన సభ్యులలో మూడింట రెండువంతులకు (⅔) తక్కువ కానంత మంది సభ్యులు ఈ తీర్మానమును ఆమోదించవలెను. సభ్యుడు విన్నవించుకొనుటకు ఒక అవకాశము ఇవ్వకుండగను, పై తీర్మానమును రిజిష్ట్రారు (మండల సహకార అధికారి) ఆమోదించనంతవరకు, సభ్యుడు బహిష్కరింపబడడు. రిజిష్ట్రారు ఆమోదము పొందినట్టి (సభ్యుని బహిష్కరించుచు చేసిన తీర్మానము) నకలు ఒకటి సభ్యునకు అందచేయబడవలెను. (సె-23)

ఎవరైనా సంఘ సభ్యుడు సె. 21 క్రింద తెలుపబడిన అనర్హత పొందిన, సభ్యుడుగా కొనసాగుటకు అనర్హుడు. అట్టి వ్యక్తిని రిజిష్ట్రారు తనంతటతానుగాని, ఎవరైనా సంఘ సభ్యుని నుండి లేదా ఆర్థిక బ్యాంకు నుండి ఇందుకు సంబంధించి వ్రాతమూలక నివేదన అందిన మీదట, ఆ సభ్యుడు ఆ అనర్హత పొందిన తేదీనుండి సభ్యత్వము కోల్పోయినట్లు ప్రకటించును. తన నిర్ణయమును జారీచేయుటకు ముందు, అభ్యంతరములు ఏమైన ఉన్న తెలుపుకొనుటకు ఆ సభ్యునికి ఒక అవకాశము యివ్వవలెను. (రూలు-20)



# 18 సంఘ పాలకవర్గము

మహాజనసభ ఎప్పటికప్పుడు తరచూ సమావేశం కావడం కష్టం కనుక సంఘపాలనా వ్యవహారాలను నిర్వహించడానికి సభ్యులు సంఘ పాలకవర్గాన్ని ఎన్నుకొంటారు. పాలకవర్గములో ఎంతమంది సభ్యులుండవలసినది సంఘ నిబంధనావళిలో తెలుపబడుతుంది. సంఘ మహాజన సభ సంవత్సరానికొకసారో రెండుసార్లో సమావేశమై స్థూలంగా విధానాలకు సంబంధించి నిర్ణయాలు చేస్తారు, ఆ విధానాలకు తీర్మానములకు లోబడి సంఘ వ్యవహారములను నిర్వహించుటకు పాలకవర్గానికి అధికారాన్ని దత్తతచేస్తారు. అయితే పాలకవర్గము తాము నిర్వహించిన పనులకు మహాజన సభకు జవాబుదారీగా ఉంటుంది. పాలకవర్గ సభ్యులు విడివిడిగా గాక పాలకవర్గ సమావేశములలో చురుకుగా పాల్గొనుట ద్వారా తమ హక్కులను వినియోగించుకొని బాధ్యతలను నిర్వహించగల్గుతారు. పాలకవర్గ సమావేశములలో మెజారిటీ సభ్యుల అభిప్రాయాన్ననుసరించి నిర్ణయాలు చేయడం జరుగుతుంది.

## పాలకవర్గము చేయవలసిన పనులు

1) సంఘ సభ్యత్వము కొరకు వచ్చిన దరఖాస్తులను పరిశీలించి, సభ్యత్వము మంజూరుచేయుట లేదా నిరాకరించుట: సభ్యులకు వాటాలను కేటాయించుట

2) సభ్యుల రాజీనామాను ఆమోదించుట; వాటాల బదలీకి లేదా వాటాధనము వాపసుకు అంగీకరించుట

3) సంఘ కార్యక్రమముల నిర్వహణకు కావలసిన నిధులను సేకరించుట.

4) సభ్యుల ఋణదరఖాస్తులను, సంఘ పరపతి పరిమితి స్టేటుమెంట్లను పరిశీలించి; సభ్యులకు అప్పులను మంజూరు చేయుట.

5) సంఘమునకు రావలసిన అప్పులను సకాలములో వసూలగునట్లు చూచుట: బకాయిల వసూలుకు చట్టరీత్యా చర్యలు తీసుకొనుట.

6) యితర సంస్థలతో, వ్యక్తులతో, సంఘము తరపున ఒప్పందములు చేసుకొనుట; వ్యాపార వ్యవహారముల సక్రమ నిర్వహణకు అవసరమయిన ఉపనిబంధనావళిని రూపొందించుట.

7) సంఘానికి అవసరమైన ఉద్యోగులను నియమించుట: వారికి జీత భత్యములు, పని పరిస్థితులకు, క్రమశిక్షణకు సంబంధించి ఉపనిబంధనావళి రూపొందించుట.

8) సంఘ సమస్యలను నిరంతరం అర్థం చేసుకోవటం; సంఘాభివృద్ధికి సభ్యుల అవసరాలను తీర్చుటకు సేవాసౌకర్యాల కల్పనకు ఇతర కార్యక్రమాలను చేపట్టుటకు నిర్ణయించుట.

9) ఆర్థిక బ్యాంకులో ఉన్న సంఘ ఖాతాల నిర్వహణకు అధికారాన్నిచ్చుట.

10) కనీసము సంవత్సరానికొకసారి మరియు అవసరానుసరించి సంఘ మహాజనసభ జరుపుట: అందుకు తేదీ, సమయము, స్థలము, చర్చనీయాంశములు-(Agenda) మొదలగునవి నిర్ణయించుట.

11) సంఘ పుస్తకములు, లెక్కలు సక్రమముగా వ్రాయుటకు చర్యలు తీసుకొనుట: వార్షిక పరిపాలనానివేదిక, ఆర్థిక నివేదికలు, బడ్జెటు, ఆడిటు రిపోర్టు, ఆడిటు లోపముల సవరణ నివేదిక మొ॥వి మహాజనసభ పరిశీలనకు, ఆమోదానికి సమర్పించుట

12) సంఘ ఆస్తుల రక్షణకు తగిన ఏర్పాట్లు చేయుట: మూడు నెలల కొకసారి ఆస్తుల, వస్తునిల్వల తనిఖీచేయుట: జమా ఖర్చులను ఆమోదించుట లేదా తిరస్కరించుట.

13) సంఘ అధ్యక్షుని, ఉపాధ్యక్షుని ఎన్నుకొనుట: పాలకవర్గ సభ్యుల రాజీనామాను ఆమోదించుట, కమిటీలో ఏర్పడిన ఖాళీలను నూతన సభ్యులకు చేర్చుకోవడం (Co-option) ద్వారా భర్తీ చేయడం.

14) సభ్యులతో సత్సంబంధములు కల్గిఉండుట: వారి అభిప్రాయములను గౌరవించుట, వారి సలహాలను పొందుట: వారు సంఘ కార్యకలాపములలో ఉత్సాహంతో పాల్గొనునట్లు సహాయపడుట.

15) సభ్యులు తమదృష్టికి తీసుకువచ్చిన సమస్యలను పరిశీలించి, అవసరాన్ననుసరించి అధ్యక్షుని అనుమతితో, పరిష్కారం నిమిత్తం పాలకవర్గ సమావేశములలో ప్రతిపాదించుట.

సంస్థ పనిఅంతయు పాలకవర్గము ద్వారానే జరుగుతుంది కనుక ప్రతీపాలకవర్గ సభ్యుడూ సంఘ కార్యక్రమాలు సరిగ్గా సక్రమముగా సంఘానికి సభ్యులకూ లాభదాయకంగా ఉన్నదీ లేనిదీ చూడాలి. సంఘ కార్యసామర్థ్యాన్ని వృద్ధిచేయడానికి సంస్థయొక్క ప్రతీపని గురించి తెలుసుకోవాలి. ప్రతీ సభ్యుడు ప్రజాసేవ చేయాలనే ఉత్సాహం ఉన్నవాడు, నమ్మకస్తుడు, సామర్థ్యంకలవాడు, సాహసవంతుడు, వినయసంపన్నుడు అయిఉండాలి, సంఘక్షేమమే ఆతనిధ్యేయమై ఉండాలి. సహకార సూత్రాలపై ప్రజాస్వామ్య పద్ధతులపై పరిపూర్ణ విశ్వాసం కల్గిఉండాలి. సంఘ లెక్కలను, ఆస్తి అప్పుల పట్టీకలను పరిశీలించటం తెలుసుకోవాలి ప్రతీ సమావేశానికి హాజరయి, సంఘ కార్యక్రమాలను

పరిశీలించాలి. నిష్పాక్షికంగా, వ్యవహరించాలి. పాలకవర్గ సభ్యుని పదవి ప్రజాసేవా పదవిగా భావించాలి.

## పాలకవర్గ సభ్యుడిగా ఎన్నికకావడానికి లేదా కొనసాగుటకు చట్టరీత్యా నిర్బంధములు

సెక్షన్ 21-A ననుసరించి ఈ దిగువ వ్యక్తులు కమిటీ సభ్యులుగా ఎన్నుకొనబడుటకు లేదా కొనసాగుటకు అనర్హులు.

A) సంఘము లేదా దానికి ఆర్థిక సహాయముచేయు బ్యాంకుయొక్క ఉద్యోగికి 24వ రూలులో తెలుపబడినట్లు దగ్గర బంధువు అయినవ్యక్తి.

B) సంఘమునకు లేదా ఏ యితర సహకార సంఘమునకు గాని నగదు లేక వస్తురూపములో సంఘ నిబంధనావళిలో నిర్ణయించబడిన కాలపరిమితికి మించి లేక మూడునెలల కాలముకంటే ఎక్కువకాలము బకాయి పడిన వ్యక్తి (సమాఖ్య సంఘములలో - పనిచేయని సంఘముయొక్క ప్రతినిధి లేదా పైన చెప్పబడిన విధముగా బకాయిపడిన సంఘము యొక్క ప్రతినిధి.)

C) ఈ చట్టము ననుసరించి ఒక డిక్రి, నిర్ణయము. తీర్పు లేదా ఉత్తరువు క్రింద ఏదైనా మొత్తము సంఘమునకు చెల్లించవలసియున్న వ్యక్తి.

D) సంఘముతో చేసుకొనబడి అమలు నందున్న ఏదైనా కంట్రాక్టులో లేక సంఘమునకు చేయుచున్న ఏదైనాపనిలో హితమును సంపాదించిన వ్యక్తి.

E) అస్వస్థచిత్తుడై యుండి, అర్హమగు న్యాయస్థానముచే ఆ విధ

ముగా ప్రకటింపబడిన వ్యక్తి: చెవిటి, మూగ లేదా కుష్ఠురోగి అయిన వ్యక్తులు.

F) సంఘము తరఫున లేక వ్యతిరేకముగా న్యాయవాదిగా నియమితుడైన వ్యక్తి.

G) సహకార సంఘముల రిజిష్ట్రారు సాధారణ లేక ప్రత్యేక ఉత్తర్వు ద్వారా సంఘ శ్రేయస్సుకు లేదా ప్రయోజనములకు విరుద్ధమని ప్రకటన చేసినట్టి వ్యాపారమును చేయుచున్న వ్యక్తి. (190వ పేజీచూడుము)

H) పౌరహక్కుల పరిరక్షణ చట్టము 1955 క్రింద ఏదేని నేరమునకు శైదుశిక్ష విధించబడిన వ్యక్తి.

I) రూలు 24 (1) (d) ననుసరించి, రెంటికిమించి అపెక్సు సంఘములలోగాని, లేక రెంటికి మించిన కేంద్ర సంఘములలోగాని, లేదా ఒక అపెక్సు, ఒక కేంద్ర సంఘములకు మించిన కమిటీలలో సభ్యుడుగా నున్న వ్యక్తులు.

J) సెక్షన్ 21-B ననుసరించి ఏదైనా కమిటీ సభ్యుడు ఆ సంఘము జరుపు మూడు వరుస కమిటీ సమావేశములకు హాజరుకాని యెడల కమిటీ సభ్యత్వమును కోల్పోవును. అయితే కమిటీ, అతనిని తిరిగి కమిటీ సభ్యునిగా చేర్చుకొనవచ్చును. కాని (కమిటీ, దాని పదవీ కాలపరిమితిలో) ఆ వ్యక్తిని ఒకసారికి మించి ఇట్లు తిరిగి కమిటీ సభ్యునిగా చేర్చుకొనరాదు.

K) సెక్షన్ 21-సి ననుసరించి, వరుసగా రెండు పదవీకాలములపాటు కమిటీ సభ్యుడిగా పదవియందున్న వ్యక్తి, వరుసగా మూడవ పదవీ కాలమునకు ఆ సంఘ కమిటీ సభ్యుడిగా ఎన్నుకొనబడుటకు అనర్హుడు.

L) పైన "బి" లో చెప్పబడిన కారణమున కమిటీ సభ్యత్వము కోల్పో యిన వ్యక్తి, అట్టి అనర్హత తొలగింపబడిననూ, సభ్యత్వము కోల్పో యిన తేదీనుండి ఒక సంవత్సరము గడచిననే తప్ప మరల కమిటీ సభ్యు డిగా ఎన్నుకొనబడుటకు అర్హుడుకాదు. (సె: 21-B (2) )

## అనర్హత కల్గిన కమిటీ సభ్యుని తొలగింపు (రూలు-24 (3) )

ఏవ్యక్తి అయినా, కమిటీ సభ్యుడిగా ఉండుటకు, అనర్హత కల్గి ఉన్నప్పుడు రిజిష్ట్రారు తనంతట తానుగాని, లేక ఆ సంఘముయొక్క కమిటీసభ్యుడు తనకు తెలియపరచిన మీదట, లేదా ఆ సంఘముయొక్క ఆర్థిక బ్యాంకు తెలియపరచినమీదట రిజిష్ట్రారు వ్రాతమూలకమయిన ఉత్తర్వును, సభ్యుడు అనర్హత సంభవించిన తేదీనుండి పదవిలో ఉండ కాదని జారీచేయును. ఉత్తర్వును జారీచేయుటకు ముందు అనర్హత కల్గిన వ్యక్తికి ఇందులో ఆక్షేపణలు తెలుపుకొనుటకు అవకాశమీయవల యును. రిజిష్ట్రారుయొక్క నిర్ణయము అంతిమము. సంఘము రిజి ష్ట్రారు నిర్ణయమును పాటించవలెను. ఈ నిర్ణయము గురించి ఏ కోర్టు లోనూ వాదమునకు దిగుటకు వీలులేదు.



# 19 అధ్యక్షుడు

సంఘ అధ్యక్షుడు సంఘ సభ్యులకు పాలకవర్గ సభ్యులకు నాయకత్వము వహించి వారందరూ సంఘ లక్ష్యసాధనకు కృషిచేయునట్లు ప్రోత్సహించాలి సభ్యులు, క్రమశిక్షణతోనూ, పరస్పర అవగాహనతోనూ, సామరస్యంతోనూ, బాధ్యతతోనూ వ్యవహరించునట్లు, సమష్టి లక్ష్యం పట్ల శ్రద్ధాసక్తులు కలిగిఉండేటట్లు వారిని రూపొందించాలి. ఇందుకు అవసరమయిన శక్తిని స్ఫూర్తిని వారికందజేయగలగాలి. సంఘ సక్రమ నిర్వహణకు సంబంధించి అన్ని విషయాలు కూలంకషముగా తెలుసుకొని, సభ్యులు, పాలకవర్గ సభ్యులు సరిఅయిన నిర్ణయాలు చేయడానికి వారిపాత్ర వారు సక్రియంగా నిర్వహించడానికి తోడ్పడాలి. సంఘ సమావేశములను జయప్రదంగా నిర్వహించగల నేర్పును కల్గి ఉండాలి. అందరూ తమ ఆలోచనలను, అభిప్రాయములను స్వేచ్ఛగా నిర్మొహమాటంగా వెలిబుచ్చడానికి అవకాశం యివ్వాలి, వారి అభిప్రాయాలు సమష్టి సంక్షేమానికి ఎంతవరకూ తోడ్పడతాయో పరిశీలించాలి. అందరితోనూ నిష్పక్షపాతంతో వ్యవహరించి, మెజారటీ సభ్యుల అభిప్రాయాన్ని గౌరవించి, దానికి బద్ధుడై ఉండాలి. అవసరమయితే, ఇతరులకోసం స్వలాభాన్ని, స్వసుఖాన్ని ఎంతోకొంత త్యాగం చేయగల సమర్థుడై ఉండాలి. ఇతరుల సంక్షేమం కోసం నిరంతరము ఆలోచించాలి. సంఘం ఏమైనా సాధించింది అంటే, అది అందరి సమష్టి కృషివలన తోడ్పాటువలన మాత్రమేనని గ్రహించి, ఆ విజయోత్సాహం అందరికీ చెందేటట్లు, చూడాలి. తన ప్రవర్తన ఇతరులకు మార్గదర్శకం కావాలి.

## అధ్యక్షుని బాధ్యతలు హక్కులు

1) సంఘ వ్యవహారాలన్నిటిపై అధ్యక్షుడు సాధారణ అజమాయిషి నియంత్రణ కలిగిఉంటాడు. సిబ్బంది సక్రమముగా తమ బాధ్యతలను నిర్వహించునట్లు చూడవలెను.

2) మహాజన సభ, పాలకవర్గ సమావేశములకు అధ్యక్షత వహించి వాటిని సక్రమముగా నిర్వహించవలెను.

3) సంఘ నిబంధనావళిలో నిర్దేశించినట్లు లేదా అవసరమయినప్పుడు సాధారణముగా నెలకొకసారి పాలకవర్గ సమావేశములను క్రమం తప్పకుండా ఏర్పాటు చేయుటకు కార్యదర్శిని ఆదేశించవలెను. సమావేశములో చర్చించవలసిన చర్చనీయాంశముల పట్టిక (Agenda) ను, సమావేశమునకు తేదీ, సమయము, స్థలము మొ॥వి నిర్ణయించవలెను. సమావేశములలో సరిఅయిన నిర్ణయాలు తీసుకొనుటకు వీలుగా చర్చనీయాంశములకు సంబంధించి వివరములు, వివరణలు (Agenda notes) తయారు చేయవలసిందిగా కార్యదర్శిని ఆదేశించవలెను.

4) మహాజనసభ, పాలకవర్గము చేసిన నిర్ణయాలను అమలు పరచుటకు చర్యలు తీసుకొనవలెను.

5) సమావేశములలో తీర్మానములు చేయునప్పుడు ఇరుపక్షముల వారికి సమానముగా ఓట్లు వచ్చినప్పుడు అధ్యక్షునికి అదనముగా ఒక ఓటు (Casting Vote) ఉండును. ఆ ఓటు హక్కును వినియోగించి సరిఅయిన నిర్ణయము తీసుకొనుటకు ఆయన సంఘమునకు తోడ్పడవలెను.

6) సంఘ కోశాధికారిగా వ్యవహరించవలెను. చిట్టాను, ఇతర పుస్త

కములను పరిశీలించి, చిట్టాలో సంతకముచేసి నగదు నిల్వకు బాధ్యత వహించవలెను. పాలకవర్గమువారి తీర్మానము ననుసరించి బ్యాంకు అకౌంట్లను సక్రమముగా నిర్వహించవలెను.

7) సంఘ ఆస్థుల సక్రమరక్షణకు తగు ఏర్పాట్లు చేయవలెను.

8) సంఘం తరఫున అవసరమయినప్పుడు ఇతర పాలకవర్గ సభ్యులతో కలసి, అప్పు పత్రము, ఇతర ముఖ్యపత్రములను వ్రాయవలయును. పుస్తకములలోని వ్రాతల నకళ్ళకు ధృవీకరించవలెను.

9) సమాఖ్య సంఘములకు, సంఘ ప్రతినిధిగా వ్యవహరించవలెను. సమాఖ్య సంఘముల మహాజన సభలకు తప్పక హాజరయి, ఆ సంస్థనిర్వహణ సక్రమముగా కొనసాగునట్లు కృషిచేయవలయును, ఇతర సంస్థలతో సత్సంబంధములు పెంచుకొనవలెను.

ఇతర సహకార సంస్థల ప్రతినిధులు తనను కోరినట్లయితే, సమాఖ్య సంస్థయొక్క పాలకవర్గ సభ్యునిగా సేవచేయుటకు సంసిద్ధుడై ఉండవలెను.

10) ఏకారణము వలన నయినా తాను తాత్కాలికముగా కొంత కాలము పాటు సంఘ పాలనా కార్యక్రమములకు, విధులకు, హాజరుకావడానికి వీలుపడకపోతే, ఆ కాలములో తన విధులను నిర్వహించవలసినదిగా ఉపాధ్యక్షుని కోరవలెను.

## ఉ పా ధ్య క్ష డు

సంఘ వ్యవహారములను నిర్వహించుటలో అధ్యక్షునికి సహాయపడవలెను. అధ్యక్షుడు కోరినప్పుడు, అతని విధులను నిర్వహించుటకు సంసిద్ధుడై ఉండవలెను.

# 20 కార్యదర్శి

ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘము సక్రమంగా పనిచేయడానికి, అభివృద్ధి చెందడానికి ముఖ్యకారకుడు ఆ సంఘముయొక్క కార్యదర్శి. ఇది చాలాకీలకమైన పదవి. ఈ పదవిలో ఉన్నవ్యక్తి సరి అయినవాడు కాకపోతే ఆ సంఘము నాశనమవ్వడానికి ఎంతోకాలము పట్టదు. కార్యదర్శికున్న ఉద్యోగబాధ్యతలు అటువంటివి. మొత్తం సహకార ఉద్యమమంతా పటిష్టమైన, ప్రాథమిక సహకార సంఘాలమీదే ఆధారపడిఉంది. ఈ సంఘములు నేరుగా ప్రజలకు సేవచేసే సంస్థలు, ఈ సంస్థల నిర్వహణా సామర్థ్యం మీదే ప్రజల ఆర్థిక భవిష్యత్తు ఆధారపడి ఉంది, సహకార సంఘాలుకూడా వ్యాపార సంస్థలు, సంస్థల కార్యక్రమాలన్ని ఎంతో నిపుణతో, ఆర్థిక క్రమశిక్షణతో, సామర్థ్యంతో సత్ఫలితాలిచ్చేటట్లు నిర్వహించవలయును. ఇందుకు వృత్తి నైపుణ్యం గల సమర్థుడైన కార్యదర్శి సంఘమునకవసరము. పాలకవర్గ సభ్యులకు, సంఘ విధి విధానములు నిర్ణయించేటప్పుడు సరిఅయిన వివరణలు, సూచనలు యివ్వడమే కాకుండా, తీసుకున్న నిర్ణయాలను నిజాయితీతోనూ, చిత్తశుద్ధితోనూ అమలు పరచవలసిన బాధ్యత ఈ వ్యక్తిమీద ఉంది, సభ్యులందరితోనూ సత్సంబంధాలు పెంచుకోవాలి. వాళ్ళకి తెలియని విషయాలు తెలియజెప్పాలి, వాళ్ళపట్ల ప్రేమతోనూ, అభిమానంతోనూ మెలగాలి. వాళ్ళ సంక్షేమమే అతని నిరంతర ధ్యేయం కావాలి.

కనుక ఇలాంటి పదవికి సరిఅయిన విద్యార్హతలు, ప్రతిభా ఉన్న వ్యక్తులను మాత్రమే ఎంపికచేయాలి, అతని ఎంపిక అతని ఉద్యోగానికి న్యాయం చేకూర్చే విధంగా అతనికున్న శక్తి సామర్థ్యాల మీదే ఆధారపడి ఉండాలి కాని, అతనికున్న ఆర్థిక, సాంఘిక స్తోమతులు సిఫారసులు

కారణం కారాదు. సహకార రంగంలోని సంస్థల విజయం, భవిష్యత్తు మంచి ఉద్యోగుల నియామకంమీద, సేవలమీదే ఆధారపడి ఉంది కనుక ఈ కీలకమయిన నిర్ణయాలను తీసుకోవడంలో ఎంతో జాగ్రత్త వహించవలసిన బాధ్యతఉంది. ఎంపిక అయిన వ్యక్తులకు వారి బాధ్యతలను వారు ధైర్యంగా, సమర్థవంతముగా, ఆత్మవిశ్వాసంతో సునాయాసంగా నిర్వహించడానికి వీలుగా తగిన శిక్షణ యివ్వవలసిన అవసరం ఉంది, మంచి వ్యక్తులు, మంచి విద్యార్హతలున్న సమర్థులైన వ్యక్తులు ఈ పదవికి వచ్చునట్లు, వారిని ఆకర్షించేటట్లు ఈ పదవియొక్క ప్రతిష్టను పెంచవలసిఉంది. నిజానికి ఈ పదవిని చాలా బలపర్చవలసిఉంది.

## కార్యదర్శి విధులు - బాధ్యతలు

సంఘ అధ్యక్షుని ఆధిపత్యమునకు లోబడి కార్యదర్శి ఈ క్రింది అధికారములను, విధులను, బాధ్యతలను కల్గి ఉండును.

1) సంఘముయొక్క ఉత్తర ప్రత్యుత్తరములు నడుపుట.

2) సభ్యులందరికీ సంఘసేవలు సక్రమముగా అందునట్లు చూచుట.

3) పాలకవర్గ సమావేశములు, మహాజన సభలు జరుపుటకు అవసరమైన నోటీసు, చర్చనీయాంశముల పట్టిక సకాలములో జారీ చేయు బాధ్యత ఆయనమీద ఉన్నది. అవసరమయిన అన్ని నివేదికలు, చర్చనియాంశములకు సంబంధించి వివరణలు (Agenda Notes) తయారు చేసి సమావేశములకు సమర్పించవలయును. చేసిన నిర్ణయాలను అమలు పరచవలసిన బాధ్యత ఆయన మీద ఉన్నది.

4) సంఘమునకు వచ్చు సొమ్ములకు రశీదులు యివ్వవలెను, ప్రతీ రోజు వ్యాపార వ్యవహారములు ముగిసినతర్వాత నగదు లెక్క తేల్చి

చిట్టాలో సంతకము చేయవలెను, నగదు నిల్వను సంఘ అధ్యక్షునకు (చిట్టాలో ఆయన సంతకము తీసుకొని) అందచేయవలెను.

5) చిట్టానిల్వ ఎక్కువగా ఉన్నట్లయిచే సాధారణముగా రూ. 25లు మించి ఉన్నట్లయితే ఆ మొత్తమును ఆర్థిక బ్యాంకులో జమచేయవలెను.

6) బడ్జెటు కేటాయింపుకు లోబడి చిల్లర ఖర్చులు సాధారణముగా రు, 5లు మించని ఖర్చులు ఆయన చేయవచ్చును. ప్రతి నెల జమా. ఖర్చులు పాలకవర్గముచే ఆమోదింపబడవలెను.

7) సంఘ రిజిష్టర్లు, అకౌంట్లు ఎప్పటికప్పుడు అన్నియు వ్రాయబడు టకు ఆయన బాధ్యత వహించవలెను. ఇందుకు క్రింద ఉద్యోగులపై అవసరమయిన అజమాయిషి చేయు అధికారము ఆయనకు గలదు. రిజి ష్టర్లు యితర పుస్తకములను భద్రపరచు బాధ్యత ఆయన వహించవలెను,

8) సభ్యత్వ దరఖాస్తులు. అప్పు దరఖాస్తులు స్వీకరించి వాటిని మొదట వచ్చు పాలకవర్గ సమావేశమునకు నివేదించవలెను. ప్రవేశ పుస్తకములో సభ్యుల పేర్లను నమోదుచేయవలెను.

9) సభ్యుల సేద్యపు భూముల రిజిష్టరు, పరపతి పరిమితి దరఖాస్తులు సకాలములో తయారుచేయు బాధ్యత ఆయనమీద ఉన్నది. బ్యాంకు మంజూరు ననుసరించి నగదు తీసుకొను దరఖాస్తు (Drawal appli_ cation) ఆయన తయారు చేయవలెను. సభ్యులకు అప్పు బట్వాడా సక్రమముగా జరుగునట్లు చూసుబాధ్యత ఆయనది.

10) సభ్యులనుండి రావలసిన అప్పులను సకాలములో వసూలు చేయు టకు కృషి చేయవలెను. వాయిదామీరిన అప్పుల పట్టికలను తయారు చేసి చర్య నిమిత్తము పాలకవర్గ సమావేశములకు సమర్పించవలెను.

11) దావా దరఖాస్తులను, అమలు దరఖాస్తులను తయారుచేయవలెను.

12) సంఘము తరపున దావాలు వేయుట: సంఘంపై వేసిన దావాలకు సమాధానము చెప్పవలసియుండుట అతని బాధ్యతయై ఉన్నది.

13) సంఘ రికార్డులు. యితర ఆస్తులు తనిఖీకి వచ్చు అధికార్లకు అందుబాటులో ఉంచవలసిన బాధ్యత ఆయనపై ఉన్నది.

14) సహకారశాఖకు, ఆర్థిక బ్యాంకుకు సంఘము సమర్పించవలసిన నివేదికలను పంపు బాధ్యత ఆయనది.

15) ఆడిట్ లోపములను తనిఖీలోపములను సవరించుటకు చర్యలు తీసుకొనవలెను, తిరిగి ఆ లోపములు జరగకుండా చూడవలెను.

16) సంఘము ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి సాధించుటకు పరపతేతర కార్యక్రమాలను చేపట్టుటకు, సక్రమముగా పనిచేయుటకు, సర్వతోముఖాభివృద్ధిగాంచుటకు ఆయన కృషి చేయవలయును



# 21 సహకార సంస్థలకు నాయకత్వము

## Leadership for Co-operatives

సహకార ఉద్యమం ప్రజాఉద్యమం. సహకార విధానం వలన సామాన్య ప్రజలుకూడా దేశఆర్థిక వ్యవస్థలో భాగస్వాములు కాగలుగుతున్నారు. ప్రజలు తమ ఆర్థిక బలహీనతల వలన ఇంకా కృంగిపోకుండా, పరస్పర సహాయం వలన స్వయం సహాయాన్ని సాధించుకొని, తమ సమష్టి అవసరాలను, సమష్టి ప్రయోజనాలను సాధించుకొని ఆర్థికంగా ముందుకు పోతున్నారు, వ్యక్తి దోపిడీ విధానాన్నుంచి తమున్నతామ రక్షించుకోగలుగుతున్నారు. సహకార విధానంలో మనము, వ్యక్తులకే అధిక ప్రాధాన్యత ఇస్తున్నాము. వ్యక్తి స్వాతంత్ర్యత, వ్యక్తి సమానత, వ్యక్తి గౌరవము మొదలగు ఉన్నతాదర్శాలు సహకారంలో ఉన్నాయి. ధనాన్ని, వ్యక్తిచేతిలో ఒక సాధనంగా మాత్రమే మనం గుర్తించాము. ప్రతి సభ్యుడూ స్వేచ్ఛగా, వ్యక్తి సమానత ప్రాతిపదికగా యితర సభ్యులతోకలసి పనిచేస్తున్నాడు 'ప్రతీ ఒక్కరూ అందరి కొరకూ, అందరూ ప్రతి ఒక్కరికొరకూ' అనే పద్ధతిలో మనలో ప్రతి ఒక్కరి క్షేమం: అందరి క్షేమంలోనూ ఇమిడిఉంది, కనుక మనం అంతా స్వలాభం స్వసుఖం కోసం మాత్రమేగాక మన అందరి క్షేమంకోసం. కలసి పనిచేస్తున్నా మన్నమాట. అందుచేత సహకార విధానములో కొంతమంది వ్యక్తుల్నేగాక, మొత్తం జాతినే ముందుకు తీసుకుపోయే శక్తి ఉంది. అందరూకలసి పనిచేయడం వలన కల్గే ప్రయోజనాలు, మనలో ప్రతీ ఒక్కరికీ లభిస్తాయి.

సంస్థలు ప్రజాస్వామ్య పద్ధతులలో నడుస్తున్నాయి. ప్రజా స్వామ్యమే, సహకారానికి ఊపిరి, ప్రతీ సభ్యునికి ఒక్క ఓటు మాత్రమే ఉంటుంది. అది తనకు, తన సంస్థకు ఏవిధముగా మంచిదని తోస్తే ఆ విధముగా ఉపయోగిస్తారు. ఏ ప్రక్కనైతే ఎక్కువమంది సభ్యులు తమ అభిప్రాయాల్ని బలపరుస్తారో, వాటినే నిర్ణయించి అమలుపరుస్తారు. పరిపాలనా యంత్రాంగంలో, ప్రతి సభ్యుడూ భాగస్వామే. సంఘంచేసే కార్యక్రమాలు సభ్యులచే నిర్ణయింపబడి సభ్యులకోసం, సభ్యులచే అమలు జరుపబడతాయి. కనుక ఆర్థికంగా ముందుకుపోవడం అనే ఈ కార్య క్రమంలో, మనం, మన వ్యక్తిత్వాన్ని కోల్పోయే ప్రసక్తిలేదు. ప్రతి సభ్యుడూ, తనవ్యక్తి గౌరవాన్ని, వ్యక్తి స్వాతంత్ర్యాన్ని కాపాడు కొంటూ, స్వేచ్ఛగా, తమ నిర్ణయించుకొన్న పద్ధతులలో తాను నమ్మిన సిద్ధాంతాల ననుసరించి, ఆర్థికంగా సాంఘికంగా రాజకీయంగా ముందుకు పోతున్నాడు, మరియు, మన సహకార విధానంలో ఒక సభ్యుడు ఇంకొక సభ్యుని కష్టార్జితం వలన లాభం పొందడమనేదిలేదు. మనం కొంత, న్యాయంగా నిర్ణయించిన మేరకు వాటాధనం మీద లాభం పంచినా, ఎక్కువ మొత్తం లాభాలను, న్యాయ పద్ధతిలో ఎవరైతే సంఘక్షేమం కోసం కృషి చేస్తారో, ఎవరైతే సంఘ కార్యక్రమాలలో పాల్గొంటారో అదేనిష్పత్తిలో వారికి బోనసు లేక రిబేటు రూపంలో లాభాలను పంచు తున్నారు. దీనివలన మనం పూర్తిగా ఆర్థిక న్యాయాన్ని చేకూర్చు తున్నాము. ప్రయివేటు వ్యాపార సంస్థ (Private Enterpirse)లలో ఉంటుందనే సుగుణం, కష్టపడి పనిచేయడానికి కావలసిన ప్రోత్సాహం (Incentives to Produce more) మన విధానంలో ఉన్నది. మరియు పబ్లికు సంస్థ (Pubic enterprise)లలో ప్రాధాన్యత యిచ్చే సాంఘిక ఆర్థిక న్యాయములు (Social and economic justice)

మన విధానంలో ఉన్నాయి. మనదేశపు ఆర్థిక లక్ష్యమైన ప్రజాస్వామ్య స్వామ్యవాద సమాజ వ్యవస్థాపనకు మన సహకార విధానం ఎంతో తోడ్పడుతున్నది. మన సహకార పతాకం, సర్వమానవ సమ్మేళనానికి చిహ్నం, మతసామరస్యానికి, జాతీయ సమైక్యతకు, విశ్వశాంతికి, ప్రతిరూపం మన సహకారం. ఇంద్రధనస్సులో ఏడు రంగులూ తెలుపు రంగులో అంతర్లీనమై పోయినట్లే. వివిధ ఉద్యమాలూ, ప్రవృత్తులూ, భావాలు సహకారంలో విలీనం కాగలవు. కనుక మనకు ఎవరితోనూ సైద్ధాంతికపరమైన సంఘర్షణలు లేవు. ఎవరితోనూ వివాదాలు వద్దు, మనం అన్నిటిలోని, అందరిలోని మంచినే తీసుకుందాం, ఆ మేరకు వారితో సహకరిద్దాం వారిని ప్రోత్సహిద్దాం. అయితే ప్రపంచంలో చెడు, లేదా చెడ్డవాళ్లు లేరని కాదు, కాలమే వారి పొరపాట్లను వారికి తెలియ చెప్తుందని ఆశిద్దాం, ఎవరి అనుభవాల్నుంచి వాళ్ళు పాఠాలు నేర్చుకోక తప్పదు. వాళ్ళూ మన త్రోవకు వచ్చేటట్లయితే చేయూతనిద్దాం.

మనం, 'సహకార ఉద్యమం ప్రజాఉద్యమం' అని అంటున్నాము. నిజానికి, ఎంతమంది సభ్యులు సహకార కార్యక్రమాలలో పాల్గొంటున్నారు, సహకార విధానాలు తెలుసుకొంటున్నారు: ఎంతమందికి సహకార సూత్రాలమీద నమ్మకం ఉన్నది: ఎంతమందిలో ఇతరులతో సహకరించి పనిచేయగల శక్తి ఉన్నది. అనేదే ప్రశ్న. సహకార సంస్థలంటే చాలామందికి తప్పుడు అంచనాలుంటున్నాయి మన నాయకులు సహకార రంగంలో సరిఅయిన నాయకత్వం లేదని పదేపదే హెచ్చరిస్తున్నారు. ఎక్కువ నిర్ణయాధికారాలను, అనధికారులకు ఇవ్వాలని అంటున్నా, అధికారులకే ఎప్పటికప్పుడు నిర్ణయాధికారాలను పెంచుతున్నారు. అనధికారుల స్వేచ్ఛను తగ్గిస్తున్నారు. ఇలా ఎందుకు జరుగుతున్నది అనేది మనం ప్రశ్నించుకోవాలి.

నిజానికి, సభ్యులకు ఎన్నో హక్కులిచ్చినా: ఎన్నో బాధ్యతలున్నా, వాటిని గుర్తించి అమలు జరుపుకోలేక పోతున్నారు, సంస్థలలో చాల మంది సభ్యులు, చదవటం, వ్రాయటం తెలియని వారున్నారు. చదువు కున్న వారున్నా సంస్థల గురించి తెలుసుకోవాలన్న ఆసక్తి, ఉత్సాహం, వారిలో ఉండటం లేదు. ఏ సంస్థఅయినా సక్రమంగా నడచించి అంటే, ఆ సంస్థ అధ్యక్షుడు, పాలకవర్గం, ఎంతో కొంత కష్టించి పనిచేసేవారు, నిజాయితీ అయినవారూ, తాము తీసుకున్న బాధ్యతలని నిర్వహించే వారూ, తమ పదవులకు న్యాయం చేకూర్చేవారూ అని అనుకోవాలి; చాలా సంస్థలలో మహాజనసభలు, పాలకవర్గ సమావేశాలూ సక్రమంగా జరగటం లేదు, అసలు పాలకవర్గ సభ్యులందరూ ఒకచోట చేరటం, అనేదే జరగటంలేదు. నలుగురూ ఒకచోట చేరితేనేకదా, ఆలోచించటం గాని నిర్ణయాలు చేయటంగాని జరుగుతుంది. తాము సంతకం పెడ్తున్నారూ అంటే తమ అభిప్రాయం, తీర్మానంతో ఏకీభవించిందో లేదో తెలుసుకొని పెట్టడంలేదు. అలా తర్కించి ఆలోచించాలన్నా కొన్ని విషయాలు వారికి తెలిసిఉండాలి. అసలు తెలియనప్పుడు ఆలోచించే అవసరమే ఉండదుకదా: సంఘ అధ్యక్షుడో లేక సంఘ గుమాస్తాయో సంతకం చేయమంటే చేసేస్తున్నారు. వ్రేలి ముద్రలు వేసేస్తున్నారు. దీనివలన వారు ఉద్యమానికి చేస్తున్న మంచికంటే, చెడే ఎక్కువ జరుగుతున్నది. ఉన్న అవకాశాలను ఉపయోగించుకో కలిగినంతగా సద్వినియోగం చేసుకోలేక పోవటం, కొన్నిచోట్ల తప్పుడు నిర్ణయాలు చేయటం, సంస్థలను కొంతమంది స్వలాభాలకు వినియోగించుకోగలగటం జరుగుతున్నాయి. ఇవన్నీ, ఒక్క ప్రాథమిక సంస్థలలోనే జరగటంలేదు, కేంద్ర సంస్థలస్థాయిలో కూడా జరుగుతున్నాయి. మనల్ని ఏదైనా ఒక స్థానానికి ప్రజలు ఎన్నుకుంటున్నారంటే, వాళ్లు తమ విశ్వాసాన్ని

మనలో ఉంచుతున్నారన్నమాట, వారి విశ్వాసాన్ని మనం గౌరవించి, వారి ప్రయోజనాలను మనం కాపాడటం నేర్చుకోవాలి. ఎవర్ని ఎన్నుకొన్నా జరుగుతున్నదొకటే అని ప్రజలు తరచూ తమ అభిప్రాయాన్ని వ్యక్తపరుస్తున్నారు. ఇది ఎంతవరకు నిజం, అన్నది పదవులలో ఉన్నవారికి తెలియాలి. ఇంతవరకూ మన పెద్దలు, మనపూర్వీకులు వారి స్వంతధనంతోనే ఎన్నో మంచి కార్యాలు, ప్రజా క్షేమంకోసం చేశారు. ఈవేళ మనం, ప్రజల ధనంతో, ప్రజలిచ్చిన అవకాశాలను సద్వినియోగం చేసుకోలేక పోతున్నాము. ఇది చాలా దురదృష్టకరమైన పరిస్థితిగా మనం గుర్తించుకోవాలి. మనలో ఎంతోమంచితనం ఉంది. ఆలోచించేశక్తి, గ్రహించేశక్తి ఉన్నాయి. ప్రజాసేవ చేయాలనే ఉత్సాహం కూడా ఉంది. అయితే మనం ఏంచేయాలో, ఎలాచేయాలో తెలియనప్పుడు మనం ఏంచేయగలుగుతాము అందుచేత మనం, ఏస్థానానికి ఎన్నుకోబడినా, ఆ బాధ్యతలను నిర్వహించడానికి వీలుగా, దానికి సంబంధించిన చట్టాన్ని, నియమాల్ని, నిబంధనలను, విధానాల్ని, వివరంగా పూర్తిగా తెలుసుకోవాలి. దానికి సంబంధించిన పత్రికలను చదవాలి. విధానాలు ఎంతవరకూ ఆచరణయోగ్యమో పరిశీలించాలి. సభ్యుల అభిప్రాయాల్ని గుర్తించి. గౌరవించాలి. సభ్యులలో తెలియనితనం వలన, తప్పుడు నమ్మకాలేర్పడుతున్నాయి. వారికి సరైన పద్ధతులలో తెలియజెప్పాలి. వారికి ఏమైనా అనుమానాలుంటే విశదపరచి పోగొట్టాలి. మనమనసులు కలిస్తేనే, మనం ద్విగుణీకృతోత్సాహంతో కలిసి పనిచేయగలుగుతాము. సభ్యులు బాధ్యతగల వ్యక్తులుగా రూపొందేటట్టు చూడాలి. సభ్యులు సంస్థల కార్యక్రమాలలో మరింత ఉత్సాహంతో పాల్గొనేటట్టు చూడాలి. అప్పుడే ఇది ప్రజా ఉద్యమం అనిపించుకొంటుంది.

ఈ పదవులను ప్రజాసేవాపదవులుగా గుర్తించాలి. వ్యక్తి స్వార్థానికిగాని, రాజకీయ ఉపయోగానికిగాని దుర్వినియోగం చేయకూడదు. ఎవరైనా మనం మోసం చేయగలం అని అనుకొంటే అది మనల్ని మనమే మోసం చేసుకోవడమవుతుంది. అందరూ అన్ని విషయాలూ ఒక్కసారే గుర్తించకపోవచ్చు. కొంతమంది వెంటనే గుర్తిస్తారు, మరి కొంతమంది ఆలస్యముగా గుర్తిస్తారు. అందుచేత మనం ప్రజలమధ్య ఉండాలంటే వారందరి క్షేమం మనం దృష్టిలో ఉంచుకొని నడచుకోవటం మంచిది. లేకపోతే ఎప్పటికైనా, మనమెంత తెలివైనవారమైనా, ప్రజల మధ్యనుండి దూరముగా తొలగి పోవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. మనం చిన్న చిన్న పనులు క్రమశిక్షణతో సక్రమముగా నెరవేర్చగలిగితే, పెద్దపనులు చేయగల ఆత్మవిశ్వాసం ఏర్పడుతుంది. మన దేశం కూడా ప్రజాస్వామ్య పద్ధతులలోనే నడుస్తున్నది, మన అందరికీ సమానావకాశాలున్నాయి, అవసరమైతే ఇంతకంటే పెద్దస్థానాలలో, ఇంతకంటే పెద్ద బాధ్యతలను నిర్వహించ గలిగిన స్థితిలో మనం ఉండాలి, ఎవరైతే, ప్రత్యేకమైన హోదా ఏమీలేకుండా, సామాన్య సభ్యుడుగా ఉంటూ, తన హక్కులను, బాధ్యతలను గుర్తించి సంస్థలను సక్రమ పంథాలో నడిచేటట్టు చూడగలరో అవకతవకలు, అన్యాయాలు జరుగకుండా నివారించగలరో అట్టివారిని మనం సరైన నాయకులుగా గుర్తించవచ్చు. ఎప్పుడూ ఒకేస్థానాన్ని, అంటిపెట్టుకు ఉండటం మంచి నాయకుని లక్షణం కాదు. రెండవతరానికి చెందిన ద్వితీయశ్రేణి నాయకత్వమును పెంపొందింపచేయాలి, అంటే మన తరువాతకూడా సంస్థలకు సరియైన నాయకత్వము ఉండేటట్లు చూడాలి. మనం మంచి నాయకులం కావాలనుకొంటే మనం కొన్ని ఉన్నత సిద్ధాంతాలకు అంకితమై

పోవాలి, ఇది తప్ప వేరేమార్గంలేదు. మనం మంచినాయకులుగా పెరగటమా? లేక ప్రజలకు దూరముగా ఉండటమా? అనేది ఎవరికి వారు నిర్ణయించుకోవాలి. ఎవరూ పుట్టుకతోనే మంచి నాయకులు కాలేరు. మనలో ఎన్నో బలహీనతలుండవచ్చు ఎన్నోసార్లు మనం మన బలహీనతలకు ఆహుతి అయ్యే పరిస్థితులేర్పడవచ్చు. అయినా, ఎప్పటి కప్పుడు ఆత్మపరిశీలన చేసుకుంటూ, తప్పులను సవరించుకొంటూ, మనల్ని మనం, మంచి నాయకునిగా, క్రమశిక్షణ గలిగిన వ్యక్తిగా రూపొందించుకోవటం అలవర్చుకోవాలి. మనం నిజానికి ప్రజలను ప్రేమించగలగాలి. 'మనం' అనే భావన మనలో కలగాలి. వారి క్షేమం నిరంతరం మన దృష్టిలో ఉండాలి. ఎవరైతే తమ శారీరకశక్తిని, మానసికశక్తిని, ఆర్థిక సంపదను, అవకాశాలను దైవం ప్రసాదించినవిగా భావించగలరో, సర్వజనుల క్షేమానికి వాటిని వినియోగించగలరో, అట్టిశక్తి ఉన్నవారు నిజానికి అదృష్టవంతులు, అట్టివారే, సరిఅయిన నాయకులు కాగలుగుతారు, మన కిప్పుడు అత్యంత ఉన్నత ప్రమాణాలు కల్గిన సహకార నాయకత్వం ఎంతో అవసరం, మీరంతా మరింత మంచినాయకులయి, మీతోటి మానవుల పేదరికాన్ని, ఆకలిబాధను, అజ్ఞానాన్ని సమైక్యంతో పోరాడి నిర్మూలించాలి, సహకార జీవిత విధానంద్వారా ధర్మ, అర్థ, కామ, మోక్షములను పొందవచ్చు. మనమంతా సహకార పంథాలో నడచి ఇహ పరలోకాలల్లో శాంతిసౌఖ్యముల సాధింతము గాక.





సర్వేషాం స్వస్తిర్భవతు
సర్వేషాం శాన్తిర్భవతు
సర్వేషాం పూర్ణంభవతు
సర్వేషాం మంగళంభవతు

( సర్వజనులకూ సుఖం కల్గుగాక
సర్వజనులకూ శాంతి కల్గుగాక
సర్వజనులకూ సంపూర్ణత్వం కల్గుగాక
సర్వజనులకూ శుభం కల్గుగాక )



ఓమ్ అసతోమా సద్గమయ.
తమసోమా జ్యోతిర్గమయ.
మృత్యోర్మా ఽమృతంగమయ.

( మమ్ము అసత్యము నుండి సత్యమునకు;
చీకటి నుండి వెలుతురునకు (అజ్ఞానము నుండి జ్ఞానమునకు);
మృత్యువు నుండి అమృతత్యమునకు కొనిపొమ్ము )

